# పురాణములు



గ్రంథకర్త:
శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి
(దివ్యవాణీ పత్రికాధిపతి)





పబ్లిషరు:
శ్రీరామా బుక్ డిపో : శికింద్రాబాదు.

శ్రీ పరమేశ్వరాయనమః

దివ్యవాణీ సుకృతిప్రాసాదము; } 3 వ సుకృతి.

# పురాణములు.

రచయిత

దివ్యవాణీపత్రికాధిపతి.

చివుకుల అప్పయ్యశాస్త్రి.

శ్రీ గర్గభాగవత వేద వేదాంగ చంద్రికేత్యాది గ్రంథకర్త.

మ॥రా॥శ్రీ॥ పచ్చా శంకరయ్యశ్రేష్ఠిగారి ద్రవ్యసాహాయ్యమున

శ్రీనివాస ప్రింటింగ్ వర్క్సునందు ముద్రించి

ప్రకటింపబడినది.

సికింద్రాబాదు.

1944

 వెల రు. 2-0-0.

# మనవి.

"పురాణం, మానవో ధర్మః, సాంగో వేదశ్చికిత్సితం
ఆజ్ఞాసిద్ధాని, చత్వారి, న హంతివ్యాని హేతుభిః॥(మహాభారతము)

గుణగ్రహణచణులారా!

ప్రాచీనతమంబును, బురుషార్థదంబునునగు మన సనాతన హిందూజాతిధర్మములను, నవ్వానిం బ్రతిపాదించు పవిత్ర గ్రంథములను, సంస్కృతిని నాక్షేపించి తత్ప్రచారమునకు వివిధ విధములం బ్రయత్నించి నిర్మల ధార్మికులనుగూడ మలిన హృదయులనుగాఁ జేయఁజాలినవిదేశీయులు, విదేశీయ శిక్షాశిక్షితులు, నగు నధునాతనప్రబుద్ధులు గొందరు మహాశయులు నానాఁటికిఁ బెరుగఁదొడంగిరి. ఇట్టివారి శంకలకుఁ దగినప్రత్యుత్తరములిచ్చి యథార్థమును స్పష్టీకరింపవలసిన యవసరమెంతేని ధార్మికులకు విధియైయున్నది. దీని ననుసరించి యిటీవల నేర్పరుపఁబడిన "దివ్యవాణీసుకృతప్రసాదము" నందు "పురాణములు" అనెడి యీ కృతి మూఁడవ సుకృతిగాఁ బ్రకటించితిని. ఇందలి గుణావగుణములు వివేకివాఠకలోకమ మెఱుఁగఁగలదు. కాశీవాసులును, సనాతనధార్మిక శతాధిక గ్రంథకర్తలు, సంస్కృతాంగ్లేయ హిందీభాషా విశారదులు నగు శ్రీ స్వామి దయానందులవారి సత్యార్థవివేక నామక గ్రంథములోని యొకింతభాగ మీ కృతికి మాతృకయైనందున శ్రీవారికిఁ గృతజ్ఞతతో నమస్కరించుచున్నాఁడను.

ఇట్టి క్లిష్టసమయములోఁగూడ నుదారబుద్ధితో దీని ప్రథమ ముద్రణ వ్యయభారము వహించిన వదాన్యుఁడును, యశఃకాయ చందా రామన్నగారి మేనల్లుఁడును, సురభూసుర భక్తియుక్తుండు, శ్రీరామాబుక్ డిపో, నాగేంద్రఅండ్ కో ప్రొప్రయిటరుననగు మ॥ రా॥ శ్రీ॥ పచ్బా శంకరయ్యశ్రేష్ఠి (శికింద్రాబాదు) గారి నితోధిక ధార్మిక సంపద వృద్ధులనిచ్చి రక్షించుటకు ధర్మరక్షకుఁడగు పరమేశ్వరునిం బ్రార్థించు చున్నాఁడను.

తారణ
విజయదశమి
27—9—44

సుజనవశంవదుఁడు,
చిపుకుల అప్పయ్యశాస్త్రి.
శికింద్రాబాదు.



# విషయసూచిక.

—:O:—


| విషయము. | పుట. |
|---|---|
| 1. పురాణములు. | 1 |
| 2. పురాణములు నవీనములా? | 13 |
| 3. బ్రాహ్మణభాగమే పురాణమా? | 21 |
| 4. పంచాయతన పూజ యెందులకు? | 24 |
| 5. వ్యాసుఁడొక్కఁడే పురాణములకన్నింటికిని కర్తయా? | 2౮ |
| 6. పురాణములు పిచ్చివ్రాతలతో నిండియున్నవా? | 31 |
| 7. భూగోళ పరిమాణము. | 31 |
| 8. సూర్యచంద్ర గ్రహణములు. | 33 |
| 9. సప్త సముద్రములు. | 37 |
| 10. విష్ణుమూర్తి, బృందాసతి. | 38 |
| 11, పాపమనఁగా నేమి? పుణ్యమనఁగా నేమి? | 41 |
| 12 మనుష్యులకు మృగాదులు పుట్టునా? | 44 |
| 13. అధునాతనుల శంకలు. | 48 |
| 14. ద్రౌపదికి పంచభర్తలగుటకు కారణమేమి? | 50 |
| 15. పురాణములలోని భాష. | 57 |
| 16, బ్రహ్మ, సరస్వతి. | 67 |
| 17. పరకీయ భాష. | 79 |
| 18. శ్రీ భాగవతము. | 81 |
| 19. శ్రీకృష్ణు లిరువురు కలరా? | 84 |
| 20. రాసక్రీడ | ౬5 |

21. గోపికా వస్త్రాపహరణ రహస్యము. 145
22. శ్రీకృష్ణుఁడు పెరుగు వెన్నల దొంగయా? 150
23. శ్రీకృష్ణుఁడు నల్లగానుండుటకుఁ గారణమేమి? 155
24. శ్రీకృష్ణుని యాధిభౌతికశక్తి పూర్ణత్వము. 159
25. శ్రీకృష్ణుఁడు బ్రహ్మచారి. 160
26. శ్రీకృష్ణుని యాధిదైవికశక్తి పూర్ణత్వము. 161
27. శ్రీకృష్ణుని యాధ్యాత్మికశక్తి పూర్ణత్వము. 163
28. గీతాపూర్ణత్వము. ,,
29. ద్వంద్వసామరస్యము. 168
30. శ్రీకృష్ణుఁడు. గోపికలు. 175
31. గోపికలు వ్యభిచారిణులు లేలకారు. 178
32. గోపికలకు ముక్తి యెట్లుచేకూరెను? 185
33. ఆధిదైవిక రాసలీల. 195
34. ఆధ్యాత్మిక రాసలీల. 199
35. దేవాసుర సంగ్రామము. 206
36. గంగోత్పత్తి. 209
37. ఆధిభౌతిక గంగ. ,,
38. ఆధి దైవిక గంగ. 212
39, ఆధ్యాత్మిక గంగ. 220
40. హిందూసతీ చరిత్రములు. 248

---

శ్రీ పరమేశ్వరాయనమః

# పురాణములు

దివ్యవాణీ మయ బ్రహ్మ సూత్రకృన్మునిసత్తమం
వ్యాసం పురాణకర్తారం పారాశర్యం నమామ్యహం ॥

పురాణములు వేదమునకు వ్యాఖ్యాన గ్రంథములు. కాబట్టి యెల్లవిధములను వేదానుకూలములై యుండును. సమాధిదశలో స్ఫురించిన వేదములోని కఠినవిషయములను భిన్నభిన్న భావములతోడ భిన్న భిన్న భాషలలో ననేక విధాలంకార గాథాసహితముగా విస్తరించి పురాణములందు వర్ణింపబడియుండెను.

పురాణములం దొకశబ్దముగాని యొక విషయముగాని వేదవిరుద్ధముగా లేదు. వేదవిరుద్ధముగానున్నట్లు కన్పడినచోట, బుద్ధిదోషమో సమన్వయదోషమో యైయుండును. కాని పురాణములదిగాదు. శ్రీభగవంతుఁ డజుఁడు నిత్యుఁడు శాశ్వతుఁడు పురాణపురుషుఁడు నైయున్నాఁడు. ఇందువలన నతని నిశ్వాసాగతమైన వేదము మరియు వేదమునకు వ్యాఖ్యానగ్రంథములుగానుండు పురాణములుగూడ నిత్యములును, బురాతనములునై యున్నవి. పురాతనము లైనందువలననే వీనికి పురాణములు

అని పేరుగల్గినది. వాజసనేయీ బ్రాహ్మణోపనిషత్తులో నిట్లు వ్రాయబడినది-

> అస్యమహతోభూతస్యనిశ్వసితమేతద్యదృగ్వేదో
> యజుర్వేదస్సామవేదో౽థర్వాంగిరస ఇతిహాసః పురాణం

మంత్రబ్రాహ్మణాత్మకములగు నాలుగు వేదములు, ఇతిహాసము, పురాణము ఈమున్నగునవి మహాపురుషుండగు పరమేశ్వరుని నిశ్వాసములైయున్నవి. నిశ్వాస శబ్దమువలన రెండు విధములగు నర్థములు ప్రతిపన్నము లగుచున్నవి. మొదటిదాని వలన నిశ్వాస మప్రియత్నముగా స్వభావ రూపముతో బయలుదేరినట్లు వేదములును, బురాణములు, మున్నగునవికూడఁ బరమాత్మనుండియే యనాయాసముగానే బయలుదేరినవి. రెండవ దానివలన, నిశ్వాసశబ్దమువలన వేదములకును. బురాణములకును, నిత్యత్వపూర్ణత్వములు సిద్ధించియున్నవి. జీవుఁడు శరీరమునందు రెండువిధములైన యంత్రమగుచున్నాడు. ఒక దానికి "స్వేచ్ఛాసేవక" మనియు, రెండవదానికి "పరేచ్ఛాసేవక" మనియుఁ బేళ్ళు. చేతులు, గాళ్లు, ఈమున్నగుయంత్రములు స్వేచ్ఛాసేవకములు. ఎందులకనఁగా జీవునికోరికననుసరించియే వీనికార్యములగుచుండును. చేయిస్వయముగాఁ జలింపనేరదు. కాళ్లు స్వయముగా నడవవు. జీవునిచలనము వలననే జీవునిగతివలననే, జలించుటయు, నడచుటయుగల్గును. కనుకనివి స్వేచ్ఛాసేవకములు. ఇఁకజీవునికోరికలేకయే శ్వాసయంత్రము,

పాకయంత్రము మున్నగు ననేకయంత్రముల కార్యములు నెర వేరుచున్నవి. శ్వాసగతికిఁ జెప్పవలసిన యవసరములేదు. సమస్తప్రపంచము నిద్రించుచున్నప్పుడు సర్వకార్యము లాగి పోవును. అట్లాగిపోయిన సమయమందుఁ గూడ శ్వాసగతి విరామములేకుండ నడచుచుండును. మరియు జీవునిజన్మప్రభృతి, మరణపర్యంత మొకనిమిషముకూడ విశ్రాంతినిగైకొనక నడు చుచునేయుండును. కనుకఁ బరేచ్ఛాసేవక యంత్రములతో జీవునకు జీవత్వసంబంధ మెక్కువకాఁగలదు. కాలుసేతులను నరికినయెడల మనుష్యుఁడు బ్రతుకఁగలఁడు. కాని శ్వాసయంత్ర ములో నేమాత్రమేని జెడినట్లయితే మనుష్యుఁడప్పుడే మరణిం చును. అనఁగా జీవునకు యావద్ద్రవ్య భావిత్వసంబంధము శ్వాసముతోనున్నది. పురాణములును, వేదములును, భగవంతుని నిశ్వాసములైనప్పుడు పురాణములతోడను, వేదములతోడను భగవంతునకు యావద్ద్రవ్య భావిత్వ సంబంధమున్నదని సిద్ధాంతమయినది. అనఁగా నిత్యసంబంధమున్నది. కావున భగ వంతుఁడుత్పత్తినాశనములు లేనివాఁడగుటచే నిత్యుఁడు. అత్తఱి నతని నిశ్వాస రూపములైన వేదములును బురాణములును నిత్యములగుచున్నవి. ఇందుకు సందేహములేదు ఇదియే నిశ్వా సముజెప్పుటకుఁ దాత్పర్యము. పురాణములను భగవంతుని నిశ్వాసములని చెప్పినందువలన శ్వాసయంత్రముతో జీవుని కన్నిటికంటె ఘనిష్టసంబంధమున్నట్లు భగవంతునకుఁగూడ

స్వాభావికసంబంధము పురాణములతో నున్నదను తత్వము గూడ నిర్ణయమగుచున్నది. కనుక భగవంతుని స్వాభావిక గుణము పురాణములందుఁగూడనున్నది. భగవంతుఁడునిత్యుఁడు. కాఁబట్టి పురాణములును నిత్యములు. జీవులకార్యముల ననుసరించి యాపురాణములు వేదములతో సమానముగాఁ బ్రతి యుగమునందును బ్రకటింపఁ బడుచున్నవి. భారతదేశవాసుల దురదృష్టమువలన సంశయాత్మికాబుద్ధులవలనను, పాపముల నను వేలకొలఁది వేదగ్రంథములు లోపించిపోయినట్లాస్తిక్యము విశ్వాసము మొదలగు సద్గుణములు లేనందుచేతఁ బురాణ గ్రంథములలోఁ గూడఁ జాలవఱకు లోపించిపోయినవి. మఱియు ననేకస్థలములందు ప్రక్షిప్తాంశములు గూడఁ జేరినవి. భగవంతుని రెండవ గుణమేమనగా, భగవంతుఁడు పూర్ణుఁడుకనుక బురాణములును బూర్ణములు. పురాణములందుండెడి నీపూర్ణత్వము త్రివిధ భాషలయందుఁ గలదు. ఇదిత్రిభావములందును గలదు. త్రిగుణముల ననుసరించి త్రివిధాధికార వర్ణనమందును గలదు. ఇదియే ప్రకృతి, ప్రవృత్తులననుసరించి యెల్లరీతుల నుండు జనులకు మేలుజేయుటయందును గలదు. ఇదియే కర్మము యొక్కయు, జ్ఞానముయొక్కయుఁ దత్వము నిర్ణయించెడి జ్ఞాన గంభీరిమ యందును గలదు. ఇది భక్తిమాధుర్యమునందును, కర్మయోగములోని యాత్మత్యాగమందును గలదు. ఇదియే పరమాస్తిక్యమునందును గలదు. ఇదియే విభిన్నభావములను

సమన్వయించి చిత్తమును వినోదింపఁ జేయుటయందును గలదు ఇదియే ధర్మసంకటములందలి చర్చలయందును సామాజిక, రాజనైతిక, ధార్మికాచారవిధి వ్యవస్థలయందును గలదు మఱియు నిది యాదర్శ చరిత్రములోని విచిత్ర చరిత్రములను జెప్పి ప్రపంచమును నభివృద్ధి పరచుటయందును గలదు. కాఁబట్టియే వేదములందు బురాణములంగూర్చి యిన్ని ప్రమాణములు చిక్కుచున్నవి. ఛాందోగ్యోపనిషత్తులో నిట్లున్నది.

ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదఁ సామవేదమథర్వణం
చతుర్థమితిహాసంపురాణం పంచమం వేదానాం వేదమిత్యాది॥

నేనుఋగ్యజుస్సామాథర్వవేదముల నెఱుగుదును. మఱియు నైదవ వేదమగు నితిహాసపురాణములనుగూడ నేనెఱుఁగుదు. గోపథబ్రాహ్మణములో నిట్లులిఖింపబడినది.

"ఏవమిమే సర్వేవేదా నిర్మితాస్సకల్పా స్సరహస్యాస్స బ్రాహ్మణా స్సోపనిషత్కా స్సేతిహాసా స్సాన్వాఖ్యాతా స్సపురాణా స్సస్వరా స్ససంస్కారా స్సనిరుక్తా స్సానుశాసనా స్సానుమార్జనా స్సవాకోవాక్యాస్తేషాం యజ్ఞమభిపద్యమానానాం భిద్యతే నామధేయం యజ్ఞమిత్యేవాచక్షతే.॥

ఈమంత్రములో బ్రాహ్మణము, ఉపనిషత్తులు, నిరుక్తము, కల్పము, ఇతిహాసము, పురాణము మున్నగువాని నామములు వేలు వేలుగాఁ జెప్పఁబడినవి. ఇవి ప్రమాణములు

వేదములోని బ్రాహ్మణ భాగమునే పురాణములని చెప్పెడి కల్పనము మిథ్యాకల్పనమై యున్నది. అథర్వ వేదమందిట్లు వ్రాయబడినది.

"స బృంహతీం దిశమనువ్యచలత్తమితిహాసశ్చ పురాణంచ గాథాశ్చ నారాశగ్ంసీశ్చానువ్యచలన్ ఇతిహాసస్యచ వైసపురాణస్యచ గాథానాంచ నారాశగ్ంసీనాంచ ప్రియం ధామ భవతి య ఏవం వేదః"

దీనివలన గూడ వేదములోని సంహితా భాగమందుగూడ బురాణము లుల్లేఖింపబడి నట్లు సిద్ధించుచున్నది. మనుస్మృతి యందిట్లు లిఖింపఁబడినది.

"స్వాధ్యాయం శ్రావయేత్పిత్ర్యే, ధర్మశాస్త్రాణి చైవహి ఆఖ్యానా నీతిహాసాంశ్చ పురాణాన్యఖిలానిచ"

శ్రాద్ధమందు వేదములు, ధర్మశాస్త్రములు, ఆఖ్యానములు పురాణములు మున్నగు వానిని వినిపింపవలయును.

పురాణములు భారతదేశీయుల కత్యంత ప్రియములు ఇప్పుడుగూడ భరత వర్ష మందలి యెల్లచోట్ల నెల్లగ్రంథముల కంటే బురాణగ్రంథముల ప్రచార మెక్కువగా నున్నది. ఇట్టి గ్రంథాదరణము కేవల మొక్క భారత వర్షమందే కాదు, ప్రపంచమందలి సకల ధర్మావలంబుల యందుగూడ నిట్టి గ్రంథముల ప్రచార మున్నట్లును, సామాన్య జనులలో నీరీతిగానే

గ్రంథాదరణ మున్నట్లును విచారించినమీదఁ దెలియఁగలదు. ఇందులకుఁగారణ మేమనగా, ధార్మిక గంభీర గ్రంథములను విచారించుటలో సరళములగు నితిహాసములతోనిండిన ధర్మ గ్రంథములను జదివినంత యభిరుచి యింకొక దానివలన సామాన్యజనులకు గలుగక పోవుటయే. చూడుఁడు. క్రైస్తవ ధర్మమునందు యేసుక్రీస్తుకు సంబంధించిన యెట్టి పురాణ గ్రంథమును గన్పడుటలేదు. కాని యతడు దేహత్యాగ మొనరించిన తరువాత నతని శిష్యులవలన ననేక గ్రంథములిట్టివి ప్రకాశపరుపబడినవి. మరియు నిప్పటికిని క్రైస్తవులలో వానిప్రచారము బాగుగా నున్నది. ఇట్లే మహమ్మదధర్మావలంబులకుగూడ "ఖురాను" అను నదియే ప్రధానగ్రంథము. అట్లయినప్పటికి నతనితరువాత నతనిభక్తులయొక్క యైతిహాసిక గ్రంథములు గూడ మిక్కిలి యాదరముతో దద్ధర్మావలంబులలో బ్రచారములైయున్నవి. వెండియు బౌద్ధ, జైన ధర్మావలంబుల సంగతి వేరుగాఁ జెప్పవలయునా? ఎందులకన, వీరి ధర్మగ్రంథములలోఁ జాలభాగము గ్రంథములు మా పురాణగ్రంథముల ననుసరించియే రచింపబడినవి. మరియు వానియాదర మీ సాంప్రదాయముల కంటెను విస్తారముగా నున్నది. శాస్త్రకారులు పురాణములంగూర్చి యిట్లు నుడువుచున్నారు.

" సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశ్యానాం వంశచరితం పురాణం పంచలక్షణమ్ "

మహాభూతములసృష్టి సమస్త చరాచరసృష్టి, వంశావళి, మన్వంతర వర్ణనము, ప్రధానప్రధాన వంశములయొక్కయు, ప్రధానప్రధాన వ్యక్తులయొక్కయు, జక్కని వివరణము ఇది పురాణముల పంచలక్షణములు. బ్రహ్మవైవర్త పురాణములో మహాపురాణ లక్షణమిట్లు వ్రాయబడినది.

సృష్టిశ్చాపి విసృష్టిశ్చ స్థితిస్తేషాం చ పాలనం
కర్మణాం వాసనావార్తామనూనాంతు క్రమేణచ॥
వర్ణనం ప్రలయానాంచ మోక్షస్యచ నిరూపణం
ఉత్కీర్తనం హరేరేవ దేవానాంచ పృథక్పృథక్॥

మూలసృష్టిని, విశేషవిస్తృతసృష్టి, జగత్స్థితి, జగత్పాలనము, కర్మవాసన, మనువుల ప్రకాశక్రమము ప్రలయము, మోక్షము, హరికీర్తనము, దేవతల ప్రత్యేక గుణవర్ణనము, ఈ పది మహాపురాణములయుక్క లక్షణములై యున్నవి. లక్షణంబులను సూచించినంతమాత్రముననే యావశ్యకీయములగు సుద్దేశములను సాధించుటకై త్రికాలదర్శులగు ఆమహర్షులు పురాణములను ప్రకాశపరచిరి. చిరజీవియగు పురాణశాస్త్రము చిరకాలమునుండియే మా సనాతనధర్మమును రక్షించుచున్నవి. మరియు ప్రస్తుతమున నీ యాపత్కాలములోగూడ సర్వవిధాధికారులను దండ్రివలె గాపాడుచున్నది. శ్రీ వేదవ్యాస భగవానులవారు మహాపురాణములు పదునెనిమిదని చెప్పియున్నారు.

అష్టాదశ పురాణాని, పురాణజ్ఞాః ప్రచక్షతే
బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతం తథా॥
తథా న్యం నారదీయంచ మార్కండేయంచ సప్తమం
ఆగ్నేయ మష్టమంచైవ, భవిష్యం నవమం స్మృతం॥
దశమం బ్రహ్మవైవర్తం, లైంగమేకాదశం స్మృతం
వారాహం ద్వాదశంచైవ, స్కాందంచైవ త్రయోదశం
చతుర్దశం వామనంచ, కౌర్మం పంచదశం స్మృతం
మాత్స్యంచ గారుడంచైవ బ్రహ్మాండంచ తతఃపరం॥

1. బ్రహ్మపురాణము 2. పద్మపురాణము 3. విష్ణుపురాణము 4. శివపురాణము 5. భాగవతము 6. నారదపురాణము 7. మార్కండేయపురాణము, 8. అగ్నిపురాణము 9. భవిష్యపురాణము, 10. బ్రహ్మవైవర్త పురాణము, 11. లింగపురాణము, 12. వారాహపురాణము, 13. స్కాందపురాణము, 14. వామనపురాణము 15. కూర్మపురాణము 16. మత్స్యపురాణము 17. గరుడపురాణము 18. బ్రహ్మాండపురాణము. ఇవి యష్టాదశ మహాపురాణములు. అట్లే యుపపురాణములు గూడ పదునెనిమిది. వేదవ్యాసుల వారిట్లు వచించుచున్నారు.

ఆద్యం సనత్కుమారోక్త నారసింహ మథా పరం
తృతీయం వాయవంచ, కుమారేణా ను భాషితం
చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశ భాషితం
దుర్వాస ప్రోక్త మాశ్చర్యం నారదీయ మతఃపరం
నంది కేశ్వర యుగ్మంచ తథైవోశన సేరితం
కాపిలం వారుణంసాంబం కాలికాహ్వాయ మేవచ॥

మాహేశ్వరం శుభాదేనీ శైవం సర్వార్థ సాధకం
పరాశరోక్త మపరం మారీచం భాస్కరాహ్వయం॥

1. సనత్కుమారునిచే జెప్పబడిన పురాణము 2. నారసింహపురాణము 3. వాయవీయపురాణము 4. నందీశునిచే జెప్పబడిన శివధర్మము 5. దుర్వాసునిపురాణము 6. నారదీయము 7. 8 నందికేశ్వరుని రెండుపురాణములు 9. ఉశనునిపురాణము 10. కాపిలపురాణము 11. వరుణపురాణము 12. సాంబపురాణము 13. కాలికాపురాణము 14. మాహేశ్వరము 15. శైవము 16. పారాశర పురాణము 17. మారీచపురాణము 18. భాస్కరపురాణము. ఈపదునెనిమిది యుపపురాణములు. వీనియందు మహా పురాణోపపురాణ విషయచర్చలో నొకపురాణము సాంప్రదాయిక మతభేదమునుబట్టి తారుమారగుచున్నది. ఎట్లన, భాగవత పురాణమును దేవీభక్తులు దేవీభాగవతమని చెప్పి మహాపురాణ మనియనెదరు. ఇక విష్ణుభక్తులగువారిందులకు విరుద్ధముగా విష్ణుభాగవతము మహాపురాణమని వచించెదరు.

మీదచెప్పబడిన ముప్పదియారు పురాణములే కాక యింకొన్నిపురాణముల నామములు లభించుచున్నవి. ఇవియన్నియు ఔపపురాణములు. ఔపపురాణముల సంఖ్య గూడ బదునెనిమిది. ఇట్లు పురాణశాస్త్రము, మహాపురాణము, ఉపపురాణము, ఔపపురాణము, ఇతిహాసము, పురాణసంహిత, యను నీయైదు

భాగములలో విభజింపబడినది. పురాణగ్రంథములుగూడఁ జాల లోపించిపోయినవి.

మరియు గొన్నికొన్ని కారణములనుబట్టి ప్రతి స్థానమందును బ్రక్షిప్తాంశములు చేర్పఁబడి సరియైనస్థితిలో లేకుండనున్నవి. ఇది యవస్థాభేదముచే హానికారకముగూడ నగును. పురాణముల కంటె వేరుగానున్న యితిహాస గ్రంథములుగూడఁ బురాణము లలో నంతర్గతములైయున్నవి. చూడుఁడు. శ్రీమహాభారతము శ్రీమద్రామాయణములు, హరివంశము మహాభారతములో నంతర్గతమని యెంచఁబడినది. పురాణములను, నితిహాసములను, గొందరాచార్యులీరీతిగాఁ గూడ విభజించిరి. ఎట్లనఁగా కర్మ విజ్ఞానము ప్రధానముగాఁగలది మహాభారతము. జ్ఞానము ప్రధానముగాఁ గలది శ్రీమద్రామాయణము. పంచోపాస నము ప్రధానముగాఁగలవి ఇతర పురాణములు. వాస్తవముగా నితర పురాణములలోఁ బ్రాయముగాఁ బంచోపాసనకు సృష్టి గావింపఁబడినది. జగజ్జన్మమున కాదికారణమని తలచియే కొందఱు శ్రీవిష్ణువును గొందరు శ్రీసూర్యుని గొందరు శ్రీభగవతిని, గొందఱు శ్రీగణపతిని మరికొందఱు శ్రీ సదాశివుని నుపాసించుటయు, సమర్థింపబడినది. పురాణములకు నితిహాసములకును, బ్రధానముగానున్న పార్థక్య (భేదము) మేమనగా, ఇతిహాసములలోఁ బ్రాచీనములగు నాఖ్యాయిక (వాస్తవమైన చరిత్రములు) లెక్కువగాను, సృష్టి మున్నగువాని

తత్త్వము దక్కువగాను, జూపఁబడును. ఇఁకఁబురాణములలో సృష్టి మొదలగువాని వృత్తాంతమెక్కువగాను, బ్రాచీనములగు నితివృత్తములు తక్కువగాను, జూపబడును. కాని పురాణముల లోని యంశములితిహాసమునందు నితిహాసములలోని యంశములు పురాణములందును విశేషముగానొప్పుచుండును. ఎట్లనగా, మహా భారతములోని శాంతిపర్వమునందు భీష్ములవారుపదేశించు పట్టునఁ బురాణాంశములు చాలఁగలవు. మరియు శ్రీమద్భా గవతమందుఁ గృష్ణలీల మున్నగు నితిహాసాంశములుగూడఁ జాల గలవు. కాబట్టి యితిహాసములలో నేయంశములు బురాణము లవోయేయంశము లితిహాసములవో, వీనిని కక్కఁగాఁ గుర్తె రింగి చదువవలయును. లేనిచో భ్రాంతి గలుగ.గలదు.—

ఆర్వాచీనులగు పురుషులు పురాణములలోని తత్త్వమెఱుంగ జాలక సందేహజాలమునందు స్రబ్ధులగుచున్నారు. పాశ్చాత్య పండితులలో ననేకులు,, బ్రాచ్యవిద్వాంసులలో ననేకులు ననేక విధములుగా సందేహించుచున్నారు. వారి సమస్తసందేహము లను బ్రధానముగా మూడు భాగములందు విభజింపవచ్చును. (౧) పురాణములు ప్రాచీన గ్రంథములు గావు. నవీనములు. (౨) వేదములోని బ్రాహ్మణ భాగమే పురాణము. అదిగాక యేపురాణగ్రంథములు ప్రసిద్ధములై చిక్కుచున్నవో యవి యన్నియు సాంప్రదాయికులగు పురుషులచే గల్పింపబడినవి. (3) పురాణములందలి పెక్కు విషయములు విజ్ఞానవిరుద్ధములు,

భూగోళవిరుద్ధములు లైనందువలన బూటకములై యాధునిక పండితుల కాగ్రహము గల్గించుచున్నవి. మరియుఁ బ్రపంచము నకు హానిగల్గించు భీభత్సరసము గూడఁ బురాణములలో నవత రింప జేయబడినది. అందువలనఁ బురాణము లెల్లరీతులఁ ద్యజింపదగినవి. ఇప్పుడీ సందేహములు నొక్కొక్కటిగా జేసి ఖండింపబడుచున్నవి.

## -*) పురాణములు నవీనములా? (*-

(౧)పురాణములు నవీనగ్రంథములనునది మొదటి సంశయ మైయున్నది. ఈవిషయమును గురించి చెప్పెడి వాదములలో ముఖ్యమగు వాదమేమనగా, పురాణములందనేక విషయములును ననేకవర్ణనములును, నవీనములైయున్నవి. కాబట్టియావిషయము లుజనించిన తరువాతనే యీపురాణములు తప్పక రచింపబడి నవనెడి వాదము ప్రధానమైయున్నది. పాశ్చాత్యపండితులు సాధారణముగా నీయుక్తివాదమునేచేయుచున్నారు. కొందఱు "పురాణములలో బుద్ధదేవుని ప్రసంగము చిక్కుచున్నది. కాబట్టి సర్వపురాణములుగూడ బుద్ధుడు జన్మించిన పిమ్మటనే విరచింపబడినవని యనెదరు. మరికొందఱు వైష్ణవ సాంప్రదా యములు బయలు వెడలినప్పుడు వాని వృత్తాంతములు శ్రీమ ద్భాగవత బ్రహ్మవైవర్తపురాణ పద్మపురాణములందున్నవి. కాబట్టి యీమూడు పురాణములు, పదునేనవ శతాబ్దివరకు రచింపఁబడినవని వచించెదరు. ఇంకఁగొందరు స్కాందపురాణ

ము-లో జగన్నాథుని మందిరముం గూర్చిన విషయములు వ్రాయఁబడినవి. కాన స్కాందపురాణము నవీనమని పల్కెదరు. ఇట్లర్వాచీనులగు వారు తమతమ బుద్ధిననుసరించి యనేక యుక్తులతో వివరించుచున్నారు. కాని విచారించినమీఁద శాస్త్రమర్మము గుర్తెఱింగిన వారిదగ్గర నిట్టియుక్తులు బొత్తుగా నిలువజాలవు. పురాణము-లలో నేదేని యితిహాసములను చూడఁగనే యాపురాణ మాయితిహాసమయిన యనంతరము రచింపఁబడినదని యనుటకుఁ గారణముగాఁ జూపించుట హాస్యాస్పదముగా గలదు. ఎట్లందురా? వేదములోని బ్రాహ్మణభాగములో విశేషముగా ననేక రాజులయొక్క యితిహాసములు వ్రాయబడినందున "బ్రాహ్మణభాగమా రాజులు జన్మించిన మీఁద నే రచింపబడినదగుటచే నపౌరుషేయము భగవద్వాక్యము కానేర" దని చెప్పెడి నర్వాచీనులగు కొందరివాదము సత్యము గావలసివచ్చును. అట్లుగాలేదుగదా! కాబట్టి హాస్యాస్పదమైనది. ఇట్టి నిస్సారములగు యుక్తుల నెన్నిటినో వేదములోని యధ్యాయమందుఁ జూపియుంటిమి. ఇత్తఱి బురాణముల విషయములో గూడ నిట్టి యుక్తులనే యర్వాచీనులగు వారు చూపించెదరు. కనుక నివిగూడఁ బూర్వసిద్ధాంతము ననుసరించి యిట్లే నిస్సారములైనవి. పురాణము-లలోనుండు నితివృత్తములను జూచికాలనిర్ణయమును జేయఁదలఁచినప్పటికి నొకకాలమని నిర్ణయించుటకు వీలులేదు. ఎందుల కందురా? పురాణములలో నేటివరకు

గూడ జరిగి యుండనివియు భవిష్యత్తునందు జరుగనవియు విషయములు వ్రాయఁబడినవి.

కలిలక్షణము, కల్కియొక్క యవతార జన్మము మున్నగునవి యిందులకుదాహరణములు. ఈవిషయములన్నియు నాపురాణములలో వ్రాయఁబడియున్నవి. ఇఁక బురాణములు జన్మించిన దినమెట్లునిక్కగలదు? ఏమన. అర్వాచీనపురుషుల సిద్ధాంతములను బట్టి యాపురాణములకు జన్మదినమే లేకపోవలసియుండెడిది. ఎందులకన, ఆపురాణములలోని విషయములింతవరకు జరిగియుండలేదు. ఎన్నోవిషయములు భవిష్యత్కాలగర్భములో నున్నవి. రెండవది భవిష్యత్కాలమందు జరుగవలసిన విషయములు జరిగినప్పుడటుతర్వాతివారు గూడ నావిషయములు జరిగిన తరువాతనే యాపురాణములు జన్మించినందునవానిలో నావిషయములు లభించుచున్నవని సిద్ధాంతీకరింపవలసినదేనా? ఇట్టివారి సిద్ధాంతమెల్లవిధముల మిథ్యగాదా? అట్లయినప్పుడు ప్రస్తుతకాలమందలి యదూరదర్శులగు వారిట్టి యుక్తులను గైకొని పురాణములాధునికములని చెప్పెడి సిద్ధాంతముగూడ నన్నిరీతుల నసత్యమని నిశ్చయమగుచున్నది. నేటికాలమున విజ్ఞానోన్నతిగల దినములలోని జ్యోతిషగణనమూలమున నేసంవత్సరమం దేసమయమున నేదేశములో నేరీతిగా జంద్రగ్రహణముగాని సూర్యగ్రహణముగాని యగునది నిశ్చయముగాఁగలదు. ఈవిషయములన్నియు బంచాంగములో

మొదటినుండియే వ్రాయఁబడియుండెను. అప్పుడు దీనింబట్టి జ్యోతిర్గణనము లేక పంచాంగములోని విషయములు సూర్య గ్రహణము లేక చంద్రగ్రహణమైన పిమ్మట గల్పింపబడినవై యుండవచ్చునని సిద్ధాంత మొనరింపవలసినదేనా? ఎన్నటికిని సిద్ధాంతరీకరింప కూడదు. సాధారణమగు గణితశాస్త్రము యొక్క సహాయముచేఁగాని, వైజ్ఞానిక సహాయముచేఁగాని సంపాదించినదూరదృష్టితో సాధారణమనుష్యులే ముందెప్పుడో జరుగఁబోవు సంగతులు, వచించినట్లాయాకాలములందు సరిగా జరుగుచున్నప్పుడిఁక చతుర్దశభువనంబులను భేదించి యందలి విషయంబులను గరతలామలకంబుల వలెఁ జూపఁజాలిన త్రికాల దర్శులగు మహర్షులయొక్క జ్ఞానరూపమగు దివ్యదృష్టిద్వార మున భవిష్యత్కాలమందు జరుగబోవు కొన్ని విషయంబులు గోచరించి యాయాకాలములం దవి జరుగుట యసంభవ మగునా? అట్లసంభవమగునని యోగులు జ్ఞానులునగు మహర్షుల విషయమై శంకింపవలసిన యవసరముగలదా? అవసరము లేదు, ప్రస్తుతకాలమున యోగశక్తి చాలవరకు లోపించిపోయి నది. పోవుచున్నది. మహర్షులేజ్ఞానముచే భవిష్యత్కాలస్థితి గుర్తెరుంగఁజాలుదురో యాజ్ఞానముగూడఁ గలికల్మష దూషి తాంతఃకరణమందుఁ బ్రకాశింపనేరదు. ఇందువలన ఋషుల యందేమిశక్తియున్నదియో దానిని గని పెట్టుటయు దుస్తర మైపోయినది. కాబట్టి యిట్టిసందేహములు గలుగుటయు, నిందు

లకు దగిన యుక్తులు గూడ గనుపడుటయు సంభవించుచున్నది. ఇంతవరకుఁదేలిన సారాంశమేమనఁగా, మనశక్తి నష్టమైపోయి నదనియు ఋషులయొక్క జ్ఞానశక్తి యెంతమాత్రమసత్యము గాదనియు దేలినది. మహర్షులు త్రికాలదర్శులై యున్నారు. వారియొక్క జ్ఞాననేత్రముల సాన్నిధ్యమున భారతదేశములో భవిష్యత్కాలమం దేయేసంగతులు జరుగగలవని గోచరించు చున్నవో యవియన్నియుఁ బురాణములయం దామహర్షులచే లిఖింపబడియున్నవి. వానియందుఁ గ్రొత్తగాఁ గల్పింపఁ బడిన సంగతి యెప్పుడనులేదు. ఇప్పుడు మహర్షులెట్లు, భవిష్యత్కాల సమాచారములను గనిపెట్టిరో యది చూపఁబడుచున్నది. మహర్షిపతంజలులవారు యోగదర్శనమందిట్లు వ్రాసి యున్నారు.

సంస్కార సంయమాత్పరచిత్తజ్ఞానం॥

సంస్కారముపై సంయమము గావించుటచేత నితరుని చిత్తము దెలియుచున్నది. ఇతరుని చిత్తమందలి విషయములను జూప జాలిన శారీనాఁడును జిక్కుచున్నారు. చిత్తము(అంతఃకరణము) యొక్కశక్తి యపారమై యున్నది. అట్టి చిత్తశక్తిని విమయిగాఁజేసి విషయమునందుఁ బ్రవేశింపచేయుటచేత విష యాసమూహ మింకననేకవిషయ వ్యాపారములను జేయఁగ లదు. మరియు నట్టిశక్తినే బాహ్యవిషయములనుండి తొలగించి చిత్తము నేకాగ్రముగాఁజేసి లోనఁబ్రవేశ పెట్టుటచేత అంత

రాజ్యములోని యనేకవిషయములు దెలియబడును. యోగులును మహర్షులును జితేంద్రియులై చిత్తశక్తిని నంతరాజ్యమందు బ్రవేశపెట్టి యీప్రకారముగా నంతరాజ్యములోని విషయములను దెలిసికొనుచున్నారు. ఎట్లు చిత్తవృత్తి నంతర్ముఖముగా జేయుటచేత యోగి తనలోని విషయములను దెలిసికొనజాలుచున్నాడో అట్లే సంయమమొనరించుటవలన బరచిత్తజ్ఞానమును బొందుటకుగూడ వీలు గల్గుచున్నది. స్థూలములగు పంచభూతములవలన ప్రపంచసృష్టియైనది. అందుచేత సృష్టిలోని సమస్తపదార్థములకును నుపాదానమొకటియే. ఆప్రకారమే సూక్ష్మములగు పంచభూతములవలన నంతఃకరణము గలిగినది. కాబట్టి ప్రత్యేకజీవుని యంతఃకరణమునకు నుపాదాన మొకటియే యైయున్నది. దీనింబట్టి సమస్తాంతఃకరణములకును నునికిపట్టొక్కటియే యని తేలినది. ఒకజీవుని యంతఃకరణముతో మరియొకజీవుని యంతఃకరణముయొక్క భూమి (ఉనికిపట్టు) యభిన్నమైయున్నను, బాహ్యదృష్టిలో నేభేదము బ్రతీతి యగుచున్నదో దానియొక్క కారణము సంస్కారముయొక్క భేదమే యైయున్నది. ఒకని వ్యవసాయమునందు గోధుమలును, మరియొకని సేద్యమునందు వడ్లును, నింకొకనికృషియందు శనగలును బండుచున్నవని యనుకొనుడు. గోధుమలు, వడ్లు, శనగలనెడి యీమూడింటియందును భేదము బాహ్యదృష్టికి గోచరించుచున్నప్పటికి మట్టియొక్క విచారమునుబట్టి పొలము

లన్నియు నొకటియే. అట్లే కర్మానుసారమొకమనుష్యుని చిత్తమందలి సంస్కారమొకరీతిగను, మరియొకరి చిత్తమందలి సంస్కారము మరియొకరకముగను, నున్నప్పటికిని చిత్తము యొక్క యునికిపట్టునుగూర్చి విచారించినయెడల చిత్తము లన్నియు నొకటియేయనియు నందేభేదము లేదనియు దెలియ గలదు. దీనింబట్టి యొకచిత్తముతో మరియొకచిత్తమునకు స్వాభావికసంబంధ మున్నదని గ్రహింపవచ్చును.

కేవలము సంస్కారములయొక్క భేదము చేతనే సంబంధము భిన్నమగుచున్నట్టుగా బ్రతీతి యగుచున్నది. కాఁబట్టి యొకమనుష్యుఁ డితర మనుజుని చిత్తమును దెలిసికొనవలయు నని యిచ్ఛయున్నయెడలఁ నతండు దొలుతనే పతంజలిమహర్షి యొక్క సిద్ధాంతము ననుసరించి చిత్తము నేకాగ్రమొనరించి తనచిత్తమందలిసంస్కారముల లయింపచేయవలెను. దీనివలనఁ దన చిత్తభూమి, యితర చిత్తభూమితోఁగూడఁ గలిసిపోఁ గలదు, ఇట్లు భూములు గలిసినతరువాత నితరుని చిత్తభూమి యందేయేసంస్కారము కర్మానుసారము నిండియున్నదో యాయాసంస్కారము లన్నియు సంయమియగు యోగి కొక్కొక్కటిచొప్పున గోచరించి రాఁగలవు. ఇట్లు సంస్కారములపై సంయమము గావించుటచేత నితర చిత్తజ్ఞానము గలుగఁగలదు.

ఇదియే యోగదర్శనసిద్ధాంతమై యున్నది. ఎట్లువ్యష్ట్యంతఃకరణమనఁగా నొక జీవుని యంతఃకరణముయొక్క సంస్కారముపైసంయమ మొనరించుటచేత నాయంతఃకరణజ్ఞానమువ్యక్తమగుచున్నదో యట్లే సరిగా సమష్ట్యంతఃకరణమనఁగా సమస్త బ్రహ్మాండమందలి యంతఃకరణములందుండు సంస్కారములపై సంయమ మొనరించినఁ యెడల బ్రహ్మాండగతాంతఃకరణజ్ఞానము వ్యక్తముగాఁగలదు. బ్రహ్మాండాంతఃకరణములం దేసంస్కారరాశులు గలవో యవియన్నియు నా బ్రహ్మాండములందు బుట్టుచుండెడి జీవుని కర్మముల ననుసరించియే కాఁగలవు. ఆ సంస్కారముల ననుసరించియే బ్రహ్మాండమందు భిన్నభిన్న యుగములును, దదనుసారముగా మనుష్యుల యుత్పత్తియు, యుగధర్మానుసారముగా మనుజులయొక్క ధర్మప్రవృత్తియు, సుఖదుఃఖాది భోగములును, నవతారములు గలుగుటయు మున్నగు నవియన్నియు నగుచుండును. మహర్షులు తమ యంతఃకరణ భూమిని సంయమ మొనరించి దానిద్వారమున బ్రహ్మాండాంతఃకరణముతోఁ గలిసి తర్వాత బ్రహ్మాండాంతఃకరణములందలి యుగానుసారములగు భిన్నభిన్న సంస్కారముల నొక్కొక్కటిగాఁ ముందుగనే చూచుకొనుచుందురు. దీనివలననే యా ఋషులకు భూత భవిష్యద్వర్తమాన జ్ఞానము కలుగుచున్నది. వెండియు నాజ్ఞానముయొక్క విషయమే పురాణములందు వ్రాయఁబడినది. ఇదియే పురాణములందు భవిష్యత్కాలమందు

జరుగబోవు ననేకేతివృత్తములు వ్రాయఁబడుటకుఁ గారణమైనది. యుగము వచ్చుటకు ముందుగానే యే యుగమునం దేప్రకార ముగా ధర్మము నడచునది. మనుష్యు డెట్లు జనించునది, వాని యాచరణ మెట్లుండు ననునది లోనగు నీవిషయములన్నియు వీనియందు వ్రాయబడియున్నవి. ఈకారణములనుబట్టి పురా ణములకు నవీనత్వము గల్పించుట యెల్లవిధములఁ బ్రమాద కరము నజ్ఞానకృతము నైయున్నది.

=*) బ్రాహ్మణభాగమే పురాణమా? (*=

(2) రెండవశంక యేమనగా, వేదమందలి బ్రాహ్మణ భాగమే పురాణము. ఇది తప్ప వేరు పురాణములు బ్రాహ్మ ణులయొక్కయు, సాంప్రదాయిక పురుషులయొక్కయుఁ గపోలకల్పనామాత్రములై యున్నవని; బ్రాహ్మణభాగముపౌరు షేయమని కాని పురాణములని కాని చెప్పకూడదు. అది అపౌ రుషేయమును భగవద్వాక్యము నై యున్నది. రెండియు నది మంత్రభాగమువలె వేదములోని యొక భాగమై యున్నది. ఈవిషయమును గూర్చి బహుయుక్తులతో వేదవేదాంగచంద్రి యం దీవరకే సమర్థింపఁబడినది. అది తుదివరకుఁ జదివినచో బ్రాహ్మణ భాగమును బురాణమని చెప్పెడి భ్రాంతి దొలఁగి పోఁగలదు. ఇప్పుడు పురాణములు సాంప్రదాయిక పక్ష పాత గ్రంథములనియు, గపోలకల్పితములనియును, నవీనులు చూపెడి యుక్తులను గూర్చి చర్చించెదముగాక!.

శివపురాణమునందు శివుఁడనెడివాఁ డొకఁడు పరమే శ్వరుఁడుగాఁ దలపఁబడి విష్ణుమూర్తి, గణపతి, మున్నగువారా శివునకు దాసులుగాఁ గల్పింపఁబడిరి. ఇట్లే విష్ణుపురాణమందు విష్ణువనునొకఁడు పరమాత్మగాఁదలఁపఁబడి శివదేవుఁడు, కాళి, గణపతి మున్నగువా రాతని దాసులుగాఁ గల్పింపఁబడిరి. దేవీభాగవతమునందు దేవినే పరమేశ్వరిగాఁ బరిగణించి విష్ణు, గణపతి, మున్నగు దేవత లామె దాసిసలుగాఁ గల్పింపఁబడిరి. ఇట్లు పరస్పర విరుద్ధవచనముల నొక మనుష్యుఁడే వ్రాసి యుండుట సత్యముగానేరదు. కనుకనే శివపురాణ, విష్ణు పురాణ, దేవీభాగవతాదులు సాంప్రదాయిక జనులయొక్క పక్షపాతముతో నిండిన కపోలకల్పనామాత్రములగుచున్నవి. ఇదే నవీనుల సందేహము. ఇట్లు స్వల్పబుద్ధులగువారు పురాణ ములను గూర్చి ఆక్షేపించుటకుఁ గారణము స్పర్థ యనిచెప్పవల సివచ్చినందులకు వందురుచున్నాము. కాని వీరికిఁ బురాణస్వ రూపమేదియో తెలియకపోవుటయే హేతువు. ఇట్లు వీరు పురాణములనునిందించుటకు ముందుగాఁ బురాణమనఁగా నెట్టి వస్తువో యేది తెలుసుకొనవలసియుండును. పురాణ మితిహాస ముగాదని యితః పూర్వమే చెప్పియున్నాము. పురాణములం దితిహాసములోని యంశము లున్నప్పటికి నవి కొలఁదిగానే యున్నవి. పురాణములు భావప్రధానగ్రంథములై యున్నవి. వీనిలో భావమహిమ పూర్ణముగా జూపింపబడినది. ఇందు

మహిమ యేరీతిగా నుండునదియు, నొకటే పదార్థము భావము యొక్క భేదముననుసరించి యెట్లెట్లు భిన్నభిన్న రూపముల తోఁ బ్రతీతియగునది యీదృష్టాంతముచేఁ దెలియఁగలదు. ఎట్లనఁగా స్త్రీ యొక్కతయే సాత్త్విక పురుషుని దృష్టిలో జగదంబారూపముగాను, రాజసికునియెదుటసౌందర్యరాశిగాను తామసికజనుని సన్నిధానమునఁ గామయంత్రరూపముగాను, తండ్రి దగ్గరఁ గన్యారూపముగాను, సుతునియొద్ద మాతృ రూపముగాను, బతిచెంగటఁ బత్నీరూపముగాను, భ్రాతృసమీ పమున భగినీరూపముగాను, వేయేల? కేవలము భావముయొక్క భిన్నత ననుసరించియే భిన్నత ప్రతీతి గాఁగలదు. శాస్త్రములం దిట్లు చెప్పఁబడినది.

"భవోహి భావనామాత్రో నభవః పరమార్థతః"

ప్రపంచము భావనామాత్రమైయున్నది. పరమార్థమును బట్టి లేదు. దీనింబట్టి భావమయమగు ప్రపంచమునుండి ముక్తుడగు టకై భావమునే యవలంబించుటచేత భావమయుఁడును భావ గ్రాహియు నగు భగవంతునియొక్క వివిధభావముల ననుసరిం చి విగ్రహ కల్పనమును, విగ్రహోపాసనమును శ్రీ వేద వ్యాస భగవానులవారు పురాణములందుఁ జూపియున్నారు. సగుణోపాసకుల కొరకై విష్ణు, శివ, శక్తి ప్రభృతి పంచ మూర్తు లేవి చూపఁబడినవో యవియన్నియు విష్ణువు, శివుఁడు మున్నగు వేరువేరు దేవతలుగాక సగుణబ్రహ్మయగు నీశ్వరుని

యొక్కయే పంచభావచ ల ననుసరించిన బంచవిధమూర్తులైయున్నవని తెలియఁగలదు.

-*) పంచాయతనపూజ యెందులకు? (*-

ఒక యీశ్వరునిఁ బంచమూర్తులనుగాఁ జేయుటకుఁ గారణమేమనఁగా, ప్రపంచము పంచతత్త్వములచేఁ గల్పింపఁబడుటచేత వానిలో నొక్కొక్క తత్త్వముయొక్క ప్రాధాన్యములో మనుష్యుల ప్రకృతిగూడఁ బంచవిధములు గాఁగలదు. దీనింబట్టియే యొకభగవంతునికే పంచమూర్తులు గల్పింపబడినవి. ఎట్లనఁగా, ఆకాశతత్త్వము ప్రధానమైన ప్రకృతిగల మనుష్యులకు-విష్ణూపాసనమును పృథివీతత్త్వప్రధానముగాఁగల మనుష్యునకు శివోపాసనయు, నగ్నితత్త్వప్రధానమైన ప్రకృతిగల మనుష్యునకు దేవ్యుపాసనమును, నీ మూన్నగు తత్త్వములయొక్క ప్రాధాన్యముచేత భిన్నభిన్న ప్రకృతులతోకూడిన సాధకుల కధికారముల ననుసరించి సాధనముల మంచియేర్పాటుకొరకే యొక యీశ్వరుఁడు పంచభావమయమూర్తిగాఁ గల్పింపఁబడియుండెను. వాస్తవమునం దీపంచమూర్తులు నొకఁడే సగుణబ్రహ్మయగు నీశ్వరుఁడైయున్నాఁడు. ఇందు గేవలము భావభిన్నత గలదు. తాత్త్వికభిన్నత యేదియులేదు. ఈ పంచభావము లెట్టివో యావిషయమును మంత్రయోగమునుగూర్చి చెప్పెడిచోట బూర్ణముగాఁ జెప్పఁబడును. దీనింబట్టి యింతవరకుఁ దేలిన సారాంశమేమనఁగా విష్ణు, శివ, శక్తి, మున్నగు

నవి వేరు వేరు దేవతలు గారనియు, నొక యీశ్వరునియొక్క పంచమూర్తులై యున్నవనియు, దెలియుచున్నది. పురాణము, భావోపాసనలు రెండింటికి బ్రధానగ్రంథమై యున్నది. దీనింబట్టియే పురాణమునందు భగవంతునియొక్క యేభావమును బ్రధానముగానుంచి యుపాసనము చూపఁబడు చున్నదో యాపురాణమం దాభావముయొక్క మూర్తియే యన్నిటికంటె ముఖ్యముగా భావింపఁబడియున్నది. ఈపంచ మూర్తులు వేఱువేఱు దేవతలనుగా నిష్కర్షించి యవ్వాని వర్ణనము లాపురాణములందున్నయెడల నత్తఱి నది దోషాస్ప దమైయుండెడిది ఎట్లనఁగా శివపురాణమునందు శివుడు బ్రధాన దైవముగాఁ దలంపఁబడెను. విష్ణుపురాణమునందు విష్ణుమూర్తి బ్రధానదైవముగా నెంచఁబడెను. ఇట్లే యీ మొదలగునవి. కాని యీ పంచమూర్తులు నొక భగవంతుని యొక్కయే మూర్తులైనందువలన నిట్లు వర్ణించుటయం దెట్టి దోషము గూడ నాపాదింపదు. ఎందులకనగా, ఈప్రకారముగా వర్ణించుటలో వస్తువుయొక్క ప్రభేద మేమియులేదు. కేవల మధికారము ననుసరించి భావము యొక్క ప్రభేదము మాత్రమే కలదు. మాయామయమును, వ్యావహారికమునగు జగత్తునందుఁ దాత్త్విక సత్యమేదియు, లేదనియుఁ, దాత్త్విక సత్యము, మాయకంటె నతీతమును, నిర్గుణమును, నిష్క్రియమునగు బ్రహ్మమునం దున్నదనియు, బ్రహ్మ కంటె నతిరిక్తమగు

మాయయొక్క రాజ్యమునం దేయే సత్య మున్నదో యదియం తయు వ్యావహారిక సత్యము మాత్రమే యనియు జ్ఞాపక ముంచుకొనవలయును. దృష్టాంతరూపముగా నిది బోధింపఁ బడు చున్నది. ఏమన, చాటను నడచెడి యొక మనుష్యుఁడు ధూమశకటముపై (రైలుబండి) బోవు నొక మనుష్యుని బట్టి నిశ్చలుండుగను, ఆ చాటను నడఁచెడివాఁడే మార్గమునందు గూరుచుండియున్న యొక మనుష్యునిబట్టి సచలుండు గను, ఆ కూరుచుండినవాఁడే తిరిగెడి భూమితోఁ దిరుగుచున్నప్పటికి నా ధరకంటెఁ దక్కువగాఁ దిరుగుచున్నవాఁడు గను, మరియు నొక గ్రహమందున్న జీవునింబట్టి సచలుండుగ నుండును. ఇట్లెన్నియో విచారించినకొలఁది సిద్ధాంతములు బయలు దేరును. మాయామయమగు ప్రపంచమందు సమస్త, వస్తువుల కాపేక్షిక సత్యత్వమనఁగా వ్యావహారిక సత్యత్వమే కలదుకాని తాత్విక సత్యత్వము లేనే లేదు. ఈదృష్టాంతమును మనసునందుంచు కొని విచారించిన యెడలఁ బురాణములయం దుండెడి యీ పంచమూర్తుల యొక్క యుపాసనా రహస్యము సంపూర్ణ ముగాఁ దెలియఁగలదు. విచారించి చూచినచో నేమనుష్యునిలో ఆకాశతత్వము ప్రధానముగనున్నదో, యెప్పుడు వాని ప్రకృతి విష్ణూపాసనయే కోరుచున్నదో, యెత్తఱి నా విష్ణువు దేవతగాక సగుణబ్రహ్మయగు నీశ్వరుడగుచున్నాడో అత్తఱి విష్ణు పురాణమునందు విష్ణుదేవుని బరమాత్మగా భావించి యా

సాధకుని యధికారము ననుసరించియు, నతనియందితర భావములు గౌణములుగా సున్నందున నతనిభావముల ననుసరించియు శివ, శక్తి ప్రభృతి మూర్తులను గౌణదేవతలగాఁ బరిగణించి విష్ణుమూర్తినే ప్రధానముగాఁ దలఁచుటయు, సాధకునికొఱకై విష్ణు పురాణమందు విష్ణువునే పరాత్పరునిగాఁ జెప్పిస్తుతించుటయు వ్యావహారిక సత్యత్వముఁబట్టి దోషము లెట్లుగాఁగలవు? దోషములుగావని వివేకియగువాఁడు తెలిసికొనఁగలడు. ఇందు నవీను లవిచారముగా ననినట్లు సాంప్రదాయిక పక్షపాతము బొత్తిగా లేదు. ఇందు భావముయొక్క ప్రాధాన్యమును, నధికారముయొక్క విచారమును, నుపాసనముయొక్క తత్త్వమును గలదు. లెస్సగా నిట్లే దేవీభాగవతమునందు దేవియొక్క ప్రాధాన్యమును, శివపురాణమునందు శివుని ప్రాధాన్యమును మున్నగునవి చూపఁబడినవి. దీని రహస్య మొకటిఁ గలదు. ఇందుఁ బురాణములయొక్క దోషము లేదు. ఇఁక నేమన, వానియందు దుదారతయు సమదర్శితయు గలదు. ఎట్లు గురువు లందఱు భగవంతుని రూపము లైనప్పటికిని భగవంతుని జ్ఞానశక్తియే, మనుష్య రూపమునఁ గేంద్రముగాఁబ్రకాశించి శిష్యుని జ్ఞానరాజ్యమునం దున్నతునిగాఁ జేయుచున్నం దువలన నే సాధకునకే గురువున్నాఁడో యా సాధకునకుఁ గర్తవ్య మేమనఁగా! తన గురువును నితర సర్వగురువులకంటె నధికునిఁగాఁ దలంచి యట్లు గౌరవింపవలెను. ఇందతని యధి

కారము ననుసరించిన వ్యావహారిక సత్యత గలదు. లేని చో నతనికి గురునిపైఁ బూర్ణభక్తియు, నిర్భరబుద్ధియుఁ గలుగఁ జాలదు. ఎందుల కనఁగా, ఇదంతయు భావరాజ్యముయొక్క విషయమై యున్నది. మఱియు నిర్భరబుద్ధి లేనిచో సాధకునకుఁ గల్యాణముగూడఁ గలుగదు.

సరిగా నట్లే యేసాధకునియొక్క ప్రకృతి ననుసరించి యే మూర్తి యుపాసింపఁదగిన దైనదో, దానియందు బ్రహ్మభావనయు, నితరమూర్తులయందు గౌణభావనయు నా సాధకునకుఁ గల్యాణముఁగల్గించునవియును వ్యావహారిక సత్యములునైయున్నవి. ఎప్పుడు పురాణములం దీరీతిగా సాధకులయొక్క యధికారము ననుసరించియే భిన్నభిన్న మూర్తుల యుపాసనయు, స్తుతులును జూపబడినవో, యప్పుడు పురాణములందు వేఱు వేఱుగా వర్ణనములు గావించుటయు, ఒక దాని ముఖ్యతయు, మరొకదాని గౌణతయు, నెందులకుండదు? పురాణముల కిట్టి వర్ణన మెల్ల, తెలుంగులను సత్యమైయున్నది. ఇద్దానిని గుర్తెఱుంగఁ జాలని విచారహీనులు కొందఱు అనేకవిధముల దోషములను గల్పించిరి.

-*) వ్యాసుఁడొకఁడే పురాణముల కన్నింటికిని గర్తయా? (*-

కొందఱర్వాచీనులు భిన్నభిన్న పురాణములందు భిన్న భిన్న మూర్తులయొక్క స్తుతులను జూచి యెల్లపురాణములకుఁ

గర్త వేద వ్యాసభగవానులవా రొక్కరే కారనియు నుడివిరి. ఒక్కొక్క పురాణ మొక్కొక్క సంప్రదాయమునకు సంబం ధించిన మనుష్యునిచే రచింపఁబడినదనికూడఁ జెప్పుటకుఁ బ్రా రంభించియున్నారు. ఈమొదలగు ప్రమాదముల కంతుపొంతు లు గన్పట్టుటలేదు. కాని వేదవ్యాసుఁడొక్కడే భిన్నభిన్న పురాణములందు సగుణబ్రహ్మను నొక్క దానినే భిన్నభిన్న రీతులుగా స్తుతించియు నధికారము ననుసరించి యందొక దానికి ముఖ్యతయుంచి రెండవదానికి గౌణతయు, రెండవ దానికి ముఖ్యతయుంచి మూడవదానికి గౌణతయు, నిట్లుఁ భావభిన్నత్వము ననుసరించి బెక్కుతెఱంగుల వర్ణించియుండుట వేదవ్యాసుని పూర్ణత్వముయొక్క లక్షణ మగుచున్నదా? లేక యర్వాచీనులగువారు వచించినట్లు మస్తిష్కముయొక్క వికారలక్షణము గన్పడు చున్నదా? పూర్ణజ్ఞానియగు పురుషు నకును; నజ్ఞానియగు సాంప్రదాయిక పురుషునకును, గల భేద మేమనఁగా! అజ్ఞానియగు సాంప్రదాయిక పురుషుఁడు తన సంప్రదాయమునకు సంబంధించిన మాటలనే ముఖ్యములైన వానినిగాఁదలచి తక్కినవానిని నిందించును. ఇఁకఁ బూర్ణజ్ఞాని యగు పురుషుఁడన్ననో సంప్రదాయములన్నిటి యొక్క యధి కారాను సార వ్యావహారిక సత్యత్వమునెరింగి యన్నిటికి వేలువేలుగా స్తుతులఁగాంచుచు సమస్త సంప్రదాయములకంటె నతిరిక్తమగు నద్వైతభావమును బ్రతిష్ఠించును. శ్రీ వేదవ్యాస

భగవానులవారు భిన్నభిన్నపురాణములలో భిన్నభిన్న భావములననుసరించి బ్రహ్మముయొక్క పంచమూర్తుల స్తుతులను జేయుచుఁ జిట్టచివరకు వేదాంతములోనికివచ్చి యద్వైత భావమును బ్రతిష్ఠజేసియున్నారు. మరియు భావమయులగు మూర్తులయొక్క వ్యావహారిక సత్యత్వముతోఁబాటు నిర్గుణుండును, నిరాకారుండును నగు బ్రహ్మముయొక్క తాత్త్విక సత్యత్వము నిరూపించు సమయమునందు క్షమాపణముగూడఁ గోరియున్నారు. ఎట్లన,

"రూపంరూపవివర్జితస్యభవతో, ధ్యానేన యత్కల్పితం
స్తుత్యాఽనిర్వచనీయతాఽఖిల గురో దూరీకృతాయన్మయా
వ్యాపిత్వంచ నిరాకృతం భగవతో, యత్తీర్థయాత్రాదినా
క్షంతవ్యం జగదీశ! తద్వికలతా దోషత్రయం మత్కృతం!!"

ఓ జగదీశ్వరా! ఓ పరాత్పరా! రూపరహితుఁడవగు నీయొక్క రూపమనునది నా ధ్యానమందుఁ గల్పించుకొంటినో, స్తుతిమూలముగా నీయొక్క యనిర్వచనీయ భావమును నా ధ్యానమునందెట్లు నష్టపరిచితినో మఱియు దీర్థయాత్రావర్ణనములవలన నే నీయొక్క వ్యాపకత్వమును భంగపరిచితినో, యీ మూఁడుదోషములను క్షమింపవలసినదని తాత్పర్యము. ఇదియే వేదవ్యాసులవారి నిష్పక్షపాతమగు పూర్ణత్వముయొక్క లక్షణము. ఇద్దానిని వివేకియగు పౌరాణికుఁడు ప్రత్యక్షరమందును దెలిసికొనఁగలఁడు. వేదరూపములగు సరోవరములందుఁ బురా

ణములు వికసిత కమలరూపములైయున్నవి. వానియందు విద్వాంసులనెడి తుమ్మెదలు మధుపానానంద లాభమును బొందుచున్నవి. కాని మూర్ఖులనెడి మండూకము లాతామరల నశింపజేయుచున్నవి.

—*) పురాణములు పిచ్చివ్రాతలతో నిండియున్నవా? (*=

అర్వాచీనులగువారి మూఁడవశంక యేమనఁగా? పురాణములందుఁ బండితులచే రచింపబడిన యనేక విషయములకు సంబంధించిన యవకతవకవ్రాతలు నిండియున్నవి. ఇందలి వైజ్ఞానికవిషయములు, భూగోళవిషయములు, సామాన్యబుద్ధికిఁ గూడ విరుద్ధముగా నున్నవనునది. ఈప్రకారముగాఁ బురాణములనుగూర్చి సందేహించుట, వానిని జక్కఁగా మననము జేయకపోవుటయొక్కయుఁ వాని వర్ణనశైలి గుర్తెఱుంగఁ జాలకపోవుటయొక్కయు ఫలమే యైయున్నది. ఈవిషయము కొన్ని దృష్టాంతములతో బోధింపఁబడుచున్నది.

-*) భూగోళ పరిణామము (*-

నేఁటికాలమున భూగోళశాస్త్రమందు భూమియొక్క వ్యాస మెనిమిదివేలు (౮౦౦౦) మైళ్ళని లిఖింపఁబడియున్నది. ఇద్దానిని (మధ్యరేఖను) భూగోళశాస్త్రజ్ఞులు కొలిచి చూచుకొనిరి. ఇది భ్రాంతిరహితముగా సిద్ధించినది. ఇఁక బురాణములందు భూపరిమాణ మేఁబదికోట్ల (౫౦౦౦౦౦౦౦౦) యోజనము

లని యున్నది. ఇది యెంత యసత్యపువ్రాత! యని యర్వాచీను లాక్షేపించుచున్నారు. కాఁబట్టి యిందులకు సమాధాన మొసంగఁబడుచున్నది. పురాణములలో నెట్టి భూపరిణామమున్నదో, భూగోళవేత్తలెట్టి భూపరిణామమును వ్రాసిరో యీ రెండును సత్యములై యున్నవి. కేవలము పరిమాణమును నిర్ణయించెడురీతి వేఱువేఱుగా నున్నది. భూగోళవేత్తలు భూమి యొక్క యేకోల్త యెనిమిదివేల (౮౦౦౦) మైళ్ళని నిర్ణయించిరో యది భూమియొక్క మధ్యరేఖకు (వ్యాసమునకు) సంబంధించినదై యున్నది.

ఇఁకఁ బురాణములు సమస్త పృథివియొక్క (Map) ఘనఫలమును దీసి జూపించియున్నవి. ఏ గోళపదార్థమున కైనను ఘనఫలమును దీయుటకొరకు శాస్త్రములం దీయుక్తి చూపబడినది. ఏదనఁగా గోళపదార్థముయొక్క వ్యాసమును మూఁడురెట్లు గుణించి యనఁగా ఘనముచేసి దానిలో సగ చాలు గ్రహింపవలెను. ఈరీతిగానే లెక్కచేసినచో పృథ్వి యొక్క మధ్యరేఖకొలఁత యెనిమిదివేలమైళ్ళని సిద్ధించును. రెండుమైళ్ళు ఒకక్రోసనియు, నాల్గుక్రోసులు ఒక యోజన మగుననియు నెఱుంగదగు. దీనింబట్టి ఎనిమిదివేల (౮౦౦౦) మైళ్ళొక వేయియోజనములగును. ఇది భూమియొక్క వ్యాస మగును. కాఁబట్టి జగత్తులోని సమస్తభూములయొక్క పరిమాణము ఘనఫలముయొక్క లెక్కననుసరించి ౧౦౦౦ × ౧౦౦౦

× ౧౦౦౦) ÷ ౨ = ౫౦౦౦౦౦౦౦ అనఁగా నేఁబదికోట్ల యోజనము లగును. ఇదియే పురాణములందుఁ జూపఁబడినది. కానఁ బురాణములం దెట్టి దోషమును లేదు. కేవలము నానిని బోధపరచుకొనఁజాలకపోవుటయే మనవారిలోపము. పురాణముల దోషముగాదు.

-*) సూర్య చంద్ర గ్రహణములు (*-

రెండవ దృష్టాంతము. చంద్ర సూర్య గ్రహణములంగురించి చూపఁబడుచున్నది. భూగోళమందు భూమియొక్క ఛాయ చంద్ర గ్రహణముపై బ్రసరించినచోఁ జంద్ర గ్రహణమును జంద్రునిఛాయ సూర్యునిపైఁ బడినచో సూర్య గ్రహణమును గలుగఁ గలదని వ్రాయబడియున్నది. ఇఁకఁ బౌరాణికులు రాహువనెడి యొక రాక్షసుఁడు జంద్రుని, సూర్యుని నెప్పుడు గ్రసించుచున్నాఁడో యప్పుడే చంద్ర గ్రహణముగాని, సూర్యగ్రహణముగాని, గలుగునని వ్రాసిరి. ఇందు దొలి వ్రాత దూరవీక్షణ యంత్రములవలన మిక్కిలి చక్కగా నిదర్శన మగుచున్నప్పుడు పౌరాణికులవ్రాత నెట్లు గౌరవింపగలము? అని నవీనులు శంకించుచున్నారు. దీనికి సమాధాన మొసఁగఁబడుచున్నది. రాహువుయొక్క గ్రాసము లేక ఛాయపడుట. ఈ రెంటిలో భేదమేమియు లేదు. కేవల మాస్తికతయొక్కయు, నాస్తికతయొక్కయు, భేదము మాత్ర మున్నది. ఆస్తికులగు పౌరాణికులు దైవసంబంధముతో

ఛాయా వర్ణనమును జేసియున్నారు. భూగోళ విదులా దైవ సంబంధమును దోసిరాజని కేవలమొక ఛాయయని వర్ణించి యున్నారు. ఈ విషయ మిదివరకే వేదాంగములను గూర్చి వచించినచోటఁ జెప్పబడినది. ప్రకృతి జడమైనందువలన సర్వ ప్రాకృతిక వస్తువులును జడములై యున్నవి. కాఁబట్టి యా యొక్కొక్క వస్తువును నడపెడి చేతనశక్తి ప్రత్యేక ప్రత్యేకముగా నున్నది. ఈసర్వశక్తులు భగవచ్ఛక్తులుసుమీ! ఒక గొప్ప రాజ్యమును బరిపాలించుకొరకు రాజశక్తిని గైకొని భిన్నభిన్న విభాగములందు భిన్నభిన్నములుగా జడ్జీలు, మేజస్ట్రీట్లు, మున్సిఫులు, కొత్వాళ్ళు మున్నగు నధిష్ఠాతృగణము రాజ్యశాసనమును జేయుచున్నదిగదా! ఇదేప్రకారముగాఁ బ్రకృతిరాజు భగవంతునిశక్తి గైకొని జడప్రకృతియొక్క భిన్న భిన్నవిభాగములలో ననేక దేవతల నధిష్ఠాతలనుగా నేర్పరచి శాసించుచున్నాఁడు. జడమును నడపెడి చేతనశక్తి దేవత, లేనంతవఱకు జడవస్తువేదియు నెట్టిపనిని జేయఁజాలదు. ప్రపంచమందంతట నెంతజలమున్నదో దానినంతను నడపెడి శక్తి యొక్కపేరు వరుణుఁడు. అతడుండుటంబట్టి జలమువలనఁ బ్రపంచకార్యములు చక్కఁగా జరుగుచున్నవి. అతఁడందుండనియెడల జలములు పనికిరానివగుచున్నవి. ఇట్లే గాలియందేదేవతగలదో దానిని "పవనదేవత" యని యనెదరు. అది యందు లేనియెడల గాలివలనఁ బ్రపంచకార్యములన్నియుఁ

జక్కఁగా జరుగును. ఈరీతిగానే యొక్కొక్క ప్రాకృతిక జడవస్తువును నొక్కొక్క చేతన దైవీశక్తి యుండి నడుపు చుండును. ఎప్పుడు ప్రకృతి యనాదియు, ననంతమును, నమేయము నైనదో యప్పుడు ప్రకృతిలోని జడవస్తువులసంఖ్యయు ననంతమగును. దీనింబట్టి యీ జడవస్తువులపై నే దైవీచేతన శక్తులుండి కార్యములను గావించుచున్నవో వానిసంఖ్యయు ననంతమైయుండును. దీనివలన దేవత లనంతములని తేలినది. పురాణములలో నే ముప్పదిమూడుకోట్ల దేవతల వర్ణన మున్నదో యది యనంతవాచకమైనది.

ఎట్లనఁగా! సభలో వేయిమంది మనుష్యులుండిరని యొకమనుష్యుఁడు వచించును. ఒక వేయిమందియే యందుండిరని యర్థముగాదు. ఇఁక నేమన, విశేషముగా మనుష్యులుండిరని వాని తాత్పర్యమైయున్నది. అట్లే పురాణములలో ముప్పదిమూడుకోట్లదేవతలనిచెప్పుట యనంతముగా దేవతలున్నారని గ్రహింపవలయును. అనంతమైనప్పటికిని 33 కోట్లని చెప్పుటకుఁ గారణమేమనఁగా,

"ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి"

ప్రాధాన్యమునుబట్టి పరిగణింపఁబడును. అనంత దేవతలలో 33 కోట్లదేవతలు ప్రధానులైయున్నారు. ఎట్లన, అష్టవస్తువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రుఁడు, ప్రజాపతి,

యీరీతిగానే ముప్పదిముగ్గురు నింకను వీనినుండి యనంతదేవతలు ప్రకృతియొక్క యనంతములైన జడవిభాగములందుఁ జేతనపరిచాలక రూపములుగాఁ నున్నవి. ఇఁక రెండవ విచారణ విషయమేమనఁగా, ప్రకృతి యనంతవిభాగములైనప్పటికి సాధారణముగా నిందు రెండువిభాగములున్నవి. (1) సాత్వికము (2) తామసికము. వీనిని జ్ఞానము, అజ్ఞానము, మరియు ప్రకాశము, అంధకారములనికూడఁ జెప్పవచ్చును. దైవీశక్తి, యేప్రకారముగా నఁనంతరూపములతోఁ బ్రకృతి యొక్క ప్రకాశమయమైన సాత్వికవిభాగమునందుఁ బ్రతిష్ఠితమైనదో యట్లే ప్రకృతియొక్క యంధకారమయమైన తామసిక విభాగముయొక్క యనంతస్థానములం దనంత చేతనశక్తులు కార్యములను జేయుచున్నవి. దీనినే యనంతమైన యాసురశక్తి లేక యసురులని చెప్పెదరు. ఇదే దేవతలందును, నసురులయందు భేదమున్నది. దేవతలు సాత్వికవిభాగమందును, నసురుల తామసికవిభాగమందును, దేవతలు జ్ఞానవిభాగమందును, నసురు లజ్ఞాన విభాగమందును, దేవతలు ప్రకాశ విభాగమందును, నసురు లంధకారవిభాగము లేక ఛాయా విభాగమందును, జేతనశక్తిరూపములతోఁ బ్రకాశించుచున్నారు. పూర్వసిద్ధాంతానుసారముగా నెట్లు జడప్రకాశముపై సూర్య, చంద్ర, వహ్ని, ప్రభృతి చేతనదేవతల యొక్క ప్రకాశములేకుండ నేకార్యమును జరుగనేరదో యట్లే

యంధకారము లేక ఛాయమీఁదఁ జేతనాసురీశక్తి యనఁగా రాహువులేని ఛాయ చంద్రగోళమునుగాని, సూర్యగోళమును గాని మరియొక వస్తువునుగాని గప్పఁజాలదు,

ఆధునికులగు భూగోళవేత్తలు కేవలమొక జడచ్ఛాయనే కార్యకారిగాఁ దలఁచి ఛాయలో నుండెడి శక్తిని మఱచిపోయి ఛాయాపాతము వలననే సూర్యునియొక్కయుఁ జంద్రుని యొక్కయు గ్రహణములను జూపిరి. కాని యాస్తికులు జ్ఞాన దృష్టిగలవారు నగుటంబట్టి ప్రాచీన మహర్షులు ఛాయలోపల నే చేతనాసురీశక్తి రాహురూపముతో బనిచేయు చున్నదో దానివలననే చంద్ర సూర్యగ్రహణములను జూపి భూగోళ వేత్తల దూరవీక్షణ దృష్టితో నేకత్వమును గూడఁ జేసిరి.

మఱియు దానివలననే యధికమైన యాస్తికతయొక్కయు, జ్ఞానదృష్టియొక్కయు పరిచయముగూడ వ్యక్తమైనది. ఇదియే పురాణములందును, భూగోళమందు నుండెడి భేదము. దీనినెరిం గిన బుద్ధిమంతులు పురాణములయొక్క యపూర్వ మహిమ గురైఱుంగ గలరు.

## -*) సప్త సముద్రములు (*-

పురాణములందు విశేషముగా "పాలు, పెరుగు, మధు మున్నగు సముద్రముల ప్రశంస గన్పడుచున్నది. కాని విచా రించి చూచినచో గోచరించుట" లేదని యర్వాచీనులు మరి

యొక శంక వేయుచున్నారు. సమాధానము వినుఁడు. ఈ ప్రకారముగా పురాణ వర్ణన వైచిత్ర్యముం గూర్చి చర్చించి నచో నా సముద్రవర్ణన మంతయు బ్రహ్మాండములో నుండి వ్యాప్తమైన సప్త ప్రధాన రసములయొక్క వర్ణనమై యున్న దని తెలియగలదు. బ్రహ్మాండమందలి సకల భాగములందు నీ సప్తప్రధాన రసములే యున్నవి. ఇందువలన నొక స్థానము లోని రసము సముద్రతుల్యము గాకపోయినప్పటికిని సమస్త సృష్టియందున్న రసముల విచారణమును బట్టి లవణ, ఇక్షు, ప్రభృతి ప్రత్యేక రసము సముద్రముతో సమానముగా విశాలముగాఁ గలదు. ఈ క్షీరసముద్ర దధిసముద్రాదులే పౌరాణికుల వర్ణన రహస్యములై యున్నవి.

-*)విష్ణుమూర్తి బృందాసతి(*-

దేవీ భాగవత పురాణము నందొక కథ వచ్చును. అది యేదనఁగా, జలంధరుఁడను పేరుగల యసురుఁ డొకఁడు గలడు వాడుఁ మిక్కిలి యత్యాచారి. దేవతలను గొల్లగొట్ట వలెను. దేవతా స్త్రీలయొక్క పాతివ్రత్యమును భంగపరుప వలెను. దేవతల స్వర్గమును గెలువవలె ననెడి యివియే వాని పనులై యుండెను. వానికి బృందయను పేరుగల యొక స్త్రీ గలదు. ఆమె గొప్ప పతివ్రత. ఈమె పాతివ్రత్య తేజస్సువలన జలంధరుని నెవరు నోడింపఁజాలక యుండిరి. ఇట్టిపట్టున నసురుల దుండగముల వలన సృష్టిశృంఖల చెగుట కారంభించెను. దీని

వలన సృష్టిరక్షకుఁడగు విష్ణుమూర్తికిఁ బృందాసతియొక్క పాతివ్రత్యమును భంగపరచి సృష్టిరక్షణము జేయుట సంభవించినది. ఇందువలన విష్ణుమూర్తికిఁ బాతివ్రత్యము నాశనము జేసిన దోషము నవీనులచే నాపాదింపఁ బడుచున్నది. కాన నిందులకు సమాధానము చెప్పుచున్నాము. ఈ కథలోఁ దొలి యుపదేశము దేని సన్నిధానమున దేవతల శక్తియేమి, విష్ణుమూర్తి శక్తి కూడఁ బరాస్తమై పోవుచున్నదో యట్టి పాతివ్రత్య మహిమను గూర్చినదై యున్నది. రెండవ యుపదేశము ధర్మాఽధర్మములరహస్యమునుగూర్చినదై యున్నది. వ్యావహారికమగు ప్రపంచమందు ధర్మాఽధర్మముల నిర్ణయము లఘు, గురు భేదములతోనగుచుండును. ఏ కార్యమైనను బూర్తిగా ధర్మమును గానేరదు, లేక యధర్మమును గాఁజాలదు. ఇఁక నేమన, ఏ సంబంధములోగాని లేక యే స్థితిలోగాని ధర్మార్థముల ప్రయోగ మగునో యా సంబంధమును లేక యా స్థితిని ననుసరించి ధర్మాధర్మములయొక్క సిద్ధాంతము నిర్ణయ మగుచుండును దృష్టాంత రూపముగా బోధింపఁ బడుచున్నది. ఏ మనుష్యుని నైనను జంపుట పాపమే. కాని వేలకొలది మనుష్యుల రక్షణమునకై యొకని ప్రాణమును దీసికొనిన యెడల నది యొక మనుష్యుని హత్యవలన నింతమంది మనుష్యుల ప్రాణములను రక్షించెడి రూపముగల ధర్మము గాఁగలదు. ఎందులకనఁగా, ధర్మాధర్మముల నిర్ణయము తారతమ్యమును

బట్టి యగుచుండును. విష్ణువు యొక్కయు, బృంద యొక్కయు సంవాదము సరిగా నిట్టేయున్నది. ఇందునఁగూడ విష్ణుమూర్తి సంగతియే కాదు. సతీత్వమును నశింపజేసెడివాఁడు విష్ణువుగాక మఱియొక సాధారణ మనుష్యుఁ డెవఁడైనను గూడ వాని కిట్టి పాతివ్రత్యమును భంగము చేయుటయం దెట్టి హానియు లేదు, ఏ సతియొక్క సతీత్వము నైనను నాశము చేయుట యవశ్యము మహాపాపమే యగును. కాని యే రాక్షసస్త్రీకిఁ బాతివ్రత్య ముండుటచేత లక్షలకొలది స్త్రీల యొక్క సతీత్వము పాడగుచున్నదో, దేవతలపై నన్యాయములు, నత్యాచారములు జరుగుచున్నవో, దేవరాజ్యము భ్రష్టమగుచున్నదో, బ్రహ్మాండము నందు విచ్చలవిడి హెచ్చుచున్నదో, విరాట్పురుషుని నియమము లన్నియు జెడిపోవుచున్నవో యట్టి తరుణమం దిట్టి సతీత్వరక్ష మహానర్థములకును, బాపములకును గారణమగుట లేదాయేమి? నిష్పక్షము వహించి యిదివరకు మనుష్యహత్య మనుష్యుల రక్షణమును గుఱించి యిచ్చిన దృష్టాంత మేది గలదో యద్దానిని దీనితో సమన్వయించి విచారించిన యెడల నిట్లే యొక మనుష్యుని వలన లక్షలకొలది మనుష్యుల హత్య జరుగుచున్నప్పుడు మనుష్యహత్య మహాపాపమైననుగూడ నవస్థ యొక్కయు, భూమియొక్కయు, భేదము ననుసరించి యా యొక్క మనుష్యుని హత్యజేయుట విధేయ కార్యమనియే తప్పక సిద్ధాం

సృజింపగలడు. ఎంతవరకు జీవుని సూక్ష్మశరీరము స్థూలశరీర ముతో వాసనా బద్ధమైయుండునో యంతవరకు జీవునియందీ శక్తి గల్గజాలదు. సూక్ష్మశరీరము స్థూలశరీరమునుండి వేరయిన వెంటనే యాశక్తి జనించుచున్నది ఇద్దానిగూర్చి యధికముగా చెప్పుట యనవసరము. ప్రేతశరీరము స్థూలశరీరమునుండి వేరుగానున్నందున ప్రేతనుగూడజిత్తతీవ్రతనుబట్టి స్థూలశరీరము నుద్ధరించుశక్తి జనించుచున్నది ఈవిషయమును ప్రస్తుతసుమెరికా లోయంత్రమూలముగా నిరూపించి చూపియున్నారు. అచటి ప్రేతశరీరముయొక్క ప్రతిబింబము(ఫోటో) దీయుచున్నారు. రజో వీర్యములుగల్గు పదార్థములుగూడ పంచభూతములే. కాబట్టి యెవరి చిత్తమందు పంచభూతములనుండి శరీరసృష్టికి గాను రజోవీర్యములసామగ్రి యేకత్రిగా చేయుటకు శక్తికలదో వారికి స్థూలమైథునీసృష్టి చేయవలసిన యవసరము గాన రాదు. ప్రళయకాలమందు స్థూలవస్తు వేమియు నుండదు. కాబట్టి ప్రళయానంతరము సృష్టికాలమందు జనించిన స్త్రీపు రుషులు అవశ్యముగా నెవరియొక్కయో మానసిక సృష్టిఫల ములై యుందురు. మహాభారత శాంతిపర్వమం దిట్లు వ్రాయ బడినది,

ఆదిదేవ సముద్భూతా బ్రహ్మమూలా క్షయావ్యయా
సాసృష్టి ర్మానసీనామా ధర్మతంత్రపరాయణా॥

ఆదిమహర్షులసృష్టి బ్రహ్మదేవుని మానసిక సృష్టి. సృష్టి పూ ర్వకల్పానుసారము అగుచుండును. కాబట్టి పూర్వకల్పానుసా

రము ఎవరిసంస్కారములు ఆదిమహర్షులగుటకుదగియుండినదో వారియొక్క సూక్ష్మశరీర సంస్కారమునుబట్టి మనోబలముచేత పంచభూతములను నేకీకరణముజేసి బ్రహ్మదేవుడా మహర్షుల స్థూలశరీరములను సృజించెను. ఈఋషులందరు సత్యయుగము లోని యాదిమహర్షులు. కనుక నీరును జితేంద్రియులును, మానసిక సృష్టిసంపన్నులునై యుండిరి. కాబట్టివారును సృజించిన సృష్టి మనోబలముచేత నానావిధ జీవులయొక్క సూక్ష్మశరీరములపై పంచభూతములను గూర్చి సృష్టించిరి. కాబట్టియది బైజీ సృష్టిగాక మానసిక సృష్టినై సత్యసంపన్నులగు ఋషుల ద్వారా కృతయుగాదికాలమందు సృజింపబడినది. భాగవతమందు కశ్యప, దితి, అదితి, వినత, కద్రువ, ప్రభృతుల వలన గల్గిన యేసృష్టివర్ణనము గలదో యదంతయు మానసికసృష్టి వర్ణనమేయైయున్నది. స్థూలబైజీసృష్టిగాదు. కావున మానవస్త్రీగర్భమునుండి గజాశ్వములు పుట్టినవని యర్వాచీనులేవాదమును లేవనెత్తిరో యాదియంతయు నసత్యము. ఇవ్విధమైన మానసిక సృష్టికి పూర్వోక్త స్త్రీల సంబంధముయొక్క తాత్పర్యమేమన గాపూర్వోక్తమానసికసృష్టి గావించెడి మహర్షులాస్త్రీలసాహాయ్యముతోడ దమమానసికసృష్టికి బూర్ణత్వమును గల్గించిరి. కాబట్టి యెంతవఱకు మనుష్యులమనశ్శక్తి పరిపూర్ణముగానుండెనో మరియు యోగశక్తియు లేక సంయమశక్తియు గూడ సంపూర్ణముగా నుండెనో యంతవఱకు మానసిక సృష్టి యగు

చుండెను. తరువాత మనుష్యుల మనస్సు దుర్బలమైనకొలదిని మానసిక సృష్టియు నష్టమయినది. అట్టిపట్టున యజ్ఞాదులవలన దైవీశక్తిని దదనుకూలముగాఁ జేసికొని దానిచేత విశేషముగా సృష్టి యయ్యెను యజ్ఞములోని నెయ్యి, లేక చరువులో దేవతాశక్తివలనఁ పాంచభౌతికము పరివర్తన మగుటచేత నాదర్వ్యమునందు రజోవీర్యగుణము పూర్తిగానుండెడి శక్తియుత్పత్తి యగుచుండెను. కాఁబట్టి దానిని గ్రహించుటచేత స్త్రీలంతస్సత్వము గలవారైయుండుచుండిరి. విశ్వామిత్రుఁడు, పరశురాముఁడు, రామచంద్రమూర్తి, మున్నగువారి యుత్పత్తి యీ రీతిగానే యైనది. ఇది రెండవ యుగమగు త్రేతాయుగమునకు సంబంధించిన విషయము. తరువాత మూడవదియగు ద్వాపర యుగములో యజ్ఞము జేయుశక్తి గూడ క్రమక్రమముగా నష్టమగుటసంభవించినది. ఎందులకనఁగా యాజ్ఞికులగుబ్రాహ్మణుల యొక్క తపస్యయు, యజమానుని సంయమమును జితేంద్రియత్వమును మున్నగునవి నష్టములై విషయాభిలాషగల బుద్ధి వృద్ధిగా దొడంగెను. ఇందువలన యజ్ఞము జేసినప్పటికిఁగూడ దానియందు బూర్ణఫలము గలుగ కుండెను. దీనివలన యాజ్ఞిక సృష్టి నష్టమగుట మొదలిడినది. అత్తరి కేవలము మైథునీ సృష్టియే యంతిమోపాయమయ్యెను. కాని యిట్లయినప్పటికిఁ గూడ నాకాలమందలి మనుష్యులు పరస్త్రీలను సామాన్యముగా దమతల్లులవలెఁ జూచుచుండెడివారు. బ్రహ్మచర్యమాచార్య

కులమునకు జని మిక్కిలి చక్కగా గాపాడుకొనుచుండెడివారు. దీనివలన నాపురుషు లమోఘవీర్యము గలవారగుచుండిరి. వారి వీర్యము నిష్ఫలమగుచుండుట లేదు. మరియు వీర్యశక్తి యతిశయమైనందువలన ధార్మికులును, వీరులునగు పుత్రులు పుట్టుచుండిరి. ఇప్పుడు దురంతమగు కలియుగము వచ్చినది. దీని ప్రభావముచే నాలుగు వైపులం బాపప్రవాహము ప్రవహింపదొడగినది. పరస్త్రీలపైఁ గామదృష్టి, వ్యభిచారము నప్రాకృతికవీర్యనాశము, బ్రహ్మచర్యహీనత్వము, ధాతుదౌర్బల్యము మున్నగు సమస్త పాపములును బ్రబలినవి. ఈ హేతువుచే నీకాలమునందు వీర్యములో మైథునీసృష్టి శక్తిగూడ లేదు. ఇందువలన ననేక సంబంధములచేతగూడ స్త్రీ వంధ్యగను బురుషుఁడు జన్మశక్తి హీనుఁడుగను నుండదొడంగిరి. ఇదియే సమస్త సృష్టిసారముయొక్క తత్త్వము. దీనినే పురాణముల మూలమున మహర్షులు ప్రకటించిరిసుమీ.

## —(అధునాతనుల శంకలు)—

ఈప్రకారముగా భాగవతాది పురాణములను గురైరుంగక యర్వాచీను లనేక సందేహములను లేవనెత్తిరి. ఆగ్రంథములను జక్కగా మననము చేసిన యెడల వారి సంశయములు నివృత్తియై యుండెడివి. కేవలమింతటితో బోలేదు. వారి బుద్ధిరూపాకాశమునం దజ్ఞానావిశ్వాస రూపగాఢమైనఫలములు కల్గుట వలన నా యర్వాచీనులు పెక్కు

తము గాఁగలదు. అట్టే సతీత్వము నశింపజేయుట మహాపాప మైనప్పటికిఁ గూడ నే సతికి సతీత్వ ముండుటచేత లక్షలకొలది స్త్రీలయొక్క పాతివ్రత్యమునకు హానియుఁ బ్రపంచమునం దత్యాచారములును, పాప విస్తారమును భగవంతుని నియమములకు భంగమును గల్గుచున్నదో యా స్త్రీ యొక్క సతీత్వమును నశింపఁజేయుట తప్పక కర్తవ్యమై యున్నది. ఇద్దానిని నిష్పక్షపాతులగు బుద్ధిమంతు లంగీకరింపక యుండఁజాలరు. ఇఁక విచారణీయాంశ మేమనఁగా, ఆ యొక సతి సతీత్వ నాశనము, ప్రకారాంతర విచారణములను విడిచి సతీత్వ నాశ విచారములనుబట్టి యొక సాధారణ మనుష్యునకు పాపమై యున్నది. ఆ పాపము సామాన్య మనుజుని పాపముతో సమానముగా విష్ణుదేవుని స్పృశింపఁజాలునా?

## —◆◆◆ పాపమనగా నేమి? పుణ్యమనగా నేమి? ◆◆◆—

ఈవిషయమును గూర్చి విచారించిన యెడల బ్రకృతియొక్క ప్రవాహమునం దనుకూల కార్యముజేసి నట్లయిన నది యనుకూల ప్రతిక్రియ యగును, ఇది పుణ్యము. ఇఁకఁ బ్రతికూలమైన కర్మమొనరించినయెడలఁ బ్రతికూల ప్రతిక్రియ యగును. ఇది పాపము. ఏమనుష్యుని వధించినను వానికి దగుపాపము సంభవింపగలదు. ఎందులకనగాఁ ఆమనుష్యుడు ప్రకృతియొక్క ప్రభావమునందు వృద్ధిబొందువాఁడై యుండెను. వానిని జంపు

టచేఁ బ్రకృతితోఁ బ్రతికూలమగు కార్యముజరిగినది. ఇట్లే యేదానముజేసినను దానికిందగినపుణ్యము గలుగఁ గలదు. ఎట్లనగా దానరూపమగు సాహాయ్యమువలన దాత ప్రకృతిప్రవాహములో ననుకూల కార్యముసలిపెను. దీనివలనఁ బ్రతిగ్రహీతకుమేలుగలుగగలదు. ఇట్లేయనుకూల కార్యప్రతిక్రియయో ప్రతికూలప్రతిక్రియయో పుణ్యరూపముచేతనో పాపరూపము చేతనో యేస్థితితో జీవునకు జీవత్వముయొక్క సంబంధము గలదో యట్టిస్థితి నే స్పృశించును. ఏమనుష్యుఁడు జీవత్వమునుండి పైకిఁబోయి బ్రహ్మత్వమునుబొంది జీవన్ముక్తుఁ డైనాఁడో వానియొక్క పాపముగాని పుణ్యముగాని యతనిని నెట్టిపట్టునగూడ నంటనేరదు. భగవంతుడు గీతలో నిట్లుచెప్పుచున్నాఁడు.

"యస్య నాహంకృతో భావో, బుద్ధిర్యస్య నలిప్యతే।
హత్వాపి స ఇమాఀ లోకాఀ నహన్తి ననిబధ్యతే"

ఎవరికి "నేను చేయుచున్నాను" అనెడి యీయహంకారముండదో ఎవనిబుద్ధి కమలదళమందున్న జలమువలె దేనినినంటకుండనుండునో యతఁడు మనుష్యుల నందఱిని రూపుమాపినగూడ హంతకుఁడు గానేరడు. మఱియు హత్యవలన గలిగెడి పాపముచే బద్ధుడునుగాఁడు. దీనింబట్టి జీవన్ముక్తుడగు మహాపురుషుడు ప్రారబ్ధముయొక్క వేగముచేగాని విరాట్భగవానుని

యిచ్ఛచేఁగాని యేకార్యములు చేయుచున్నాఁడో వానివలన ననుకూల కార్యమో ప్రతికూల ప్రతిక్రియయో యుద్భవించు గాక! ఆప్రతిక్రియ యతనిని స్పృశింపక విరాట్పురుషునినంట గలదు. ఎందులకనగా జీవన్ముక్తుని యేకార్యమైనను స్వేచ్ఛవలన జరుగుటలేదు జీవన్ముక్తుని సంగతియే యిట్లున్నప్పుడిఁక విష్ణుమూర్తినిగురించి వేఱుగా జెప్పవలయునా? ఈవిష్ణుదేవుఁడో యెల్లప్పుడును శుద్ధుఁడు, బుద్ధుఁడు ముక్తస్వభావుఁడునై యున్నవాఁడు ఇతని పనులన్నియుఁ దనకొఱకుఁ గాక ప్రకృతి ప్రవాహములో ధర్మధారనుననుకూలముగానుంచుటకైయుండును. అందువలన విష్ణువాచరించు నేకార్యమైనను విష్ణుని స్పృశింపనేరదు. కాని బ్రహ్మాండప్రకృతిని స్పృశింపఁగలదు. మఱియు నాకార్యము బ్రహ్మాండప్రకృతి కనుకూలముగానుండినచో నెల్లప్పుడును ధర్మముగానుండును. కాఁబట్టి విష్ణుబృందసంవాదములో విష్ణుమూర్తి చేసిన కార్యముయొక్క సంస్కారము పాపరూపమైనను బుణ్యారూపమైనను నావిష్ణుమూర్తిని నంటనేరదనియు బ్రహ్మాండప్రకృతి విచారమునుబట్టి చూచినయెడల నతఁడు ధర్మమునే యాచరించినాఁడనియు దెలియుచున్నది. ఇదియే "ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం" అని యుధిష్ఠిరమహారాజు వచించినట్లు పురాణములయొక్క తత్త్వమై యున్నది. ఇద్దానిని జ్ఞానియగువాఁ డెఱుంగఁగలడు. కాని పక్షపాతియు దోషదృష్టిపుష్టుఁడు నగు జను డెంతమాత్రము నెఱుంగ జాలడు.

## —మనుష్యులకు మృగాదులు పుట్టునా?—

భాగవతాది పురాణములగురించి యర్వాచీనులకు మరియొక శంకగలదు. అదేమనగా కశ్యప, దితి, అదితి, వినత, కద్రు, శరమ, స్త్రీపురుషులవలన దైత్య దానవ పక్షి సర్ప, అశ్వ, గజములు లోనగునవిపుట్టినవని భాగవతములో వ్రాసియున్నది. మానవస్త్రీగర్భములందు గజాశ్వములెట్లు పుట్టును? ఇది యసత్యము అనివారు చెప్పుచుందురు. ఇందులకు సమాధానము సంగబడుచున్నది అర్వాచీన పురుషులు సృష్టిరహస్యములు తెలియకయే యిట్టిశంకల గావించియున్నారు. సృష్టి కేవలము రజోవీర్యముల వలననే కలుగదు. కాని బైజియనియు మానసికమనియు రెండు విధముల సృష్టియుండును. సృష్టివిజ్ఞానమును విచారించిచూచినచో సృష్టి స్త్రీపుంశక్తుల కలయికచే గల్గుచున్నదని తెలియును. ఈసంయోగమువలన మానసికశక్తిని బట్టి స్థూలముగాను, సూక్ష్మముగాను ఉండగలదు.

"మనసా సాధుపశ్యతి
మానసాః ప్రజాః అసృజంత" మొదలయినవి

ఈశ్రుతి వచనములవలనగూడ మానవసృష్టి ప్రమాణిత మగుచున్నది. స్థూలశరీరము పాంచభౌతికమెప్పుడైనదో యోగులు పంచభూతములపై నధికారము గలవారైనందున వారియిష్టము వచ్చినపుడు పంచభూతములను నేకీకరణముచేసి శరీరమును

మిథ్యా సమాచారములను గూడఁ గల్పించి పురాణముల నెగతాళి జేసియున్నారు. ఎట్లనగా, హిరణ్యాక్షుఁడు భూమిని జాపగాజుట్టి తలక్రింద బెట్టుకొని నిద్రించెను. భగవంతుఁడు ప్రహ్లాదుని కొరకై కాలుచున్న కంబముపై చీమలనెక్కించెను ప్రాతఃకాలమునుండి సంధ్యాకాలమువరకు నాల్గు మైళ్ళ త్రోవను వాయువేగమునకు సదృశమైన రథమునం దెక్కి పోయెను, ఇటువంటి యనేక విషయములను మిథ్యగా వ్రాసి శంకించి యున్నారు. మఱియు ననేక స్థానములందు విష యముయొక్కయో, శ్లోకముల యొక్కయో, భావమును సరిగా గుర్తెరుంగక విరుద్ధార్థములను గల్పించి జూపించి యున్నారు

కాని ఇందునుచూర్చి భాగవతమును బాగుగా మన నము చేసినయెడల సత్యసిద్ధాంతములు దెలియ గలవు. వారు భక్తిశాస్త్రముయొక్క మహిమ నెంత నష్టపరచిరో చూడుడు. ప్రహ్లాదు నంతటిభక్తుని భక్తిపయిఁ గళంక మాపా దించిరి. మరియు నిట్టియనర్థముల కంతులేదు. ఇదంతయు భరతవర్ష దౌర్భాగ్యముయొక్క ఫలమే. పురాణములు భావ ప్రధాన గ్రంథములని తొలుతనే చెప్పబడినది. అందువలన జాలచోట్లలో భావమును బూర్ణముగాఁ బ్రకటించుటకొరకై యతిశయోక్తులుగూడ బురాణములలోఁ జిక్కుచుండును. దృష్టాంతముతో బోధింపఁబడుచున్నది. ఎట్లన, ఒకడు వాని

తేజస్సుచేతఁ బ్రపంచము వణకుచున్నదనియు, వానిసౌంధర్య మునుజూచి చంద్రుఁడీర్ష్యతోఁగృశించుచున్నాఁడనియుఁజెప్పను. అత్తఱి దీని తాత్పర్య మిట్లే కాదు.

ఇఁక నేమనగా, "ఒకని వీరత్వము వలన భూమి చలించినది. సౌందర్యమును చూచి మోర్వఁజాలక చంద్రుఁడు కృశించెను." అనెడి యావర్ణనము వీర్యముయొక్కయు, సౌందర్యముయొక్కయు గౌరవమును జూపుటకొరకే యై యున్నదని మనమనుకొన వలసియుండును. ఇట్లే పురాణములలోఁ గూడ రక్తబీజుఁడు మొదలగు వారి కథలయందు స్థూలరూపమును బట్టి రక్తబీజుఁడను పేరుగల యసురుని యసురత్వమును, సూక్ష్మ రూపముగా వాసనాశక్తిని జూపుటకొరకై సర్వప్రపంచము రక్త, బీజమయమని యట్టి వర్ణనముఁ చేయఁబడినది. అందువలన నీయాపద్విషయంబులంగూర్చి సందేహింపఁబనిలేదు. ధైర్యమును, విశ్వాసమును గలిగి పురాణములను బఠించిన యెడల నవశ్యము పురాణములలోని సర్వరహస్యములును దెలియఁగలవు. కొన్ని యెడలఁ గొన్నివిషయములు దెలియక పోయినచో నందు బుద్ధి దోషమే యుండును గాని పురాణముల దోషముండదు.

—✦✦ (ద్రౌపదికి పంచభర్తలగుటకు కారణమేమి?) ✦✦—

మహాభారతములో ద్రౌపదికిఁ బంచభర్తలుండెడి వర్ణనమును జూచి కలవర పడుచున్నారు. మఱియు నింతకంటె

నెక్కువగా భర్త లైదుగురైనప్పటికిఁ గూడ ద్రౌపదీదేవి ప్రాతస్మరణీయయగు పతివ్రత యైనందులకు గజిబిజి పడుచున్నారు. ద్రౌపది కేవురు పెనిమిటులెట్లు లైనది? వారు లేశ మాత్రము మెరుఁగ జాలకపోయిరి. ఒక డిది రూపకముగా భావించి ప్రకారాంతరముగ నర్థమును జెప్పెను. మఱియొకఁడు ప్రక్షిప్తమని తలఁచి విసర్జించెను. కాని యెట్టి ఘటనమగుట చేతఁ బంచ పాండవులు ద్రౌపదిని జేపట్టియుండిరో, యెట్టి ధర్మములను బాలించుటచేత ద్రౌపదీదేవి ప్రాతస్మరణీయ యైనదో, వానిపై విచారణము జేసినయెడల నెట్టి దోషమును గోచరింపదు. ఇది యసాధారణమగు ఘటనమై యున్నది. దీనికి సమాధాన మీదిగువ నొసంగఁ బడుచున్నది. మానవ ధర్మముయొక్క యేయంగమును గూర్చిగాని యుపాంగమును గూర్చికాని యనుష్ఠాన మొనరించినచో నాయనుష్ఠానము పూర్ణమైన యెడల దానిచేతనే వానికి ముక్తిగాఁగలదు. కారణమేమనగా, ఎట్లగ్నియొక్క యొకకణములోఁ గూడ విస్తారమైన యగ్నితో సమానముగాఁ గాల్చివేసెడి శక్తి గలదో యట్లే ధర్మముయొక్క యంగమునందుఁగాని యుపాంగమునందుఁగాని ధర్మలక్షణమును, సర్వప్రకారోన్నతులను, ముక్తిని నిచ్చెడి శక్తిగలదని హిందూ శాస్త్రములయొక్క సత్యసిద్ధాంత మైయున్నది. ఎప్పుడు వీరపురుషుఁడగు నర్జునుఁడు స్వయంవరములో లక్ష్యభేదమొనరించి ద్రౌపదినిగెల్చి యైదు

గురసన్నదమ్ములును గలిసి ద్రౌపదితోఁగూడ దమయాశ్రమమునకు వచ్చి నత్తరి నిత్యనియమమున ననుసరించి తల్లియైనకుంతీదేవిని నర్జునుఁడు పిలిచి "అమ్మా! నేఁ డొక యపూర్వ రత్నమును దీసికొని వచ్చినాను." అని చెప్పెను. ఆ పాండవుల నియమ మేమనగా, ఏవస్తువైనను దీసికొనివచ్చినమీఁదఁ దల్లి యాజ్ఞను గైకొని పరస్పరము పంచుకొని తీసికొనుచుందురు. నేఁడుగూడ నాప్రకారమే యర్జునుఁడు తన యమ్మయనుమతిని నడిగినప్పుడా కుంతీదేవి యింటిలోపలనుండి యేదియుఁజూడకయే యేవస్తువును మీరు దీసికొని వచ్చితిరో దాని నైదుగురు సరిగా బంచుకొని తీసికొనుఁడని యనెను. పాండవులు మిక్కిలి మాతృభక్తిగలవారు. ఆ దినమందు దొరకినవస్తువు పంచుకొనుటకుఁ దగినది గాదనుసంగతి పాపము కుంతీదేవికిఁ గూడఁ దెలియకుండెను. అందువలన నామె యట్లనుమతి నిచ్చెను. ఇట్లు మాత్రాజ్ఞాపాలన రూపమగు ధర్మముయొక్క యంగమును ముఖ్యమని తలఁచి పంచపాండవు లాయొక స్త్రీని వివాహమాడిరి.

ఈ కార్యమునందు మాతృభక్తిరూపమగు ధర్మాంగముయొక్క ప్రాధాన్యముగలదు. తల్లియాజ్ఞ, యజ్ఞానము చేచేయఁబడినదని ధర్మరాజార్జునాదులకుగూడఁ దెలిసి యుండెను. పాండవులు తల్లియొక్క యజ్ఞానకృతమగు ఆజ్ఞను బరిపాలింపక యానాటి వస్తువు పంచుకొనుటకు యోగ్యము గాదనియు,

గాబట్టి యిట్లాజ్ఞాపించుట తగదనియు నామెకు తెలియచేసి నప్పటికిని నెట్టిదోషము కలుఁగక యుండెడిది. కాని వారిట్లు చేసియుండినయెడల, ధర్మము జ్ఞానప్రధానమై యుండెడిదే కాని భక్తిప్రధానమై యుండెడిదికాదు. పంచపాండవు లేధర్మముయొక్క యాదర్శమును ఈవివాహమందు జూపిరో యదిజ్ఞానప్రధానధర్మముగాక మాతృభక్తి ప్రధానధర్మమై యుండెను. వారు భక్తినే ప్రధానంబుగాఁ దలఁచి విచారింప వలసిన యవసరము లేదనిభావించిరి. కారణమేమనగా, తల్లియాజ్ఞ యిచ్చినప్పుడాయాజ్ఞ జ్ఞానమూలకమగుగాక, లేక, యజ్ఞాన మూలకమగుగాక, దానిపై విచారణ మొనరించు టకుఁ బుత్రునికెట్టి యధికారమును లేదు. పుత్రుఁడు చేయదగిన పని తల్లియొక్కమాటను జెల్లించుటయే. మిగత పాప పుణ్యా భారము తల్లిమీఁదనే యుండును. ఇట్లు ధర్మముయొక్క భక్తి యనెడి యొకయంగమును ముఖ్యమని యెంచుట వలనఁ బంచ పాండవుల వివాహ మొక దౌపదితోడనే యైనది. ఇట్టిదానియొక్క దృష్టాంతము న్యాయమును ధర్మయుక్త మునుగూడనైయున్నది.

గురుని భక్తిగల శిష్యుని కర్తవ్యమేదనగా, ఎల్లప్పుడు గురుని యాజ్ఞపాలించుటయే యగును. ఇందుశిష్యున కభివృద్ధి గలదు. గురునియాజ్ఞ, విచారణపూర్వకముగాఁ జేయఁబడినదా యవిచారణగా జేయఁబడినదా? యనెడి యీయాలోచన

మొగరించుట కధికారము శిష్యునకు బొత్తుగా లేదు. ఇంకనిట్టి యాలోచనము శిష్యుని నిర్లక్ష్యమునకు, నవనతికిని, గారణ మగును. ఆజ్ఞాపించెడి యధికారము గురువుది. దానివలనఁ గలుగు పాపపుణ్యములకుగాని ఫలాఫలములకుగాని గురుఁడే బాధ్యుఁడైయున్నాడు. శిష్యుఁడుగాఁడు. శిష్యుని యధికార యాజ్ఞాపాలనము చేయుటయే. విచారించుటగాదు. ఇదియే భక్తి శాస్త్ర సిద్ధాంతము. పంచపాండవులీ భక్తిశాస్త్ర సిద్ధాంత మునే యనుసరించి నడిచిరి. దీనినే ముఖ్యమని యెంచి విచా రణమవసరము లేదని తలఁచిరి. ఇదియే యిట్టి యసాధారణ వివాహముయొక్క రహస్యమై యున్నది, ఇట్లైవురుపతు లైనప్పటికిగూడ ద్రౌపది, ప్రాతస్మరణీయ యగుటకుఁ గారణ మేమనగా, ఆమె తనకేవురుభర్తలున్నప్పటికి నట్టి యవస్థ లోనే సతీ ధర్మమును మిక్కిలి నేర్పుతో నిర్వహించి యున్నది. నియమమును ననుసరించి యొకపతితో సంబంధమెన్ని దినములవరకుండునో యన్నిదినములు దాటువరకు మిగత నలు వురఁ బాండవులను గూర్చి మనమునఁ గూడఁ బతిభావముతో నుండెడిదిగాదు. ఇదియే ద్రౌపదియొక్క దిట్టతనమునసాధారణ ధారణయు, వాఙియునామెవిభూతిరూప(దైవశక్తిగలది)యగుట తెలియఁ బరచునదియై యున్నది. ఇందువలననే ద్రౌపది ప్రాతస్మరణీయమైనది. ఈ ప్రకారముగానున్న యపూర్వ భావమును మనోవాక్కాయములతోఁ బూర్ణముగా నిర్వ

హించినప్పటికిని బ్రికృతి ప్రి ృతియే. మరియు నపూర్ణమును

నైయున్నది. అందువలననే యప్పుడప్పుడు ద్రౌపది యొక్క

చిత్తముం దర్జునుని గురించి విశేషముగా బ్రేమ బ్రకటమగు

చుండెడిది. కాని యీప్రేమ యైనను మనములోనే కేవలము

నిలిచి యుండెడిది. శరీరముతో దీనికేవిధమగు సంబంధము

లేకయుండెను. అనఁగా యీప్రేమచు గ్రియాపూర్వకముగా

నెంతమాత్రమును జేయునది కాదని తెలియవలెను. అట్లయి

నప్పటికిని దీనివలన మనోరాజ్యములోఁ గొంతపాపము సంభ

వించుటబట్టి మహాప్రస్థాన సమయమందు ద్రౌపదీదేవి, నడు

మనే యధఃపతనము జెందినది. సనాతన ధర్మములోని

యుచార భావమును, సూక్ష్మగతియు నెట్టిదో కంటిరా?

ఇది విచారించినచో ధర్మరతుఁడు చకితుఁడు కాగలఁడు,

విచారహీనుండగు వాఁడిద్దానిని గుర్తెరుంగ జాలక వ్యర్థము

గానే శంకించుచుండును. ఒక్కొక్క జనుఁడు తనయధికారము

ననుసరించియొక్కొక్కదశయందేధార్మికుఁడగుచున్నాడు. విశే

షముగా మరియొక పతిని గ్రహించుటయందు సతీధర్మవిరుద్ధ

ముగా ననేకసమయములు చిక్కినప్పటికిని బ్రతిసమయ

మందును యథాయోగ్యముగా మనోవాక్కాయములతో

బతివ్రతాధర్మమును బాలించుటయనునిదియే యసాధారణ

మగు నధికారమైయున్నది. అట్టి యసాధారణమగు నధికార

మును వహించుట యోగులకుఁగూడ దుర్లభమై యుండును.

ఇదియే ద్రౌపతీదేవి ప్రాతస్స్మరణీయ యగుటకుఁ గారణము. ఈరీతిగానొక్కొక్క మనుజుఁడు తనస్థితిననుసరించి సాధారణ ధర్మమునో, విశేషధర్మమునో, యసాధారణధర్మమునో, చేయఁ జాలునని తెలియుచున్నది. అత్తఱి ద్రౌపదీదేవి దనస్థితి ననుస రించి యసాధారణమగు సతీధర్మమును జక్కఁగా నిర్వహించి యున్నదనియు, పాండవులును మాతాజ్ఞ యవశ్య పరిపాల నీయమనెడి భక్తిభూమిలోనుండి జరిగిన ఘటనను విచారించి పరిపాలించుట యను తమ ధర్మమును లెస్సగా నిర్వహించి రనియు నిందెట్టిదోష మెవరిది లేదనియు నెఱుంగవలయును. అవశ్యమిట్టిధర్మ మసాధారణము. ఇట్టియాజ్ఞ నే సమాజము నందుఁగాని యేజాతియందుఁగాని యొసంగఁబడజాలదు. ఎందుల కనగా ఇది యసాధారణ ధర్మవిషయము. ఇది సాధారణ ధర్మముయొక్కఁగాని విశేషధర్మముయొక్కఁగాని విషయము గాదు. ఇంకను దీనిసంగతి మరియొకపరిఁ జెప్పబడును.

పురాణము భగవంతుని నిశ్వాసరూపము లైనందు వలన వానికి భగవంతునితోఁబాటు నిత్యమైనదియు, ఘనిష్ట సంబంధము గలదనియు, దొలుత నే యీవరకు వచింపబడినది. దీనింబట్టి యెట్లు భగవంతుడు పూర్ణుఁడో యట్లే పురాణములును బూర్ణములగును. ఇప్పుడు పురాణముల యీ పూర్ణత్వ మిది వరకుఁ జెప్పబడిన త్రివిధభాషలు, త్రివిధభావములు, త్రివి దాధికార వర్ణనము లెట్లు సకలజీవుల కల్యాణసాధనములు

మొదలగువాని రూపములలో నున్నవో యవి ప్రత్యేకించి యీ దిగువ వర్ణింపబడుచున్నది.

—(పురాణములలోని భాష)—

పురాణములయొక్క మొదటి పూర్ణత్వము త్రివిధభాషలయందుఁ గలదు. ప్రస్తుత సమయమందుఁ బురాణములగూర్చి పెక్కు మందికి పెక్కు సందియములు గలవు. అందులోనితర కారణములుగాక వారు బురాణభాషను గుర్తెరిగి చదువక పోవుటయే యొక ప్రధానకారణమై యున్నది. పురాణములలో భాషలు మూఁడు రీతులుగా వర్ణింపబడినవి. పురాణ సంహితలో నిట్లువ్రాయఁబడియున్నది.

"సమాధిభాషా ప్రథమా, లౌకికీతి తథాపరా
తృతీయా పరకీయేతి, శాస్త్రభాషా త్రిధాస్మృతా॥

పురాణములలో సమాధిభాష, లౌకికభాష, పరకీయ భాషయని మూఁడువిధములుగా నున్నది. ఋషులు వేదముల యొక్క యతిగంభీరములును సమాధిగమ్యములునగు తత్వము అనుగుర్తెరిగి సరిగా మిక్కిలి కఠినములునగుభాషలో బురాణము లందువ్రాసిరి. దాని పేరు సమాధిభాషయని వ్యవహరించెదరు. మహర్షులు సమాధిగమ్యములగు కఠిన తత్వములను లౌకిక పద్ధతి ననుసరించి లౌకిక భావముల తోడ్పాటుతో సకల రీతులుగా నుండు మనుజులకు బోధించుటకై పెక్కురకముల రూపకములతో ననేకాలంకారములతోఁగూడ మిక్కిలి సరస

ముగా నేలౌకిక వాక్యములవలన బ్రకటించుచున్నారో దాని నామము లౌకిక భాషయని యందురు. సమాధిభాషస్వర్గము లోని మందాకిని వలెనుండును. ఆ మందాకిని వలని యానంద లాభమును దేవతలే పొందఁ జాలుదురు. తరల తరంగిణియైన యా మందాకిని వలని యానందలాభము బొందెడి యదృష్టము భూలోకమందు మనుష్యులకు భాగీరథి కృపలేకుండఁ బట్ట నేరదు. కనుకన్ మహర్షులు భాగీరథీరూపిణియగు లౌకిక భాష వలన దుర్గమమును సమాధిగమ్యయును, మందాకినీ రూపయు నగు సమాధిభాషయొక్క భావములను భాగీరథీ ధారలతో సమానముగా మర్త్యలోకమందు బ్రవహింపజేసి మందమతు లగు మనుష్యుల కశేష కల్యాణములను గల్గించు సాధనము లుగా జేసిరి. పురాణముల నీ యేయితిహాసమువలన తత్వము బోధింపబడునో దానికిఁ బరకీయభాషయని నామము. కేవలము "సత్యంవద, ధర్మంచర" సత్యమును జెప్పుము, ధర్మము నాచరింపుము. " అనునీ మొదలగు నిట్టి యుపదేశము లవలన కొలది జనులు మాత్రమే సత్యవాదులు ధార్మికులు గాఁగలరు. కాని యీశిక్షనే దృష్టాంతములతో జూపించి బోధించినయెడల మనుష్యులు బాగుగానమ్మి ధార్మికులగుదురు. ఈహేతువు వలననే పురాణములందు బరకీయ భాష వాడఁబడినది. వేద ములందుగూడ నీ మూడు విధములుగానుండు వర్ణనశైలి యున్నది. కేనోపనిషత్తునందు అగ్ని వాయువు మున్నగు దేవతల

దర్పమును జూర్ణింపజేసి బ్రహ్మయొక్క సర్వశక్తి మత్త జూప బడినదో, ఛాందోగ్యోపనిషత్తునం దింద్రియములలో (బరస్పరము ప్రధానత్వమును జూపుటకై యేనివాదముజూపి తుదకుఁ బ్రాణ ప్రతిష్ఠ సేయఁబడినదో, యిటంత ను వేదమందలి లౌకిక వర్ణ నమైయున్నది. అట్లే వేదములందు దృష్టాంతరూపములుగా ననేక గాథలుగూడఁ గలవు. ఈత్రివిధవర్ణనము స్వభావసిద్ధమై యున్నది. ఎందులకనఁగా, ప్రపంచములో నధికారు లెల్లరొక రీతిగానుండరు. సర్వసమయములందు నొక భావమే యను కూలింపఁజాలదు. ఇదియే పురాణములలో నిట్టి భాషావైచిత్ర్యి ముండుటకుఁ గారణము. సమాధిభాష. లౌకికభాష, పరకీయ భాష, యీ మూడింటియొక్క యథార్థరహస్యమును దెలిసి కొనక పురాణశాస్త్రములను జదువుటయు జదివించుటయు నుప దేశించుటయు పూర్తిగా సఫలము గానేరదు. మఱియుఁ బూర్ణ మగు నానందమును గలిగింపఁజాలదు. ఋషులు సర్వప్రకార ముల నుండెడి యధికారుల కల్యాణముకొరకై కనికరించి పురాణ ములలో సర్వజీవులకు మేలునుకలిగించెడి మూఁడు విధములుగా నుండు భాషలయొక్క వర్ణనమును జేసిరి. ఇట్లు కనికరించిన మహర్షులయెడలఁ గృతజ్ఞతను జూపింపక యజ్ఞానులగు పురుషు లా మహామహులను దిట్టుటయు, వారి వ్రాతల సంశయింప మొదలిడిటయు దౌర్భాగ్య విషయమని తెలియవలెను. పురాణ ములలో నెచ్చట సమాధి గమ్యములగు విషయములను మహర్షు

లలంకారములతో లౌకిక భాషయందు వర్ణించి యుండిరో యచ్చట లౌకికభాషలోని యాధ్యాత్మిక సత్యభావమును గుర్తెఱుంగఁజాలక యా యాలంకారిక లౌకికభాషనే యితిహాసముగాఁదలచి యజ్ఞానులగువా రాక్షేపించుచు బుక్కిటి పురాణాల కేమని, యశ్రద్ధవహించుచున్నారు. కన్నులకుఁ గామిల రోగ (Jaundice) మున్నందువలన భూమియుఁ బసుపుబచ్చగాఁ గన్పడును. దీనివలన భూమియుఁ బచ్చగానుండునని సిద్ధాంత మగునా ? ఎన్నటికిని సిద్ధాంతముగానేరదు. కాని కనులకు రోగమున్నదనియే తెలియఁగలదు. ఆ ప్రకారమే పురాణములలో దోషములు గలవని యెవరనుచున్నారో వారి యందా దోషము లుండవలసినదే కాని పురాణములలో మాత్రమెట్టి దోషమునులేదు. ఏ పౌరాణికతత్త్వమును మహర్షులు జితేంద్రియులై సంయమ, ధ్యాన, ధారణా, సమాధులవలనఁ గొన్ని యెడలఁ సమాధిభాషయందును, గొన్ని యెడల లౌకికభాషయందును, గొన్నియెడల బరకీయభాషయందును వర్ణించిరో, దానిని నేఁటియింద్రియవశులును, శ్రద్ధాశూన్యులును, విషయలాలసులునైన జను లేప్రకారముగాఁ దెలిసికొనుటకు బోటీజేయుచున్నారో విచారణీయము. భగవద్భక్తివలనఁ జిత్తము పరిశుద్ధమైనతరిని, నింద్రియములను జయించి చిత్తము నేకాగ్ర మొనరించిన తరుణముననే, ధారణ, ధ్యానముల వలన చిత్తమున్నతిఁ బొందిన సమయముననే, పురాణములలో నిగూఢ

విషయములను దెలిసికొనుటకు వీలు గలుగును. అట్లుకాక ధర్మ విహీనులగు వా రూరక పాశ్చాత్యశిక్ష నభ్యసించి గర్వించి యేమియుఁ దెలియక సంచరించుచుఁ దమ బుద్ధులకు గోచరింపని పురాణములలోని విషయముల నెగురఁగొట్టివేయుట ధీమంతుని లక్షణముగాని పండితుని లక్షణముగాని కానేరదు. కాని వారి భీరుత్వమును, నహంకారమును సూచించునదియై యున్నది. ఆ పురాణ తత్త్వములను ధీరుఁడయి నిష్కల్మషబుద్ధితో నిర్ణయించుటయే యోగ్యతావిద్వత్తా పరిచయ మగును. కాబట్టి పురాణతత్త్వముల నెగురఁగొట్టివేయక వానిని స్థిరింపఁజేయవలసి యుండును. పురాణములలోని పరకీయభాషయం దితిహాసముయొక్క సంబంధ మున్నప్పటికిని లౌకిక భాషలో నన్నిచోటుల నితిహాసములు లేవు. వానియందుఁ జాలవఱ కాలంకారిక వర్ణనములు గలవని జ్ఞప్తియుంచుకొనవలెను. సమాధి భాషను సరళముజేయుటకొఱకే లౌకిక భాష ప్రయోగింపఁ బడుచున్నది. సమాధి భాషలోఁ జెప్పిన ధర్మమును దృఢీకరించుటకై పరకీయభాష యుపయోగింపబడుచున్నది. ఇఁక నీమూఁడు భాషల దృష్టాంతములతో నీదిగువఁ జెప్పఁబడుచున్నవి. పురాణముల నెఱింగెడి విషయమునందు భ్రాంతిపడుటకు మఱియొక కారణము గలదు. ఏదనగా, జను లేదోయొక పురాణమును జదివియే యావద్విషయములను సిద్ధాంతీకరింపఁ బూనుదురు, కాని యట్లొనర్చి

నందువలన సిద్ధాంతములు సరిగా బయలుదేరనేరవు. ఎందుల కనగా, ఒక పురాణములో నెల్ల ప్రకారములుగా నుండు భావములుగాని భావములుగాని వర్ణింపబడవు. ఇకంతు నొక తత్త్వమునే యొకపురాణమందు సమాధిభావవలనను, నొక్కొక పురాణమందు లౌకికభావవలనను వర్ణింతురు. ఈ రీతిగా నొక తత్త్వమునే యొక పురాణములో నాధ్యాత్మిక భావ మందును, మరియొక పురాణములో నాధిదైవిక భావమునందును వేఱొక పురాణములో నాధిభౌతిక భావమునందును వర్ణింతురు. కాబట్టి యెల్ల పురాణములను జదువుటవలననే సరియైన తత్త్వములు బోధపడగలవు. ఇవి యీక్రింది దృష్టాంతములవలన స్పష్టపడగలవు

విష్ణుపురాణముయొక్క ప్రథమాధ్యాయములో సృష్టిని వర్ణించెడి సందర్భమునందు ప్రకృతి, పురుషుల సంయోగము వలన, నేభాసలో మహత్తత్త్వము, అహంతత్త్వము, మనస్సు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచ మహాభూతములు, మున్నగువాని సృష్టియొక్క వర్ణనము సేయబడియున్నదో యదియంతయు సమాధిభాష. సమాధి గమ్యమగు నీతత్త్వమునే దేవీభాగవత, శ్రీ భాగవత ములందు లౌకికభాషగా విచిత్రరూపముగా వర్ణించియున్నారు. దేవీ భాగవతమందిట్లు లిఖింపబడినది:

"సకృష్ణ స్సర్వసృష్ట్యాదౌ, సిసృక్షు స్త్వేక ఏవ చ,
సృష్ట్యున్ముఖస్తదంశేన, కాలేన ప్రేరితః ప్రభుః॥

స్వేచ్ఛామయ స్స్వేచ్ఛయా చ, ద్విధారూపో బభూవహ,
స్త్రీరూపీ వామభాగాంశో, దక్షిణాంశః పుమాన్స్మృతః॥
దృష్ట్వా తాస్తుతయాసార్థం, రాసేశో రాసమండలే,
రాసోల్లాపే సురసికో, రాసక్రీడాం చకార హ॥
అథసా కృష్ణచిచ్ఛక్తిః కృష్ణగర్భందధారహ,
శతం మన్వన్తరం యావజ్జ్వలంతీ బ్రహ్మతేజసా॥
శతం మన్వంతరాంతే చ, కాలేతీతే చ సుందరీ
సుషావడింభం స్వర్ణాభం విశ్వాధారా లయం పరం॥"

ప్రపంచమును సృష్టించెడి శ్రీకృష్ణ పరమాత్మ, ప్రళయ సమయమందొకఁడే కాలముచేఁ బ్రేరేపింప బడినవాఁడై సృష్టించుట కిచ్ఛించెను. అత్తరి నతఁడు తన మేని యెడమవైపునుండి నొకపడతిని వెడలఁజేసెను. ఆమెయే ప్రకృతి. పరమాత్మ, తన శక్తిస్వరూపిణియగు నా స్త్రీనిఁజూచి దానితోఁగూడి విహరింప మొదలిడెను. తరువాత నా సుందరికి గర్భమాయెను. ఒక నూరు మన్వంతరములవఱ కాగర్భము నిలిచియుండెను. ఆతరువాత ప్రకృతి గర్భము నుండి యొకయండము బయలువెడలెను. మరియు నాయండము నుండి సమస్తసృష్టి యయ్యెను. ఇదియే దేవీభాగవత లౌకిక భాష. విష్ణుపురాణములో నేసృష్టితత్త్వము సమాధిభాషలో వర్ణింపఁబడియున్నదో యావిషయమే లౌకికభాషలో నీరీతిగా దేవీభాగవతమునందుఁ జూపఁబడినది. రెంటియొక్క భావములు నొకటియేసుమీ. కేవలము భాషల వైచిత్ర్యమని తెలి

యవలెను. ఇట్టితత్త్వమే, యాంశికరూపముతో శ్రీమద్భాగ
వతాష్టమస్కంధముయొక్క పండ్రెండవ యధ్యాయము
నందు వర్ణింపఁబడినది. ఇద్దానియందు భగవంతుని దురత్యయ
యగు దైవీమాయయొక్క మహిమను వర్ణించుచు శివశక్తుల
సంబంధమువలన సృష్టివిషయము వచింపఁబడినది. బ్రహ్మకు,
మాయనుండి అతీతమైనప్పటికిని నీశ్వరునిలో మాయయొక్క
యుపాధిగలదు. దీనివలన నీశ్వరుని చిత్తములో సిసృక్షు గల్గిన
మీఁద, నతని వీర్యరూపయగు చేతనశక్తి మాయనుఁజూచి
స్ఖలితమైనందువలనఁ బ్రపంచమునందు వివిధవస్తువు లుత్పత్తి
యగుచున్నవి. ఈ యాధ్యాత్మిక భావమునే గ్రహించి భాగవ
తాష్టమ స్కంధమునందు మోహినియొక్క మాయనుఁజూచి
శివుఁడు ముగ్ధుఁడయ్యెననెడి విషయము వర్ణింపఁబడినది. మాయ
యొక్క వెనువెంటఁ గామవశుఁడై పరుగిడుటవలన నతనికి వీర్య
స్ఖలనమయ్యెను. ఇద్దానినుండి వెండి, బంగారముల గనులు
బయలుదేరినవి. భాగవతమందిట్లు వ్రాయఁబడినది.

తస్యాను ధావతో రేతశ్చ స్కంధా ఽమోఘ రేతసః,
శుష్మిణో యూథపస్యేవ, వాసితా మనుధావతః॥

యత్రయత్రాప తన్మహ్యాం, రేతస్తస్య మహాత్మనః,
తాని రూప్యస్య హేమ్నశ్చ, క్షేత్రాణ్యాసన్ మహీపతే॥

ఇట్లే శ్రీమద్భాగవత చతుర్థస్కంధమునం దిరువది
తొమ్మిదవ యధ్యాయములోఁ బురుషునిఁ బురంజనునిగాఁజెప్పి

సమాధిభాషతో సూక్ష్మశరీరమును గురించియు, స్థూలశరీర మును గురించియు, సూక్ష్మశరీరమందలి మనోబుద్ధి చిత్తాహంకారములం గూర్చియు స్థూలశరీరమందలి యింద్రియముల యొక్క నవద్వారములంగూర్చియుఁ, బురుషునకుఁ బ్రకృతితోఁ గల సంబంధమును గురించియు, నా సంబంధముచేఁ గలుగు బంధనముయొక్క యాభాసమును గూర్చియు సృష్టియొక్క విస్తారము మొదలగువానిఁ గూర్చియు వర్ణింపఁబడినది. ఆ స్కంధములోనే ౨౫, ౨౬, ౨౭, ౨౮ వ యధ్యాయములలోఁ నీ సమాధిచేఁ బొందఁదగిన విషయమే లౌకికభాషయందలంకారరూపముగా వర్ణింపఁబడినది. దీని విస్తారవర్ణన మా గ్రంథమందే చూడఁదగినది. ఈ ప్రకారముగా నేమహాభారతములో స్త్రీపర్వమునందు విదురుఁడు ధృతరాష్ట్రుని చిత్తమందు వైరాగ్యము గలిగించుటకై యే సంసారగహనము వర్ణింపఁబడినదో యందుఁగూడ సమాధిగమ్య విషయము రూపకములతో లౌకికభాషలో వచింపఁబడినది. అందు సంసారమును గాంతారముగాఁజూపి సంసారములోని రోగములను హింసించెడి పశువులగాను, జరను భీకరమైన స్త్రీనిగాను, దేహమును గూపముగాను, కాలమును గూపములోనుండు సర్పముగాను, ఆశను గూపములోనుండు తీగగాను, గజమును సంవత్సరముగాను, దాని యాఱుమొగముల నాఱు ఋతువులుగాను, దాని పండ్రెండు పాదములను బండ్రెండు నెలలుగాను, మూష

కములను రేఁయింబవళ్ళుగాను, కామమును మధుకరముగాను, మధువును గామరసముగాను, వర్ణించి దుర్గమమగు సంసారము, మఱియు దానినుండి ముక్తుఁడగు నుపాయమును జూపఁబడి నవి. అట్టికథ యీ దిగువ నొసఁగఁబడుచున్నది.

ఒక సమయమందొక బ్రాహ్మణుఁడు దైవయోగమున క్రూరమృగము లచే నిండియున్న యొక యరణ్యమునకుఁజనెను. అతఁడందలి పులుల గాండ్రింపులకును, నేనుఁగుల ఘీంకరింపు లకును, సింగముల గర్జింపులకును భయపడి యా యడవినుండి వెడలిపోవుటకై పరుగిడ మొదలిడెను. కాని వానికిఁ దప్పించు కొని పోయెడి మార్గమేదియు దొరకదయ్యె. తరువాత నా బ్రాహ్మణుఁడా యడవి నలుగడల నొక భయంకరస్త్రీ వల వేసియుండుట గని పెట్టెను. ఆ వనమునందు లతలతోడను, తృణములతోడను గప్పుకొని యున్న యొక బావియున్నది. ఆ విప్రుడట్లు పరుగిడి పరుగిడి యా బావిలోఁ బడిపోయి యందలి తీగలచేత నూర్ధ్వపదుఁడును, నధోముఖుఁడును నై యల్లాడుచుండెను. ఇట్టి తరుణమునందే మఱియొక యాప ద్రివముగూడ సంభవించెను. ఏదనఁగా, కూపమునందొక భయంకరసర్పమును నావిప్రుడు చూడఁదొడంగెను. మఱియుఁ గూపముయొక్క పైభాగమునుండి యాఱుమొగములు గల దియుఁ బండ్రెండు పాదములుగలదియు నగు గజమా బ్రాహ్మ ణుని వైపునకు రాఁగడంగెను. పైతీగలతోఁ జుట్టుకొనియున్న

వృక్షముయొక్క మూలమును (వేళ్ళు) రెండెలుకలు కొఱుకు చుండెను. ఆ వృక్షముపైఁ దేనెటీగలు పెక్కుచేరి తేనెతుట్టను బెట్టెను. దానినుండి మధుధార (తేనె) పడుచుండెను. ఆ బ్రాహ్మణుఁడా పడుచుండెడి తేనెచుక్కలను జప్పరింప మొదలుపెట్టెను. ఇందుననే సంసారముస్వప్నమనియు నిద్దానిని విడచుటయే ముక్తియనియుఁ దెలియఁగలదు. ఇట్లు పురాణములందాధ్యాత్మిక విషయములు విశేషముగా మధురమై ఖరిలోనే వర్ణింపఁబడినవి. ఇదంతయు మహర్షుల యపార కృపాఫలమే యై యున్నది.

## —◆◆ బ్రహ్మ - సరస్వతి ◆◆—

బ్రహ్మదేవుఁడు తన కన్యనుజూచి కామాతురుఁడై యామెతోఁగూడ నొక కమల మందుండఁదొడంగెనని మత్స్యపురాణమునందు వ్రాయఁబడినది. దీని ఫలమువలన మనువు మున్నగువారి సృష్టియైనది. ఎట్లనఁగా

తతస్సంజపతస్తస్య, భిత్వాదేహ మకల్మషం
స్త్రీరూప మర్ధమకరో దర్ధం పురుషరూపవత్॥
శతరూపా చ సాఖ్యాతా, సావిత్రీ చ నిగద్యతే
సరస్వ త్యథ గాయత్రీ, బ్రహ్మణీ చ పరంతప!
తతస్స్వదేహ సంభూతాం, ఆత్మజామిత్య కల్పయత్
దృష్ట్వాతాం వ్యధితస్తావ త్కామబాణార్దితో విభుః॥
ఏతత్తత్వాత్మకం కృత్వా, జగద్వేధా అజీజనత్
సావిత్రీం లోకసృష్ట్యర్థం, హృదికృత్వా సమాస్థితః॥

తపస్సు జేయుచుండెడి బ్రహ్మయొక్క సగము శరీరమునుండి స్త్రీరూపమును, మిగత సగముశరీరమునుండి పురుషరూపమును బయలుదేరెను. అట్లు బయలుదేరిన స్త్రీకి శతరూప, సావిత్రి, సరస్వతి, గాయత్రి, బ్రహ్మణి, యనియు నామములు గలిగెను. వ్యాపకుండగు బ్రహ్మదేవుడామెను కన్యకగా నొప్పుకొని వీక్షించుచునే కామబాణములచే బీడితుండై యటుతరువాత నా సావిత్రిని తనమెదను ధరించి తత్క్రమముగా బ్రపంచసృష్టి నొనర్చెను. ఈ శ్లోకము లందు దపస్సువలన నర్ధాంగమునుండి స్త్రీ జననమగుటయు, దానిని కన్యకగా దలచినమీదగూడ గామము గలుగుటయు, తరువాత దానితోగూడ గలిసి సృష్టించుటయు మున్నగు విషయములు విచారణయోగ్యములై యున్నవి. ఇందు బ్రధమవిచారణీయాంశ మేమనగా, ఏప్రకారముగా నధునాతనులు కామశబ్దమున కర్థము దీయుచున్నారో యట్టి భావము పురాణములందుగాని వేదములందుగాని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల విషయమునందు జూపింపబడి యుండ లేదు. వానిలో నెల్లయెడల గామశబ్దము సిసృక్ష (అనగా సృష్టి జేయవలయునను కోరిక) భావమును ప్రకటించియున్నది. వేదమునందిట్లు చెప్పబడినది-

"కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్"

"సతపస్తప్త్వా మైథున మైచ్ఛత్ః"

ఈ మంత్రములందుఁ బరమాత్మయొక్క కామము, మనుష్యులతోఁ బాటువంటిదిగాదు. ఇఁకేమన, తపస్సువలన సృష్టిజేసెడి యిచ్ఛయైయున్నది. ఈ తపస్యయు సాధారణమైన తపస్సుగాదు. ముండకోపనిషత్తునందుఁ జెప్పినదేమనఁగా

"తస్యజ్ఞానమయం తపః"

అతని తపను జ్ఞానరూపమైనది. ఈభావమే సర్వప్రదేశములందుఁ బ్రదర్శింపఁబడినది. ఇద్దానిని విచారశీలుఁడు గ్రహింపఁగలఁడు. బ్రహ్మదేవుఁడుగూడఁ నీరీతిగానే తపస్సుజేసి కన్యను బుట్టించియుండెను. మనుష్యుఁడు బ్రహ్మవిష్ణువు మున్నగువారి యథార్థస్వరూపమును గుర్తెఱుఁగఁజాలకపోవుటయే యీ వైవిషయమునందుఁ భ్రాంతిపడుటకు మరియొక కారణమైయున్నది. చాలమంది యర్వాచీనులు నాల్గువేదములను జదివినవాఁడే బ్రహ్మయని చెప్పియున్నారు. ఇట్లూహించి చెప్పుట దైవజగత్తును తెలిసికొనఁ జాలని ఫలమైయున్నది. జడము ప్రకృతియందు స్వయముగాఁ జేయుటకు శక్తి లేనందునఁ జేతనశక్తికి స్వాధీనమై కార్యములను జేయగలదను విషయము దొలుతనే పలికియున్నాము. ఈసిద్ధాంతము ననుసరించియే బ్రహ్మాండంబునందు వ్యాప్తమగు నే చేతనశక్తి, యున్నందువలన బ్రహ్మాండ ప్రకృతిసృష్టిని సృష్టింపఁజాలియున్నదో బ్రహ్మాండమునందు వ్యాప్తమైన యీ చేతనశక్తి యొక్క నామము బ్రహ్మయని యెఱుఁగవలెను. అట్లే

బ్రహ్మాండములో వ్యాప్తమై స్థితిని గల్గించెడి చేతనశక్తియొక్క నామధేయము విష్ణువు. మరియు లయమును జేసెడిశక్తియొక్క పేరు రుద్రుడు. అనఁగా నీమూఁడు తెఱంగులుగానుండు శక్తుల యొక్క అధిష్ఠాత లీ మువ్వురధిదైవతములు. ఈ మువ్వురి వలననే ప్రకృతియందు సృష్టి, స్థితి, ప్రలయములు నియమముగా జరుగుచుండును. భిన్నభిన్న బ్రహ్మాండములందీశక్తులు భిన్నభిన్నరీతులుగా నుండఁగలవు. ఈ దేవతలెల్లరు భక్తుల భావము ననుసరించి రూపమునుదాల్చి దర్శనముగూడ నొసంగఁజాలుదురు. వారి సర్వరూపములును భక్తుల భావము ననుసరించి కాఁగలవు. ఇయ్యవి మంత్రయోగాధ్యాయమందుఁ జూపఁబడును. ఈ విషయము సత్యమును పాశ్చాత్యుల పదార్థ విజ్ఞానశాస్త్రము (సైన్సు) ను బట్టియు సిద్ధించినదియు నైయున్నది. ఎట్లనఁగా, ఏయే రూపములు గంటఁబడుచుండునో అవన్నియు శక్తియొక్క ఘనీభావములై యున్నవి. శక్తియే ఘనీభూతమై (ముద్దమై) స్థూలరూపముగా మారుచుండును ఒక బీజమందున్న సూక్ష్మశక్తి, ఘనీభూతమై వృక్షరూపముగా మారినట్లు జీవునియొక్క స్థూలశరీరము జీవుని చిత్తమందున్న సూక్ష్మశక్తియొక్కయే ఘనీభావమై యున్నదని యెఱుంగవలెను. కాఁబట్టి భక్తునిభావము ననుసరించి దేవతలని చెప్పఁబడెడి సర్వచేతనశక్తులు స్థూలరూపములను ధరించి దర్శనమీఁడఁజాలును. ఇంక ప్రేతకు స్థూలశరీరము లేకపోయినప్పటికి

గూడ దాని సూక్ష్మశరీరములోనుండు వాసనయొక్క తీవ్రశక్తి ఘనీభావము వలననే యప్పుడప్పుడ నేకరీతులుగానుండు స్థూల శరీరములు గలిగియుండుననియు,వీని ఛాయాపటములను(ఫొటో లను) సైతము నమెరికాదేశమందిప్పుడు యంత్రముల సహాయ మున గైకొనుచుండిరనియు నీ మొదలగు విషయములు ముందు ముందుఁ జెప్పఁబడఁగలవు. ప్రస్తుతమందు విచారణీయాంశ మేమనఁగా, బ్రహ్మాంశమును సృష్టించెడి చేతనశక్తియొక్క యధిదైవమగు బ్రహ్మతోఁగూడ సరస్వతియొక్క సంబంధ మేరీతిగానైనది యెట్లయినదనునవి. ఎంతవఱకుఁ గర్మతో జ్ఞాన మునకు సంబంధముండదో యంతవఱకుఁ గర్మ చక్కగా నెర వేరదు. మరియు ననేక సమయములందు భగవద్గీతలో వచిం చినట్లు వికర్మకూడఁ గాఁగలదనెడి యీ విషయము సత్యమై యున్నది. లౌకిక జగత్తులోఁగూడ జ్ఞానములేకుండ సంసారము నందే కార్యమును జరుగఁజాలదనునది మనము చూచుచున్నాము. అజ్ఞానముచేఁ గార్యముజేసినచో నది వికటింపఁగలదు. ఈ సత్యము మరియొక భావముతోడ సప్తశతియందు వర్ణింపఁ బడినది. అందు భగవంతుఁడగు శ్రీ మహావిష్ణువు యోగనిద్ర యందుండెననియు బ్రహ్మదేవుఁడు వేదములను హస్తములతో గైకొని యతని నాభికమలమునుండి పుట్టినాఁడనియు. కాని కొంతతడవయిన వెంటనే యా విష్ణునియొక్క చెవియందలి మలినమునుండి (గుబిలి) పుట్టిన మధువు, కైటభుఁడు, అను నామ

ములుగల యిరువురు రాక్షసులు బ్రహ్మను నాక్రమించి వేద ములను హరింప మొదలిడిరనియు అట్టి తరుణమందు బ్రహ్మ దేవుడింకొక యుపాయము గానంజాలక నిద్రారూపిణియగు మాయను స్తుతించి విష్ణుమూర్తిని మేల్కొల్పెననియు దీనిచే విష్ణువుమేల్కొని యా రాక్షసుల నిరువురను రూపుమాపి బ్రహ్మను సుఖిని గావించెననియు వ్రాయంబడియున్నది. ఈ వర్ణ నములకన్నిటికి నాధ్యాత్మిక రహస్యమున్నది. ఏదనంగా, విష్ణు భగవానుండు చిత్తు- అనగాం జ్ఞానప్రధానమగు సత్త. ఆ జ్ఞా నము నిద్రించియున్నది. ఎందులకనంగా, విష్ణువు యోగనిద్ర యందుండెను. దీనివలనం గర్మముయొక్క దేవ తయగు బ్రహ్మదేవున కాపత్తు గలిగినది. మధు, కైటభులనెడి రాక్షసులు విష్ణుని చెవిగుబిలినుండి పుట్టిరి. కర్ణము శబ్దమునకు స్థానమైయున్నది. ఏలయనంగా, ఆకాశతత్త్వముయొక్క వికా రముచే గర్ణముత్పన్నమయ్యెను. వెండియు నాకాశగుణము శబ్దము. కర్ణమల (గుబిలి) మధిక మగుటచేత నది శబ్దవిరోధి యయ్యెను. ఇందువలన బ్రహ్మరూపుండగు విష్ణుని చెవిగుబిలి, శబ్దబ్రహ్మరూపియగు వేదమునకు విరోధియైనది. కాంబట్టి కర్ణ ములనుండి పుట్టిన యిరువురు రాక్షసులు బ్రహ్మను ముట్టడించి వేదముల నపహరింపం దొడంగిరి. బ్రహ్మదేవుని స్తుతివలన విష్ణుమూర్తి మేల్కొనినప్పుడు కర్మదేవతయగు బ్రహ్మదేవు నకు జ్ఞానదేవతయగు నా విష్ణుమూర్తియొక్క సాహాయ్యము

దొంకినది. అత్తఱినే యాయసురులు నాశమైరి. మఱియు బ్రహ్మ దేవునివలన సృష్టికార్యములును జక్కఁగాజరుగ మొదలిడినది. పురాణము లితిహాసములుగావు. భావప్రధానములగు గ్రంథములు. కాఁబట్టి యొక్కతత్త్వమే యనేకపురాణములం దనేక ప్రకారములుగా వర్ణింపఁబడుచుండును. ఎట్లనఁగా, దుర్గా సప్తశతియం దేయేభావము విష్ణుని యోగనిద్రయు, బ్రహ్మదేవుని యొక్క స్తుతియు, మధు, కైటభ రాక్షసుల యత్యాచారములు, మున్నగువాని రూపముగా వర్ణింపఁబడినదో యా భావమే మత్స్యపురాణములోఁ దపస్సువలన సరస్వతి పుట్టుటయు, బ్రహ్మతో సరస్వతి గలియుటయు, ప్రపంచోత్పత్తియు లోనగువాని రూపముగా వర్ణింపఁబడినది. సరస్వతి, విద్య (జ్ఞానము) యొక్క దేవి. బ్రహ్మ కర్మదేవత. కర్మ శక్తితోఁగూడ జ్ఞానశక్తియొక్క కలయిక గలదో దానినేకదా కన్యతోడి కలయికగాఁ బురాణములందు లౌకికభాషలో వర్ణించినది. బ్రహ్మ దానిని తపస్సువలనఁ దన సగముశరీరమునుండి పుట్టించియున్నందున నది కన్యయని చెప్పఁబడినది.

"ఆత్మా వైజాయతే పుత్రః"

పుత్రుఁడును, గన్యయు ఆత్మరూపముగా పుట్టుచుండును. స్త్రీ, యితరుని యింటినుండి వచ్చును. సరస్వతిని బ్రహ్మదేవుడు తన శరీరమునుండి పుట్టించెను. ఆమె యేపరుని గృహమునుండి తీసికొనిరాఁబడలేదు. మఱియు నీవిషయము విజ్ఞానసిద్ధముకూడ

నైయున్నది. ఎటులనగా, "తస్యజ్ఞాన మయం తపః" ఆతపస్సు జ్ఞానమయము. సాధారణతపముగాదనెడి వేదమంత్రము తోలుతనే చెప్పఁబడినది. బ్రహ్మదేవునకు జ్ఞాన మవసరమై యుండెను, ఏలయన, జ్ఞానము లేకుండ సృష్టి చక్కఁగా జరుగఁజాలదు. సంధ్యామంత్రమం దిట్లున్నది.

"యథాపూర్వమకల్పయత్ దివంచ పృథివీంచాంతరిక్షమథోస్వః"

పృథివియు స్వర్గాదిలోకములయు సృష్టి పూర్వకల్పము ననుసరించి చేయబడెను. ప్రళయ సమయమందు జీవుఁ డే యోనియందుండి లయమగుచున్నాఁడో వాని సంస్కారాను సారముగా సృష్టిసమయమందా యోనియందే సృజింపవలసి యుండును. ఎవఁడు పూర్వకల్పములో మనుష్యుడై యుండెనో వాఁడు మనుష్యుఁడేయై తిరిగి రాఁగలఁడు. ఏది పశువైయుండునో యది యా పశువై తిరిగి జన్మించును. ఏది వృక్షమైయుండెనో యది తిరిగి వృక్షమై యుండును. అట్లే కర్మానుసారముగా సరియైన సృష్టిని నిట్టి జ్ఞానముండిననే బ్రహ్మదేవుఁడు చేయఁగలఁడు. జ్ఞానము లేనిచో సృష్టికార్యమునందు గడిబిడిగా గలదు. కాఁబట్టి బ్రహ్మ, తపస్సువలన జ్ఞానరూపిణియగు సరస్వతిని దనలోనుండి పుట్టించి దానిని హృదయమందుఁ దాల్చి మత్స్యపురాణమందు వర్ణించినట్లు సృష్టించెను. ఉన్నతి బీజవృక్ష న్యాయముగా (అనఁగా బీజములోపల వృక్షము యొక్క సంభారమంతయు నిమిడియున్నట్లు) ఉండును. కేవల

మా వృక్షసంభారమును వెలుపలకుఁ బ్రకటింపఁ జేయుటయే యున్నది. ఆ ప్రకారముగానే యొక్కొక్క చేతనపదార్థము జ్ఞానమయుఁడగు భగవంతుని రూపమగుటంబట్టి జ్ఞానము యొక్క సత్తయంతయు నొక్కొక్క వస్తువులో బీజమునందు వృక్షసంభారము చెలంగినట్లాదినుండియే యున్నది. కేవల మా జ్ఞానమును బ్రకటింపఁజేయుటయే యున్నది. కాబట్టి బ్రహ్మ యందాదినుండి యున్నట్టి జ్ఞానశక్తిని నతఁడు తపస్సువలన సరస్వతీరూపముగా దనలోనుండి ప్రకటింపఁజేసి యున్నాఁడు. అటుతరువాత నాజ్ఞానముయొక్క తోడ్పాటుతోడనే సృష్టించి యున్నాఁడు. ఇదియే మత్స్యపురాణములోని వర్ణనముయొక్క రహస్యమైయున్నది

ఈ ప్రకారముగా శివపురాణములో నారాయణుఁడు జలములోపలఁ బరుండుటయు, నతని నాభి కమలమునుండి బ్రహ్మదేవుఁడు నిర్గమించుటయు, నేనేగొప్ప, నేనేగొప్పయని వారిరువురు దగవులాడుటయు, వారికి జగడమయ్యెడి తరుణము నందు వారిమధ్యనుండు శివునియొక్క ప్రచండంబగు జ్యోతిర్లిం గము బయలుదేరుటయు, దానిజాడఁ దెలిసికొనుటకై బ్రహ్మ, యూర్ధ్వభాగమునకును విష్ణు వధోభాగమునకును బోయిరి. కాని దానిజాడ నెవరికిఁగూడఁ జిక్కకుండె. దీనివలనఁ దమ యిరువురికంటెఁగూడ మూఁడవవాఁడు వేఱొకడు గొప్ప వాఁడుగలఁడని వారు గుర్తెరింగిరి. ఈ విషయమును దెలిసికొని

వారిరువురును వివాదమునుండి విరమించిరను మున్నగు విషయ ములుగల యొకకథవచ్చును. ఈలౌకికభాషయందు వర్ణింపబడిన వర్ణనముయొక్క రహస్యమేమనఁగా, విరాట్స్వరూపుఁడగు భగ వంతునియొక్క యనాదియు, ననంతము నగు స్వరూపమువల ననే యతని యచింతనీయమగు బ్రహ్మస్వరూపముయొక్క యనుభవము కాఁగలదు. అనఁగా, ఈ యనాదియు, ననంతము నగు శరీరమును ధరించిన విరాట్పురుషుఁడే సచ్చిదానంద మయుఁడగు బ్రహ్మయొక్క లింగమైయున్నది. లింగశబ్దమునకు "చిహ్నమ"ని యర్థము. అనఁగా, ఏ స్థూలచిహ్నమువలన నొకపదార్థము బోధయగునో దానిని "లింగ"మని యనెదరు. ఈకథ శివపురాణములో నెప్పుడున్నదో, పురాణము భావ ప్రధానగ్రంథ మెప్పుడైనదో యప్పుడు పూర్వసిద్ధాంతము ననుసరించి శివపురాణములోని శివుఁడు సాధారణ శివుఁడు గాఁడు. ఇఁక నేమన, పరమాత్మయగును. శివుఁడు మనుష్యుని వలె శరీరధారిగాఁడు. అతనిశరీరము మరియొకరీతిగానుండును. దేనివలన నొకవస్తువుయొక్క లక్షణము బోధయగునో దానికి లింగ మని చెప్పెడరు. అనఁగా, న్యాయ దర్శనములో "ఇచ్ఛాద్వేష సుఖ దుఃఖములు" ఆత్మయొక్క లింగ మని లిఖింపఁబడినది. కాని దీని వలన నాత్మ, యొక స్థూల వస్తువనియు, దానియం దిచ్ఛయు, ద్వేషము, సుఖము, దుఃఖము, మున్నగునవి యున్నవనియు, నొకమనుష్యుని

యింద్రియములవలెనుండు పదార్థములనియు గ్రహింపఁగూడదు. దీని తాత్పర్య మేమనఁగా, ఇదంతయు న్యాయ దర్శనానుసారముగా నాత్మయొక్క లక్షణమైయున్నది. పైన వచించినట్లే శివపురాణములో శివరూపియగు పరమాత్మ యొక్క లింగము ప్రకటమైనదనెడి కథవలన బరమాత్మ యొక్క లక్షణమేమి? మరియు దానిని నెవఁడు గుర్తెఱుఁగఁగల డనెడి యాధ్యాత్మికభావము చూపఁబడినది. శివపురాణములో శివుని ముఖ్యతయు, బరమాత్ముని భావము నున్నందువలన బరమాత్మయొక్క లింగమనఁగా లక్షణ మనాదియు ననంతము నైయున్నది. దీనిని జీవుఁడేమిటి బ్రహ్మ విష్ణు ప్రభృతిదేవ తలుగూడ నెంతమాత్రము గుర్తెరుంగఁజాలరని గ్రహింప వలెను. కాఁబట్టి సర్వశక్తి సంపన్నుండును, సర్వవ్యాపకుండు నగు పరమాత్మయొక్క రాజ్యములో నెవనికిఁగూడ నేను గొప్పయనెడి యహంకార ముండఁగూడదు ఈ యాధ్యాత్మిక భావమే లౌకిక భాషారూపముగాఁ బ్రకటింపఁబడినది. ఇంచే జలశబ్దముగలదో యది స్థూలజలముగాక కారణవారి యనఁగా సమిష్టి జీవులయొక్క కర్మసంస్కారమని తెలియవలెను. ఆ కర్మ సంస్కారములలోపల సంస్కారములనుబట్టి సృష్టించు టకై చేతనశక్తియగు నారాయణుండుండును. అతని చేతన శక్తివలన సమిష్టి సంస్కారములు ఘనోన్ముఖము లగుచున్న ప్పుడే వికారరహిత (అవ్యాకృత) ప్రకృతిలో వికారసూచన

యనఁగా వ్యాకృతావస్థ గలుగును. ఆ వ్యాకృతావస్థగల ప్రకృతినే కమలమని చెప్పఁబడెను. అది విష్ణుః కేంద్రీభూత చేతన శక్తి (Central Living Energy) యొక్క ఫలమేయనియు వచింపఁబడినది దీనిబట్టి నారాయణుని నాభినుండియే కమలము జనించెననియు, దీనియందు బ్రహ్మ యుద్భవించెననియుఁ దెలియుచున్నది. ఇది శివపురాణములో వర్ణింపఁబడిన లౌకిక భాషలోని యాధ్యాత్మిక తత్త్వము. ఈ విషయములుగాక యింక ననేకవిషయముల నర్వాచీనులగువారీ కథతోఁగూడఁ గలిపెదరు. అవన్నియు నసత్యములును, గపోల కల్పనములునై వి.

ఇట్టి లౌకికభాషలో వర్ణింపఁబడిన కథలంబట్టి మహర్షులెట్టి మెట్టి గంభీర భావములను, నెట్లెట్లు సరళభాషలో మనోహరమగు లౌకి భాషయందు వర్ణించియున్నారో యాసంగతిని వివేకులు గ్రహింపఁగలుగుదురు. పండితులగువారలు తమ బుద్ధులను స్థిరీకరించుకొని ధీరులై నియమములతో నీవిషయములను బరిశోధించి తెలిసికొని యానందంబును బొందుటయే వారి వైదుష్యమగును. కాని వీని నెగురఁగొట్టివేయుట మాత్రము యోగ్యతగానేరదు. పురాణములయందిట్టి వందలకొలఁది కథలు లౌకికభాషలో వర్ణింపఁబడినవి. అన్నిటినుండి యాధ్యాత్మిక తత్త్వములను గ్రహించెడి యుక్తులు పైవానితో సమానములయి యున్నవి. కాఁబట్టి యెల్ల రకములనుండు లౌకికభాషల

యందా ప్రకారముగా నుంచు తత్త్వమును నిర్ణయించి పురాణములమహిమ వృద్ధిపరుపవలెను

## —ః పరకీయ భాష ః—

పురాణములలో మూఁడవ రకముగా నుండు భాష యొక్క పేరు పరకీయభాష. దీనియందు ధర్మముయొక్క యేదో యొక యంగము. దృష్టాంతములతో వర్ణింపబడు చుండును. ఈ దృష్టాంతములన్నియు యథార్థములు. ఎందులకనఁగా: ఇవన్నియుఁ బురాణములలోని యితిహాసముల యంశములైయున్నవి ఎట్లనఁగా. సత్యముయొక్క మహిమను జూపించుటకై హరిశ్చందుని కథయు భక్తుని మహిమను బ్రచారముజేయుటకై ధ్రువుని యొక్కయు బ్రహ్లాదునియొక్కయు గథలును, సతీధర్మమును బ్రకటించుటకై సీతయొక్కయు, సావిత్రియొక్కయుఁ గథలును పితృభక్తి యొక్కయు బ్రహ్మచర్యము యొక్కయు మహిమను వెల్లడించుటకై భీష్ముని చరితమును, నతిధి సేవా మహిమను బోధించుటకై మయూరధ్వజుని చారిత్రమును, మున్నగునవి. ఈకథలన్నిటిని వినుటవలన నీరసమగు హృదయమందుఁగూడ రస మావిర్భవింపఁగలదు. మరుభూమియందు మందాకిని ప్రవహింప మొదలిడును. ధర్మశోభ, నందనవన శోభ మాదిరి నొక్కొక్క హృదయమునందును బ్రకాశించుచుండును. మఱియు మనుష్యప్రకృతి యానందముతోఁగూడి హంసగతితో సంసార మనెడి సముద్రమందు బ్రవహించెడి బ్రహ్మనంద మహా

దధియందు మగ్న మగును. ఇదియే పరకీయభాష యొక్క మహిమలను, బూర్ణుండగు భగవంతుని నిశ్వాసరూప మగు పురాణములోని భాషయొక్క పూర్ణత్వంబును నై యున్నది.

పురాణములలోని రెండవపూర్ణత్వము త్రివిధ భావములలోఁ గలదు. తొల్తొల్త నుండెడి యధ్యాయములలో బహు ప్రదేశములందుఁ బరమాత్మ, కారణరూపమును, బ్రపంచము కార్య రూపమును మఱియుఁ గార్యము, కారణము యొక్క విస్తృతిమాత్రమే మైనందునఁ గారణముయొక్క గుణమును, భావమును గార్యమునందు వచ్చుచున్నప్పుడు పరమాత్మ యందే భావము గలదో యా భావమే ప్రపంచములోని ప్రత్యేక పదార్థమునందుఁ గలదనునది సిద్ధాంతీకరింపఁబడి యున్నది. పరమాత్మయం దధ్యాత్మ మాధదైవ మాధిభూతము లనెడి యీ మూడుభావము లున్నవి. వానిలో నధ్యాత్మ భావము ప్రకృతికంటెఁ బరమగు నిర్గుణబ్రహ్మమును, నధిదైవ భావము మాయాప్రేరకుఁడగు సగుణబ్రహ్మ మనెడి యీశ్వరుడును, నధిభూత భావము విరాట్టు నై యున్నది. దీనివలనఁ దొలుతఁ జెప్పినట్లు ప్రత్యేకము లగు నింద్రియములలోను, మనోబుద్ధి, చిత్తాహంకారములలోను, దుదకుఁ బ్రత్యేకవస్తువులోను అధ్యాత్మాధి దైవాధిభూతము లనెడి యీ మూడుభావము లుండునని చెప్పఁబడినది. దేనియందు త్రివిధ భావములును జూపఁబడియున్నవో యద్దానిని బూర్వదృష్టి యని చెప్పెదరు. ఈ మూడు

భావములును సత్యములుగదా. లేనియెడల నొక భావమును సత్యమని తలంచి రెండవదానిని నెగురగొట్టుట లేక యొక వస్తువుయొక్క సర్వభావములను జూడక పోవుట యనునది యపూర్ణ దృష్టియొక్క కార్యము. వేదములును బురాణము లును బూర్ణుండగు భగవంతుని నిశ్వాస రూపములైనప్పుడు పురాణములలోఁగూడ వేదములమాదిరి త్రివిధభావములయొక్క పూర్ణతగలదని సిద్ధాంతమగును. వేదములలోఁ త్రివిధభావ ముల పూర్ణత మెట్లున్నదో యది వేదములనుగురించి చెప్పిన చోటఁ జూపఁబడినది. ప్రస్తుతమునఁ బురాణములలోని త్రివిధ భావముల పూర్ణత చూపఁబడుచున్నది దృష్టాంతరూపముగా శ్రీమద్భాగవతము మున్నగు పురాణములయందలి రాసలీల, దేవాసుర యుద్ధము, గంగా మాహాత్మ్యము మున్నగునవి చెప్పఁ బడుచున్నవి.

—* శ్రీ. భాగవతము *—

అర్వాచీన జనులు శ్రీ. భాగవతాది గ్రంథములందుం డెడి రత్నములను గుర్తెఱుఁగఁ జాలక రాసలీల లోనగువానిని వ్యర్థముగా నాక్షేపించుచున్నారు. తుదకు గొందఱు శ్రీమ ద్భాగవత గ్రంథము వేదవ్యాస మహర్షిచే రచింపఁబడినది గాక బోపదేవుఁడను పేరుగల యొక కవిచే రచింపఁబడినదని చెప్పెడి ప్రమాదమునకు వశులగుచున్నారు. అర్వాచీనులు పక్షపాతము విడిచివేసి భాగవతమును సవిమర్శముగాఁ జదివిన

యెడల వారిచిత్తములందు సందేహము లెట్టివియు గలుగనేరవు. ఇది యపూర్వమగు పరమహంస సంహితా విషయమునం దెట్లు ప్రశంసింపఁబడియున్నదో చూడుఁడు.

"నిగమకల్ప తరోర్గళితం, ఫలం శుకముఖాదమృత ద్రవసంయుతం
పిబత భాగవతం రసమాలయం, ముహురహో రసికాభువిభావుకాః॥

యోగ్యులగు రసికులారా! భూలోకమందు శుకమహర్షి మొగమునుండి స్రవించెడి యమృతద్రవముతోఁ గూడినదియు, వేదమనెడి కల్పతరువునుండి పడుచున్నదియు నగు భాగవతమనెడి రసాలఫలమును మాటిమాటికిని (అనఁగా ముక్తి గలుగు వఱకును) బుచ్చుకొందురుగాక యని యర్థము. అందువలన భాగవత రసమును భావుక రసికులే గ్రహింపఁజాలుదురు గాని, నీరసులును, భక్తిహీనులును, నగు తార్కికులు గ్రహింపఁజాలరు. భాగవతములోని భాషయు, మధురిమయు, గంభీరిమయు, జ్ఞానముయొక్కయు భక్తియొక్కయు బూర్ణత్వమును, "విద్యావతాం భాగవతే పరీక్షా" యనగా వైదుష్యపరీక్ష, శ్రీ భాగవతమందుఁ గలదని యే గ్రంథము శ్లాఘింపఁబడినదో యద్దాని యథార్థ రహస్యబోధలను, నిష్కల్మష పండితుఁడే గ్రహింపఁజాలును. పండితమ్మన్యులగు తార్కికులు గ్రహింపఁజాలరు. ఏ గ్రంథమందు "జన్మాద్యస్యయతః" మున్నగు మంగళాచరణముయొక్క తొలి శ్లోకమునందు సమస్త వేదాంత తత్త్వము నింపఁబడియున్నదో యద్దానిని వేదాంతజ్ఞానము లేని

యజ్ఞానులగు పురుషులెట్లు తెలిసికొనఁ జాలుదురు ? భాగవత మొక కవిచేఁ గల్పింపఁబడినదియా ? లేక యొక మహర్షిచే రచింపఁబడినదియా ? యను సంగతి భాగవతములోని సమాధి భాషయందలి గాంభీర్యమును జూచుటతోడనే నిష్పక్షపాతి యగు ప్రతి మనుష్యునకు సిద్ధాంతముగాఁగలదు. సామాన్యుఁడగు బోపదేవ కవికి నట్టి భాగవతగ్రంథమును రచించెడి శక్తి యెన్నటికిని గలుగదు. పూర్వమునందుఁ జెప్పఁబడిన సమాధి భాష, పరకీయభాష, లౌకికభాష, యనెడి యీ మూఁడును యథాక్రమముగా ఆర్షగ్రంథములందే యుండును. ఈ భాగవత గ్రంథము సంపూర్ణార్షగ్రంథము. అర్వాచీనుల యీ కల్పనము లన్నియు ననృతములు. వారనేక శ్లోకములను మిథ్యగాఁగల్పించి బోపదేవుని పేరుతోఁ వ్యవహరించుచు బ్రచారము జేసి యున్నారు. ఇది యెల్ల తెలంగుల నసత్యమైయున్నది. బోప దేవుఁడెప్పుడుగూడ భాగవతమును రచించియుండలేదు. అతఁడు కేవలము శ్రీ భాగవతములోని విషయములయొక్క సూచికను శ్లోకములతో రచించెను. అది యిప్పటివఱకు నచ్చటచ్చట ముద్రింపఁబడి దొరకుచున్నది. ఇది యథార్థవిషయము. ఇంక నగుబాటుకు లోనగు విషయము మఱియొకటి కలదు. అది యేదనగా, నవీనులు భాగవతములోని కృష్ణలీలా రహస్యమును గుర్తెఱుంగజాలక యీ మహాగ్రంథము నెగురగొట్టుటకు బ్రియత్నించిరి.

## —* శ్రీకృష్ణులిరువురు గలరా? *—

మహాభారతమందుఁ గురుక్షేత్రములో సంచరించిన శ్రీకృష్ణుఁడును, భాగవతమందు రాసలీల గావించిన శ్రీకృష్ణుఁడును నిరువురు నొక్కఁడేయని యర్వాచీనుల హృదయములందుఁ దట్టియుండలేదు. ఎందులకనగా, వారి బుద్ధి, విషయములచే మలినమొందినందువలన రాసలీలయొక్క యథార్థమగు నర్థము వారికి గోచరింపలేదు. ఇందువలన వారిట్టివట్టి యసత్యములను గల్పించియున్నారు. భాగవతమును గైకొని శ్రీకృష్ణుని గురించి యే యే దోషము లారోపింపఁ బడుచున్నవో యవి యన్నియు నసత్యములును, నజ్ఞానజనితములునై యున్నవని యీ దిగువఁ జూపఁబడుచున్నవి. భాగవతములోని శ్రీకృష్ణుఁడును, మహాభాగతములోని శ్రీకృష్ణుఁడు నిద్దరు నొక్కఁడే. మఱియు భాగవతములోని రాసలీల, శ్రీకృష్ణ భగవానుని పూర్ణావతారమునకుఁ గల లక్షణమే యైయున్నది. మహాభారతములోని సభాపర్వమందీ ప్రమాణము చిక్కుచున్నది.

"ఆకృష్యమాణే వసనే, ద్రౌపద్యాచింతితో హరిః
గోవింద! ద్వారకావాసిన్! కృష్ణ! గోపీజన ప్రియ!" ॥

దుశ్శాసనుఁడే సమయమందు వస్త్రాపకర్షణము గావించెనో యా సమయమందు ద్రౌపదీదేవి, తన్నుఁ గాపాడుట కొఱకై "గోవింద! ద్వారకావాసీ! గోపీజనప్రియ! మున్నగు సంబోధనములతో శ్రీకృష్ణునిస్మరించినది. మరియు నాకృష్ణుఁడు వచ్చి యామె యొక్క మానమును సంరక్షించెను. ద్రౌపది

మహాభారతములోనిదై యామె యేకృష్ణుని స్మరించియున్నదో యతఁడును మహాభారతమందలివాఁడై యుండును. ఇందు సందియమేమియు లేదు. మఱియు నా కృష్ణునే గోపీజన ప్రియ" యని సంబోధించినప్పుడు శ్రీ భాగవతములోనివాఁడు గూడ నీకృష్ణుఁడే యైయుండును. సందేహమిందేమియు లేదు. అందువలన శ్రీ భాగవతములోని వాఁడును, శ్రీ భారతములోని వాఁడును వీరిరువురు కృష్ణులు నొకఁడే. ఇది సిద్ధాంత విషయము.

## —* రా స క్రీ డ *—

ఇప్పుడు దేనికారణమున శ్రీ కృష్ణునిగురించి సందేహించి యర్వాచీనులు భాగవతమునుండి తీసివేయుచున్నారో యట్టి రాసలీలనుగూర్చి చెప్పుచున్నాము. ఆరాసలీలను గావించుట శ్రీకృష్ణుని దోషము కాక పూర్ణావతారము యొక్క లక్షణమై యుండెను. అవతారముయొక్క తత్త్వమేమి? సర్వవ్యాపకుండగు పరమాత్మ యొక చిన్న శరీరములోనికి రాఁగలఁడా? లేఁడా? ఈవిషయమునందు వాదానువాదములు విశేషముగా జరుగుచున్నవి. దీని పూర్ణరహస్యము ముందు మరియొకసారి చెప్పఁబడును. ప్రస్తుతమున నింతమాత్రము దెలియఁబరచినఁ జాలును. ఏమనఁగా. భగవంతుఁడు పైభాగమునందొక ప్రదేశమందున్నాఁడనియు, నందు నుండి దిగి క్రిందికివచ్చి యవతరించుచున్నాఁడనియు, ననెడి విషయము మిథ్య. ఎందుల

కనఁగా. భగవంతుఁడు సర్వ వ్యాపకుఁడైనప్పుడు సర్వప్రదేశములందెల్లప్పుడు నుండును. అతనికొక చోటనుండి మఱియొక చోటికి వచ్చుట యసంభవము. కారణమేమన, ఎక్కడనుండి యెక్కడకుఁ బోవునో యచట నతఁడాదినుండియే యుండెను. దీనింబట్టి భగవంతుని యవతారము కాని కాదని సిద్ధాంతము చేయఁగూడదు. అవతారమనఁగాఁ గేంద్రవిశేషములో భగవంతుని శక్తి విశేషముగా వికసించియుండుట. భగవంతుని శక్తి, జడ చేతనముల రూపముతో నన్నిటియందు వ్యాప్తమై యుండును. ఈ శక్తియే, జడము నందు జడశక్తి రూపము తోడను చేతనము నందుఁ గలారూపముతోడను వెలుగు చుండును. జీవుఁడెంత యున్నతి బొందునో యంత కలావికాసము గాఁగలదు. ఈనియమమునను సరించి యుద్భిజ్జమందొక కలయు, స్వేదజము నందు రెండు కలలును, అండజమునందు మూడు కలలును, బశువులందు నాల్గు కలలును మఱియు సామాన్య మనుష్యుని మొదలుకొని విభూతి పర్యంతముండెడివానిలో నైదు కలలనుండి యెనిమిది కలలవఱకును భగవంతుని శక్తి యుండు చుండును. సాధారణ జీవుని శరీరముద్వారా భగవంతుని శక్తి యెనిమిది కలలవఱకును ప్రకాశింపగలదు. ఎందులకనఁగా! ఏశరీరములో నెంతశక్తిని ధరించుటకు యోగ్యతగలదో యది యంతమాత్రముగల శక్తినే ధరింపఁజాలును. అంతకంటె నధికమును వహింపలేదు. ఇంక నొక సమయమందు ధర్మముపై నత్యాచారములు జరిగినప్పుడును, ఏయుగములో నెంతవఱకు

ధర్మముండవలయునో దానికి హానిగల్గినప్పుడును, ఆ హానిని సవరించుట కెనిమిది కలలదాక నుండు శక్తివలన సాధ్యము గానియప్పుడును ప్రకృతియొక్క ప్రేరణచేతను, భక్తుల ప్రార్థనములచేతను, ఆవశ్యకతానుసారముగఁ దొమ్మిది కలలనుండి పదునాఱు కలలవఱకు భగవంతుని శక్తి, యేయే యసాధారణ కేంద్రములందు వెల్లడియై ధర్మహానిం దొలఁగించునో యా కేంద్రములన్నియు నవతార కేంద్రములు. పదునేను కలల దాకనుండు కేంద్రము లంశావతారములును నే శరీరమునందు భగవంతుని శక్తి, పదునాఱుకలలవఱకు నుండునో యనఁగాఁ బూర్ణశక్తి ప్రకటమగునో యది పూర్ణావతారమునై యున్నది. భగవంతుఁడగు శ్రీకృష్ణుండిట్టి పూర్ణావతారుండైయున్నాఁడు. శ్రీ మద్భాగవతమునందిట్లు చెప్పఁబడినది.

"ఏతేచాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్స్వయం"॥

ఇతరావతారము లన్నియు బరమ పురుషుండగు, భగవానుని యంశావతారములు. కాని శ్రీకృష్ణుండు పూర్ణావతారమైనందువలన సాక్షాత్తుగా భగవంతుఁడేయై యున్నాఁడు. ఇట్లు పూర్ణావతారమగుట కా శ్రీకృష్ణ చంద్రునియందే యే లక్షణములు గలపనునది యిత్తఱి విచారణీయాంశమైయున్నది. ఈవిషయముంగూర్చి యవతారము భగవంతుని శక్తిని గైకొని యగుచున్నప్పుడు పూర్ణావతారమునందు భగవంతుని పూర్ణశక్తి, అనఁగా సచ్చిదానంద రూపుఁడగు భగవంతుని సచ్ఛక్తియు,

చిచ్ఛక్తియు, ఆనందశక్తియు, బూర్తిగా నుండునని తొలుతనే చెప్పఁబడినది. కర్మకు సచ్ఛక్తి సంబంధమును, జ్ఞానమునకు జిచ్ఛక్తి సంబంధమును, ఉపాసనమునకు ఆనందశక్తి సంబంధముగలదు. ఇందువలన నేయవతారముయొక్క చరిత్రములోఁ గర్మము యొక్కయు, జ్ఞానము యొక్కయు, నుపాసనము యొక్కయు నీమూఁడింటియొక్క యాదర్శము పూర్ణరూపముతో బ్రకటమగునో యదియే పూర్ణావతారముగాఁగలదు. భగవంతుండగు శ్రీకృష్ణుని జీవితమందీ మూఁడు విధములుగా నుండు వాని యాదర్శము పూర్ణముగాఁ బ్రకాసించినది. కర్మయొక్క పూర్ణాదర్శము శ్రీమహాభారతములోని ధర్మయుద్ధమునందును జ్ఞానముయొక్క పూర్ణాదర్శము భగవద్గీతల యుపదేశము నందును, ఉపానముయొక్క పూర్ణాదర్శము రాసక్రీడయందును వ్యక్తమైయుండెను. దీనింబట్టి శ్రీకృష్ణుండు రాసక్రీడ నొనరింపకపోయినచోఁ బూర్ణావతారుఁడు గాకపోయెడిని. ఇప్పుడు శ్రీకృష్ణుని చరిత్రమును జర్చించుచు నీమూఁడాదర్శములను వేఱువేఱుగా వర్ణించెదము. రాసలీల మున్నగునవి మహాభారత ము.లోఁ జిక్కకపోవుటకుఁ గారణము సత్యముగాకపోవుటగాదు. ఇఁకేమన, పురాణములు భావప్రధానములగు గ్రంథములైనందువలన శ్రీకృష్ణుని గొప్ప చారిత్రములో నొక భావము గైకొని యొక పురాణమునందును, మరియొక భావము జేకొని మరియొక గ్రంథమునందును, వర్ణింపఁబడెను. మహాభారతము కర్మ ప్రధానమగు గ్రంథమైనందువలన శ్రీకృష్ణుని కర్మ

జీవనవిషయము వర్ణించినది. భాగవత ముపాసన ప్రధాన గ్రంథమైనందునఁ గర్మవిషయిక చరిత్రమును గౌణముగాఁ జేసి కొని శ్రీకృష్ణుని యుపాసనామయమగు భావమును వర్ణించి నది. ఈ మాట భాగవతములోఁగూడ కర్మప్రధానములగు భారతాది గ్రంథములను రచించినప్పటికి వేదవ్యాసుని చిత్త మందు యథార్థానందమును, శాంతియుఁ గలుగక పోవుటచేత నతఁడు భక్తిపూర్ణమగు భాగవతగ్రంథమును రచించి శాంతి సంతోషములను బొందినాఁడని చెప్పఁబడి యున్నది. ఎందుల కనఁగా ఉపాసనయే, యథార్థానందమును గల్గించుటకు హేతువై యున్నది. దీనివలన మహాభారతములో నుపాసనా ప్రధానమగు శ్రీకృష్ణుని రాసక్రీడగాని బాలక్రీడగాని వర్ణిం చుట కెట్టియవసరమును లేకపోయెననెడి సిద్ధాంతము సత్య మగుచున్నది. ఇది భాగవతములోని కథలు భారతములోలేక పోవుటకు గారణము. ఇదిదప్ప వేరొండు కల్పనమును మిథ్య. ప్రస్తుతమున రాసలీల యందలి త్రివిధ భావములను వర్ణించి యుపాసనాకాండముయొక్క చరితార్థము చేయబడుచున్నది.

రాసలీల కామసిలీల కాదు! భక్తిలీల. దీని భావమును బృందావనములోచూపఁబడినది. దీనిని మొదటినుండి తుదివరకు సవిమర్శముగాఁ జూచినయెడల రాసలీలలో భక్తురాండ్రగు గోపికలయొక్క భక్తిమయమగు జీవనలీల ప్రదర్శింపబడినదని సిద్ధాంతము గాఁగలదు. గోపికలు గోపకులయొక్క సాధారణ

స్త్రీలు గారు. వారిలో ననేక స్త్రీలు దేవతాంగనలును, ఋషీశు లునై యున్నట్లు పురాణములను జదువుటవలన మనము దెలిసి కొనఁగలము. ఆ వనితలు భగవంతుని వేణునాదమును విని సంసారములందు విరక్తిసిబొంది యనంత కష్టములను సహిం చుచుఁ దుదకు బరాభక్తినిగాంచి యే ప్రకారముగా నెల్ల యెడల భాసిల్లువాఁడును, ఆనంద కందముచు, నగు సచ్చిదా నందుని మనోహరాకారమును జూచియుండిరో దానివర్ణనమే రాసలీలయందు వర్ణింపఁబడినది. ఎట్లన.

నిశమ్యగీతం తదనంగ వర్ధనం, వ్రజస్త్రియః కృష్ణగృహీతమానసాః
ఆజగ్మురన్యోన్యమలక్షితోద్యమాః, సయత్ర కాంతో జవలోలకుండలాః

కాముని వృద్ధిపరచెడి శ్రీకృష్ణుని వేణుగానముచే ఆకర్షిం పబడి గోపస్త్రీలు యొండొరులు దెలియనట్లు కృష్ణుఁడున్న స్థలమునకుఁజనిరి. ఈ శ్లోకముకంటె ముందున్న భాగవత శ్లో కములలో వ్రాయఁబడినదేమనఁగా,

"భగవానపితారాత్రీః, శరదోత్ఫుల్ల మల్లకాః,
వీక్ష్యరంతుంమనశ్చక్రే యోగమాయాముపాశ్రితః"

భగవంతుఁడు యోగమాయ నాశ్రయించుకొని రమిం చుటకు దలంచెను. ఈ శ్లోకములో శ్రీకృష్ణుండు యోగ మాయాశ్రయమువలన రమింపనెంచినట్లు వ్రాసి తరువాత నాత్మారాముఁడగు కృష్ణుఁడు రమించెననియు, స్వయముగా మన్మథ మన్మథుఁడగు శ్రీకృష్ణుఁడు దర్శన మిచ్చినాడనియు.

యోగీశ్వరుండగు నామహాత్ముండనేక రూపములను ధరించి నాడనియు, "ఆత్మన్యవరుద్ధ సౌరతః" తనయందు గామభావమునణంగఁదొ్కి లయింపఁజేసి నిరుద్ధవీర్యుండగు నాపరమాత్మ రమించినాండనియు మున్నగువవి శ్రీకృష్ణునిగురించి రాసక్రీడయందు వాడఁబడిన విశేషణములన్నిటింబట్టి శ్రీకృష్ణుండు పరాత్పరుండనియు, నతనికిఁ గామభావము గలదనియు సిద్ధాంతముగాఁగలదు. ఇట్లుకోరి శ్రీకృష్ణుండు పూర్ణిమా రాత్రిని మురళీనాదముగావించినట్లు భాగవతమందిట్లు వ్రాయబడినది.

"జగౌకలం వామదృశాం మనోహరం"

స్త్రీలకు మనోహరమగు కలనాదమును గావించెను. దీనిని విష్ణుపురాణమందు శ్రీకృష్ణుఁడుమధురమగు కలగీతమును బాడెననియున్నది. ఈ "కల" పదమునుబట్టి శ్రీకృష్ణుని మురళినుండి "క్లీం" అనెడి కామబీజముయొక్క గానముబయలుదేరినదని తెలియుచున్నది. "క్లీం" అనునది కామబీజము. దీనియందు సమస్త కామములు పరిసమాప్తి జెందుచున్నవి. భగవంతుఁడు రసరూపుఁడు. అతనియొక్క రసమే ప్రకృతి వలన వ్యాప్తమై ప్రపంచమందు గొన్నియెడల ప్రేమరూపము గాను, గొన్నిచోట్ల గామరూపముగాను. గొన్నిస్థలముల స్నేహరూపముగాను, గొన్నిచోట్ల వాత్సల్యరూపముగాను, గొన్నిట శ్రద్ధారూపముగాను. గొన్ని స్థానములందు భక్తి

మున్నగువాని రూపములు గాను బ్రసరించెను. మాయ అద్వైత మనెడి యొక బ్రహ్మరసమును కామ, ప్రేమ, స్నేహ, శ్రద్ధా, భక్తి, ప్రభృత్యనేక రసములుగా మార్చి జీవుని నట్టి రసములతోఁ బ్రపంచమందు బంధించుచుండును. ఇది మాయాకార్యము. మనుష్యుఁడు ప్రపంచములో నున్నంత వఱకు "పుత్రి, కన్యా, స్త్రీ, మాతా పితృ ప్రభృతులును భిన్న రసములలోఁ జిత్తమునందుఁ దలంచి వారివలన నానందమును బొందుచున్నాఁడు. కాని యేసమయమందీ భిన్న భిన్నరస ములకల్పనముమాయాకార్యమనియు సత్యముగాదనియు, వాస్త వముగా నన్ని రసములకు మూలము భగవద్రస మొకటియే యనెడి జ్ఞానము విచారమువలనను భగవత్కృప వలనను జీవు నకుఁ గల్గునో యా సమయమందా జీవునకుఁ దలిదండ్రులు, నిల్లాలు, గొడుకులు, గొమ్మలు మొదలగు సకల ద్వైత జగము లోని ప్రేమయొక్క మూలమునం దద్వితీయుండగు భగవంతుని, యొక ప్రేమరసముయొక్క యాస్వాదనమే కలుగుచుండును. మఱియు నప్పుడే యాసాధకుఁడు మాతాపితరులు, పుత్రమిత్ర కళత్రములు మున్నగువాని యన్నిటియొక్క ద్వైతరసమును విడిచిపెట్టి భగవంతునియొక్క యొకరసమునందే ముగ్ధుడగుచు భగవద్భక్తుఁడగును. అందుకొఱకు కాతరుణమందా "క్లీం" అను దానియందే సకలరసములును లయించుచున్నవి. అనఁగా నా కామబీజమునందే సమస్త కామములు లయించుచున్నవి.

ఇదియే "క్లీం" రూపమగు కామబీజమున కర్థము. శ్రీకృష్ణుని మురళిలోనుండి యీ కామబీజముయొక్క నాదమే నిర్గమించి నది. ఈ నాదమును వినుటతోడనే సమస్త గోపికలును బ్రపంచ మందలి ప్రేమరసమును మఱచి వైరాగ్యవతులై భగవంతుని చరణారవిందములను శరణుబొందిరి. మురళీ నాదమునందలి యరుదగు విశేషమేమనఁగా? దాని మధురిమ. యనేక స్వర ములు గలుపుటవలన గల్గుచుండును. వంశియందుఁ బెక్కుఛిద్రము లుండును. వీనిలోనుండి భిన్నభిన్న శబ్దములు బయలుదేరు చుండును, కాని యీ స్వరములన్నియు గూడి యొకటే మధుర శబ్దమగుచుండును అనఁగా వంశీనాద మాధుర్యము అనేక రసముల కూడికయొక్క ఫలమైయున్నది.

తొలుతనే మనుష్యుఁడు స్నేహ, ప్రేమ, కామాది రసములలో నొక భగవంతుని యానందరసమునే చూచి యీ ప్రపంచమును విడిచి బరమాత్మను శరణుజొచ్చిన వైరా గ్యము గలవాఁడగునని వచించియున్నాము. దీనివలన శ్రీ కృష్ణచంద్రుఁ డెప్పుడు మురళితో సర్వరసములను గలిపి క్లీం నాదమును గానించెనో యప్పుడు గోపికలకు వైరాగ్యము గల్గుటయు వారు సంసారమును విసర్జించి పరమాత్మ చరణకమ లములను శరణు బొందుటయు భక్తియొక్క భావమేయని తెలి యుచున్నది.

గోపికల కిట్టి వైరాగ్యము. భక్తియుఁ బూర్ణముగాఁ గల్గుటకుఁ గారణ మేమనఁగా, వారు శ్రీకృష్ణచంద్రుని బర మాత్మగాఁ దెలిసికొని కాత్యాయనీపూజఁ జేసి దేవిని బ్రస న్నము గావించుకొని తొలుతనుండియే భగవత్కృపకుఁ దగిన వారలయిరి. మఱియు భక్తి, పూర్ణత్వము జెందుట వలన నానందరూపుండగు భగవంతుని నెల్లయెడలఁ జూచుటకును తను, మనః, ప్రాణము. ఆత్మలవలన నాయానందము ననుభ వించుటకు నర్హులైరి.

కాఁబట్టి పరమాత్మ, క్లీం నాదమువలన వారిని బిలిచి వారికోరికలను బూర్ణముగా నెరవేర్చెను. భగవంతుని నాదము కామవర్ధక (కామము నభివృద్ధిపరచునది) మైనది "క్లీం" అను నది కామబీజ మెప్పుడైనదో యప్పుడే క్లీం నాదము కామ వర్ధకము తప్పక కాఁగలదు. అయితే యీ కామము దాని యందు సకలకామములు లయించుచున్నవని తొలుతఁ జెప్పిన కామమే యై యున్నది. ఈ నాదము విషయ వాంఛలను బెంచునది గాదు. పరమాత్ముని యానందములో ముంచివేసెడి కామమును వృద్ధిపరచునది. ఇదియే యనంగవర్ధనమున కర్థము. ఆ పూర్వశ్లోకమునందు—

"అన్యోన్య మలక్షితోద్యమాః"

గోపికలు పరస్పరము దాగుకొని రహస్యముగా శ్రీ భగవంతుని చేరువకుఁ జేరిరని యేది వ్రాయఁబడినదో దీనివ

లన వారి పూర్ణ వైరాగ్యభావము సూచింపబడుచున్నది. ఎందు లకనఁగా, ముముక్షు వెప్పుడు సంసారమునుండి విరక్తిని బొంది యానందరూపుండగు భగవంతుని వెదకుటకు స్వగృహము నుండి బయలుదేరునో యప్పుడు రహస్యముగానే బయలుదే రును. వార్తాపత్రికలందు ముందుఁ బ్రచురించి బయలుదేరడు. ఇట్లు రహస్యముగా గోపికలు సంసారమును విడిచిపోయినప్పు డేయే యవస్థలలో సంసారమును వదలిరో యది భాగవత మం దిట్లు స్పష్టముగా వ్రాయబడుచున్నది

"దుహన్త్యో భియయుః కాశ్చిద్దోహం హిత్వా సముత్సుకాః
పయోధిశ్రిత్య సంయాన మనుద్వాసాం పరాయయుః॥

పరివేషయ న్త్యస్తద్ధిత్వా, పాయయ న్త్యశ్శిశూన్పయః
శుశ్రూష న్త్యః పతీన్ కాశ్చిదశ్న న్త్యో పాస్యభోజనం॥

లింప న్త్యః ప్రమృజన్త్యోన్యా అం జన్త్యః కాశ్చలోచనే
వ్యత్యస్త వస్త్రాభరణాః। కాశ్చిత్కృష్ణాంతికం యయుః॥

తావార్యమాణాః పతిభిః। పితృభిర్భ్రాతృ బంధుభిః
గోవిందా పహృతాత్మానో నన్యవర్తంత మోహితాః॥

కొందఱు గోపికలు పాలను బిదుకుచు నా పాత్రము లను విడిచిపోయిరి. కొందఱు గోపికలు పాలను గాఁగఁబెట్టుచు నవి గాగకమునుపే విడిచిపోయిరి. కొందఱు పొయ్యిమీఁద వేగుచున్న గోధుమలను దించకుండనే వెళ్ళిరి. కొంద అన్నమును వడ్డించుచుండిరి. కొందఱు శిశువులకుఁ బాలిచ్చు చుండిరి. కొందఱు పతులకు సేవఁజేయుచుండిరి. కొందఱు భుజించు

చుండిరి. కొందఱు చందనాదులను బూసికొనుచుండిరి. కొందఱు పాత్రల దోముచుండిరి. కొందఱు గసులకుఁ గాటుకదిద్దుచుండిరి. ఆయాసమయములలో నాపనులు ముగియకపూర్వమే వాని నన్నిటినివిడిచి పరుగెత్తిరి. శ్రీకృష్ణుని దగ్గరకుఁ జేరెడి తొందరలో విశేషముగా వస్త్రాభరణాదులు తారుమారయినవి. పతులు, సుతులు, భ్రాతలు, బంధువులు మున్నగువారు వలదని చెప్పినను వినక భగవంతునియందు మనస్సును లయింపజేసిన గోపికలు గృహమును వదలిపెట్టి పోయిరి. ఈవర్ణనము లన్నిటినిబట్టి ముముక్షుని చిత్తమందుఁ దీవ్రమగు వైరాగ్యము కలిగి నప్పుడే సంసారములోని సర్వకార్యములను నపూర్తిగానే త్యజించి పోగలఁడనెడి సిద్ధాంతము దేలుచున్నది. వేద మాజ్ఞాపించున దేమనగా

"యదహరేవ విరజేత్త దహరేనప్రవ్రజేత్"

వైరాగ్యము గల్గినవెంటనే సంసారము త్యాగము జేయఁదగినది. వాసన, యనాది. అందువలనఁ గర్మ మెన్నటికి గూడ సమాప్తిజెందదు. సంసారమందలి సర్వకార్యములు చక్కగాఁ బూర్తిగా నెరవేర్చి సన్యసించెదమని చెప్పెడి కొందఱు మనుష్యు లేనాటికినిగూడ సన్యాసులు గాఁజాలరు. ప్రపంచకార్యముల కెప్పుడును నంతులేదు. ఎందులకనఁగా కర్మమీఁదఁ గర్మ వచ్చుచుండును. నవీనకర్మ, నవీనవాసనచే గల్గును. ఇదియే మాయాలీల. ఇందువలన మూల (ముఖ్య)

మగు కర్తవ్యమును లక్ష్యమునందుంచుకొని యప్రధాన (గౌణ) మగు కర్తవ్యమును విడువవలసి యుండును. ఇందు వలననే భక్తురాండ్రగు గోపికలు విషయరూపములగు కార్యములను నపూర్తిగానే విడిచిపెట్టి పోయిరి. మరియు నందఱు వలదు వలదనుచున్నగూడఁ బోయిరని చివరశ్లోకమునందుఁ జెప్పినట్లే గోపికల చిత్తములందు విషయములను గురించిన మోహమెంత మాత్రము లేకుండెనని సూచితమగుచున్నది. ఎందులకనఁగా, మోహముచే నావరింపఁబడిన విషయులగు జనులు వైరాగ్యవంతుడగు సాధకుని సంసారమును త్యజించెడి తరుణమునందు వలదని నివారించుచుందురు. కాని ముముక్షు వా నిషేధమును చెడచెవిఁ బెట్టును. ఇట్లు గోపికలు భగవంతుని చేరువకుఁ జేరి నప్పుడా పరమాత్మ యాదేశింప మొదలిడిన దేమనగా—

"స్వాగతవంవో మహాభాగాః ప్రియంకింకరవాణివః
వ్రజస్యానామయం కచ్చిద్బ్రూతా గమన కారణం ॥
రజన్యేషా ఘోరరూపా, ఘోరసత్వ నిషేవితా
ప్రతియాత వ్రజంనేహ, స్థేయం స్త్రీభిస్సుమధ్యమాః ॥
మాతరః పితరః పుత్రాః భ్రాతరః పతయశ్చవః
విచిన్వన్తి హ్యాపశ్యంతో మాకృధ్వం బంధుసాధ్వసం ॥
తద్యాతమాం చిరం గోష్ఠం, శుశ్రూషధ్వం పతీన్సతీః
క్రందంతి వత్సాబాలాశ్చ, తాన్పాయయత దుహ్యత ॥
అథవా మదభిస్నేహాత్, ద్భవత్యోయంత్రితాశయాః
ఆగతా హ్యుపపన్నం వః ప్రీయన్తేమయి జంతవః

భర్తుశ్శుశ్రూషణం స్త్రీణాం, పరోధర్మోహ్యమాయయా
తద్బంధూనాంచ కల్యాణ్యః! ప్రజానాంచానుపోషణం ॥

దుశ్శీలో దుర్భగోవృద్ధోజడోరోగ్యధనోపివా
పతిస్త్రీభిర్నహాతవ్యో, లోకేప్సుభిరపాతకీ ॥
అస్వర్గ్యమయశస్యంచ ఫల్గు, కృచ్ఛ్రంభయావహం
జుగుప్సితంచ సర్వత్ర, ఔపపత్యంకులస్త్రియః ॥
శ్రవణాద్దర్శనాద్ధ్యానాన్మయి భావో ను కీర్తనాత్
నతథా సన్నికర్షేణ ప్రతియాతతతోగృహాన్॥

వచ్చెడివారినిఁ జూచి భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు వారికి స్వాగతమిచ్చి గోకులమందలి కుశలమును, వచ్చుటకుఁగల కారణము నడుగుచు వెంటనే యీరాత్రి ఘోరముగానున్నది. ఇందు గొప్పగొప్ప ఘాతుక జంతువులు సంచరించుచుండును. ఇందువలన యువతులగు స్త్రీలు వెలుపలకు వచ్చియుండఁ గూడదు. తలిదండ్రులు, పెనిమిటి మొదలగు నింటిలోనివారం దఱు చింతించుచుందురు. కాఁబట్టి మీరందఱు త్వరగా నింటికిఁ బోయి పతి పుత్రాదులను సేవింపవలయును. ఒకవేళ నా యందలి ప్రేమచే బద్ధులై వచ్చినయెడల బాగుగానున్నది. నా (పరమాత్మ) యందు ప్రపంచ జంతువులు ప్రీతిఁగల్గియుండును. అట్లయినను మీకు మరలిపోవుటకు దగినది. వెలుపల నుండుట వలన నింటిలోనివారి చింతయు, ఘాతుకజంతువుల భయరూపి యగు కేవల దృష్టభయమును మాత్రమే లేదు. కాని యిం దదృష్టభయమనఁగాఁ బరలోకమందలి భయముకూడ గలదు.

ఎట్లనఁగా. పతిని సేవించుటయే స్త్రీలకుఁ బరమ ధర్మమై యున్నది. భర్త, దుశ్శీలుఁడైనను, నదృష్టహీనుఁడైనను, వృద్ధుఁడైనను, జడుఁడైనను రోగి యైనను లేక దరిద్రుఁడైనను బరలోక సుఖమును గోరు పతివ్రతయగు స్త్రీ కెప్పటికిని బతిని వదలి పెట్టుట దగదు. ఇదియే సనాతనధర్మము. కులస్త్రీ లుప భర్తను సేవించుట మిక్కిలి నింద్యము. దీనిచే నిహలోకమం దపకీర్తియు, బరలోకమునందు నరకబాధయును గలుగును. శ్రవణ, దర్శన, ధ్యాన, కీర్తనలచే నన్ను (పరాత్మ) గురించి యెంత భావముండునో యంత భావము సమీపమునకు వచ్చిన తరువాత నుండదు. ఇందువలన మీరు మరలి యింటికిఁ జేరుటయే మంచిది. సంసారము విడిచిపెట్టిన క్షణముననే వైరాగ్య భాగ్యముగాని ముక్తిగాని కలుగనేరదనెడి యీ సంగతి యెల్ల రెఱింగినదియే. ధర్మమార్గమంద నేకరీతులనుండు బాధలు సంభవించుచుండును. మాయా రూపియగు రాత్రియందు హింస్ర జంతురూపములగు కామ, క్రోధ, లోభాదులనెడి శత్రువులు సాధువులనువిశేషముగా బాధించుచుందురు. "నేనాలోచింపకుండ సంసారమును నేల విడిచిపెట్టితిని? గృహమునందుఁ దలిదండ్రులు మొదలగు వారేడ్చుచుందురు? స్త్రీ, దుఃఖినియై యుండును. నా కుమారుఁ డనాథుఁడయ్యెను. నా చిత్తము క్షోభించుచున్నది. తిరిగి పోవలెనా? లేక యేమి చేయవలెను?" అని యీరీతిగా మాయా మోహినీశక్తి, మహాత్ముని వైరాగ్య

మును భ్రష్టీకరించి తిరిగి యతనిని సంసారమునందుఁ బడఁ ద్రోయఁ జూచుచుండును. ఏ మహాత్ముఁ డీ బాధలనన్నిటిని ఖండించి ధర్మమార్గము నందుఁ బురోగామి గాఁజాలునో యతనికే యంతమునందుఁ బరమానందమయమగు బ్రహ్మ పదము జిక్కును. మఱియు నెవఁడా బాధలకు భయపడునో లేక మాయా మోహినీశక్తికిఁ జిక్కిపోవునో వాఁడు తిరిగి సంసారబంధమునందుఁ జిక్కిపోఁగలఁడు, గోపికలనుగురించి భగవంతుఁడు చెప్పిన సంగతి యంతయు నిహలోక పరలోక ములందుండెడి భయముజూపి వారిని బరీక్షించుటకే యుండెను. ఇందుకొరకే భగవంతుఁడు వారికిఁ బులి, సింహము, మున్నగు క్రూరజంతువులవలన భయమును జూపెను "ఇంటిలో, బిల్లలు, బిల్లవాండ్రు రోదింతురు. వారిని బుజ్జగింపవలయును" అని యీరీతిగా వారిని మగ్గురాండ్రను జేయుటకై యత్నించెను.దీని వలన వారు నిజధర్మములన్నింటిని దెలిసికొని గృహములకు దిరిగి పోఁగలరనెడి యుద్దేశముతో భగవంతుఁడవ్వారికిఁ బాతివ్రత్య ధర్మములను బోధించి పరలోకభయమునుజూపి భయపెట్టెను. తుదియందు రెండు శ్లోకములలో బరీక్షయొక్క పరాకాష్ట చెప్పబడినది. అనఁగా గోపికల చిత్తమునం దేశ్రీకృష్ణునిం గురించి పరమాత్మజ్ఞానమున్నదో యద్దానిని మరపింపఁజేయు టకై "శ్రీకృష్ణుఁడొక సామాన్య మనుష్యుఁడు. ఇతనితో బ్రేమించియుండుట యుపపతిని బ్రేమించిన దానితోఁదుల్యము.

కాబట్టి ఇట్లు చేయుటవలన మీకపకీర్తియు నరకమును కలుగ గలదు" అని యీమాటగూడ భగవంతుడుచెప్పి యావెంబడి గోపికలకు భక్తియొక్క లక్షణము శ్రవణ, కీర్తన, స్మరణాదులలోనిసంతుష్టి కలిగియుండుట నుపదేశించి సాన్నిధ్యప్రాప్తి (అనగా దగ్గిరకువచ్చుట) యనెడి యుపాసనలో నే పరాభక్తి, యే పరవైరాగ్యమనెడి లక్ష్యమున్నదో వానినుండి మరలింపజేయుటకై ప్రయత్నించెను. సరిగా నిట్లే యుండెడిమొక లీల. శ్రీ మద్భాగవత మందలి దశమ స్కంధములోని యిరువదిమూడవ యధ్యాయములో వర్ణింపబడియున్నది. ఇందలి వృత్తాంతమేమనగా. ఒక సమయమందు గోపాలబాలకులు క్షుధార్తులై శ్రీకృష్ణునిదరికి జని భోజనమడిగిరి. ఇదివిని శ్రీకృష్ణుడు వారికి సమీపముననున్న బ్రాహ్మణుల గృహములకు బోయి భిక్షమెత్తవలసినదని చెప్పెను, ఆ బాలకులా బ్రాహ్మణుల సదనములకుజని భిక్షమడిగినప్పుడా విప్రులు భిక్షమిడుటకు సమ్మతింపకపోయిరి. తరువాత శ్రీకృష్ణుడా బాలురకు దన పేరుజెప్పి యా బ్రాహ్మణుల స్త్రీలను భిక్షమడుగవలసినదనిపల్కెను. బాలురచటికేబోయి భిక్షమడిగెడి తరుణమున నా బ్రాహ్మణ స్త్రీలు శ్రీకృష్ణనామమును వినుటతోడనే నదులు సముద్రములోనికిబోయి కలిసినట్లు పతులు, సుతులు భ్రాతలు, పితరులు, మున్నగువారు వలదని నివారించుచున్నను విశేషముగా నన్నపానీయములంగైకొని భగవంతునింగలియు

టకువచ్చి యాత్మ సమర్పణము కావించిరి. భగవంతుఁడు గూడ గోపికలకు తక్కినవారికి స్వాగతమిడి గృహములకు మరలి పోవుటకై యుపదేశించెను. ఇందువలన బ్రాహ్మణ స్త్రీలు దుఃఖితలై భగవంతుని సన్నిధియందుండుటకే మాటిమాటి కార్తస్వరముతోఁ బ్రార్థింప మొదలిడిరి. కాని భగవంతుఁడు గోపికలకుపదేశించినట్లే వీరికిఁగూడ నుపదేశించెను. ఎట్లన—

"పతయో నాభ్యసూయేరన్ పితృభ్రాతృసుతాదయః
లోకాశ్చ వో మయోపేతా దేవా అప్యనుమన్వతే
న ప్రీతయేఽనురాగాయ హ్యంగసంగో నృణామిహ
తన్మనో మయి యుంజానా అచిరాన్మామవాప్స్యథ"

భగవంతుఁడా స్త్రీలకుఁజెప్పినదేమనగా, మీరిట్లిల్లు విడిచివచ్చుటచేత దండ్రులు, అన్నలు, తమ్ములు, కొడుకులు, దేవతలు మొదలగువారందఱు కోపింపగలరు. కాబట్టి మీరు గృహములకుఁదిరిగి పోవలయును. నాదగ్గిరనుండుటకెట్టి యావశ్యకములేదు. నాయందుఁ జిత్తముంచుటచేతనే మీకు ఫలము తొందరగాఁగలుగును. ఈ మాటనువిన్న యా స్త్రీలందరు గృహములకేగిరి. ఇప్పుడు గోపికలభావమును, నీ స్త్రీల భావమును రెండును బోల్చుటకుఁదగినవిగానున్నవి. బ్రాహ్మణస్త్రీలుకొద్ది పరీక్షలోనే తప్పి మరలిపోయిరి. దీనివలన వారియందాత్మార్పణబుద్ధి తక్కువగా నున్నదనియు, భగవంతుఁడు వారికి వశుఁడు గాలేదనియు సిద్ధాంతమగుచున్నది. ఇఁక గోపికలు

భగవంతునిచే నిహలోక పరలోక భీతులతో భయపెట్టఁబడ నప్పటికని, ననేక ప్రతికారములనుండు పరీక్షలచేఁ బరీక్షింపఁ బడినప్పటికిని మరలిపోలేదు. ఎందులకనఁగా, వారి యధికార మా బ్రాహ్మణస్త్రీలకంటె నధికముగా నుండెను. వీరు పూర్వ జన్మమునందు దేవతలయి యున్నారు. ఇందువలన వారి యం దాత్మార్పణ బుద్ధి పూర్ణముగా నుండెను. అందువలన భగవత్కృప, భక్తునిపై దప్పక యుండఁదగినది. భగవంతుఁ డట్లుపదేశించిన మీఁద గోపికలు మిగుల వగచి యేడ్చుచు నిట్లనిరి—

"మైవం విభో ర్హసి భవాన్గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయా స్తవ పాదమూలం
భక్తా భజస్వదురవగ్రహ! మాత్యజాస్మాన్
దేవో యథా దిపురుషోభజతే ముముక్షూన్
యత్పత్యపత్య సుహృదా మనువృత్తి రంగ!
స్త్రీణాం స్వధర్మ ఇతిధర్మవిదా త్వయోక్తం
అస్త్వేవమే తదుపదేశపదేత్వయీశే
ప్రేష్ఠోభవాం స్తను భృతాంకిల బంధురాత్మా ॥
కుర్వన్తి హిత్వయిరతిం కుశలాస్స్వ ఆత్మన్
నిత్య ప్రియే పతిసుతాదిభిదార్తిదైః కిం
తన్నః ప్రసీద పరమేశ్వర! మా స్మ ఛిన్ద్యా
ఆశాంభృతాం త్వయి చిరా దరవింద నేత్ర ॥

వ్యాపకుఁడవగు నో పరమాత్మ! తమకు మనుష్యుల గురించి యిట్లు కఠినముగా మాట్లాడుటదగదు. ఎందులకనఁగా మేము సమస్త సంసారమును విడిచిపెట్టి తమ చరణకమలము లను శరణుజొచ్చియుంటిమి. ఇందువలన నాదిపురుషుండగు భగవంతుఁడు ముముక్షుని గరుణించి త్యజింపనట్లు మేముగూడ మీచే విడిచిపెట్టఁదగినవారము గాము. కాఁబట్టి మాపై నను గ్రహించుచవలెను. మీరు పతి పుత్రాదులను సేవించుట స్త్రీలయొక్క ధర్మమంటిరి. ఆ యుపదేశ మెల్లయుపదేశముల కాధార రూపుడవగు నో పరమాత్మ! నీయందే యుండుగాక! ఎందులకనగా, మీరు సర్వప్రాణుల యాత్మయు బంధువునై యున్నారు. అందువలన మీరు ప్రియతములు. ఓ ఆత్మ స్వరూపా! నిత్యప్రియుఁడవగు నిన్ను జ్ఞానులు ప్రేమించుచు న్నారు. సంసారములోని పతి పుత్రాదు లనిత్యులైనందువలన దుఃఖప్రదులు. కాఁబట్టి యోపరమేశ్వరా! మీరు ప్రసన్నులు గండు. తమ చరణకమలములందు బద్ధమైయున్న యాశాలతను నఱికివేయకుఁడు. వైరాగ్యముగల పురుషుఁడు, సంసారమునుండి యీవలఁబడి నాలుగు వైపుల మాయామోహినీ శక్తివలనఁ బీడింపబడుచు క్షోభజెందు సమయమందును, కామాదిశత్రు వుల నెట్లణఁగఁదొక్కఁగలను? ఎట్లు సంసారపు మాయనుండి విముక్తుఁడను గాఁగలను? అను మున్నగు ననేక చింతలచే చిత్తము చలించు తరుణమందునను ఇదియే పరమాత్మవలన నగు

పరీక్షా సమయమని గుర్తెరుఁగవలెను. వాని వైరాగ్యము సామాన్యమైన దయినయెడల శ్రీకృష్ణుని ప్రలోభన వాక్యములచే బ్రాహ్మణ స్త్రీలు మరలి యింటికిఁబోయినట్లా సాధువుగూడ సాధుత్వమును విడిచి విషయలాలసుఁడగును. ఇఁకవాని ప్రారబ్ధము మంచిదై వైరాగ్యము దృఢమయినదయిన యెడలను, నాత్మసమర్పణబుద్ధి, సమగ్రముగానున్న యెడలను, బరమాత్మచే జేయబడు పరీక్షయందుఁదప్పిపోక యా పరాత్పరుని దరిని నేడ్చియుఁ బ్రార్థించియు. దన చిత్తవృత్తిని నున్నతముగలచానిఁగాఁజేసి కొనుటకై యా పరమేశ్వరునియందే యాత్మార్పణము జేయును. దీనిచేత నా సాధు జనునిపై భగవత్కృప కలుగును. గోపికల యవస్థ యీరీతిగానే సరిగానుండెను. భగవంతుఁడు బహుప్రకారములుగా నిహలోక పరలోక భీతులనుజూపి సంసారాశ్రమ ధర్మములను నిర్వర్తించుటకై గృహములకు,దిరిగి పోవలసినదని చెప్పినపుడా గోపికలా మహానుభావునిం గూర్చిన యాత్మార్పణబుద్ధి, సమగ్రమై యున్నందుదలన మరలిపోక భక్తుడగు సాధువుమాదిరి పై శ్లోకములందు వచించినట్లాలాపించి కరుణించుటకై ప్రార్థించిరి. పై శ్లోకములందు గోపికలు శ్రీకృష్ణచంద్రమూర్తిని వ్యాపకుఁడనియు, విభుఁడనియు, బరమాత్మయనియు మున్నగు వానితో సంబోధించి భగవంతుఁడు మనుత్మని కరుణించు ననెడి దృష్టాంతమునుగూడఁజూపి యట్లు మమ్ములను ననుగ్ర

హింప వలసినదని కోరిరి: దీనివలన శ్రీకృష్ణుండు పరమాత్మ యనెడివారికున్న జ్ఞానమును, నతనిగురించినవారి యున్నత భావమును విదితమగుచున్నది. రెండవ మూడవ శ్లోకము లందు గోపిక లుపనిషత్తులలోనివియు, గీతలలోనివియునగు సిద్ధాంతముల ననుసరించి ధర్మాధర్మముల తత్త్వము నిర్ణయించి పతి పుత్రాదులను త్యజించుటయందెట్టి పాపమును లేదనెడి విషయము ప్రదర్శింపబడినది. ఎందులకనంగా, బృహదారణ్య కోపనిషత్తునందిట్లు వచింపఁబడినది.

నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి, నవా అరే జాయాయై కామాయజాయా ప్రియా భవత్యాత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి. నవా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవంతి, నవా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్త్యాత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవంతి, నవా అరే సర్వస్యకామాయ సర్వం ప్రియం భవ త్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియంభవతి, తదేతి త్ప్రేయః పుత్రాత్ ప్రేయో విత్తా త్ప్రేయో న్య స్మాత్సర్వస్మా దంతరంతరో యదయమాత్మా, ఆత్మావా అరే ద్రష్టవ్య శ్శ్రో తవ్యోమంతవ్యోనిదిధ్యాసితవ్యః తమేవవిదిత్వాతి మృత్యుమేతి నా న్యః పంథా విద్యతే యనాయ."

పతి కొఱకుఁబతి ప్రియుండు గానేరఁడు. ఇఁక నేమన ఆత్మ (తన) కొఱకే పతి ప్రియుఁడు గాఁగలడు. సతికొఱకై సతి ప్రియగానేరదు. కాని తన (యాత్మ)కొరకు సతి ప్రియ

యగును. సుతునికొఱకు సుతుఁడు ప్రియుఁడుగాఁడు కాని యాత్మ (తన) కొఱకు సుతుఁడు ప్రియుఁడగును జీవునికొఱకు జీవుడుఁ ప్రియుఁడుగాఁడు. కాని యాత్మ (తన) కొఱకై జీవుఁడు ప్రియుఁడగును. సంసారముకొఱకు సంసారము ప్రియముగాదు-కాని యాత్మ(తన)కొఱకుసంసారముప్రియమగును.దీనింబట్టి పతి, సతి,సుత,ధనసంసారాదులన్నిటికంటె నాత్మ(తానే)యేమూల మైనందువలన ప్రియమగును ఆత్మ ప్రియతమముగూడ. ఇందు వలన నాయాత్మనే చూడవలయును ఆయాత్మవిషయములోనే శ్రవణింపవలయును మననము జేయవలయును, నిదిధ్యాసము (మఱిమఱిఁదలఁచుట) గావింపవలయును. ఎందులకనఁగా, ఆత్మ నెరుంగుటచేత నే ముక్తి దొరకగలదు. దుఃఖమయమగు సంసారమునుండి విముక్తియగుటకు వేరొండుపాయము గాన రాదు ఆ కారణముచేత నాత్మయే ప్రియతమమైనప్పుడును, సంసారములోని ప్రీతియంతయును నాత్మకుఁబ్రీతిని గూర్చు కార్యమైనప్పుడును సమస్త ప్రాణులయందును వ్యాపకమైన యాత్మనుగురించి ప్రేమించుట వలననే సర్వమునుగురించి ప్రీతి గలుగఁగలదు. ఎందులకనగా. పతి పుత్ర పిత్రాదులందఱు గూడ నాత్మయొక్క యంశమైయున్నారు. ఇందువలన వృక్ష మూలమునందు జలము పోయుటచేతఁగొమ్మలు, ఆకులు మొదలగువానియందుదకము పోయవలసిన యావశ్యకత లేనట్లే సంసారమనెడి వృక్షముయొక్క మూలమును, నిత్యుఁడును నగు

భగవంతుని ప్రేమించుటచేత ననిత్యులగు పతి పుత్రాదులను ప్రేమింపవలసిన యావశ్యకత లేదు. శ్రీకృష్ణ చంద్రుఁడా సర్వవ్యాపకుఁడగు పరమాత్ముఁడు. సాధారణుఁడగు నుపభర్త గాఁడు సమస్త పశులకును బరమపతియును. సర్వజీవులకాత్మ స్వరూపుఁడునై యున్నాఁడు. కాఁబట్టి గోపికల ప్రేమయు, నాత్మ సమర్పణ బుద్ధియు నా పరమాత్మయందే యుండుట వలన గృహిణులగు స్త్రీలు పతి పుత్రాదులనుగూర్చి చేయవలసిన పనులు గోపికలకు విధిగా శేషించియుండలేదు. కారణ మేమనగా భగవద్గీతలోనిట్లు స్వయముగా భగవంతుఁడు వచించుచున్నాడు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ,
అహంత్వాం సర్వపాపేభ్యో. మోక్షయిష్యామి మాశుచః"

సాధారణములగు గార్హస్థ్య ధర్మముల నన్నిటిని బరిత్యజించి యద్వితీయుఁడనగు నన్ను శరణుబొందవలసినది. సాధారణ ధర్మములను విడిచిపెట్టుటవలనఁ బాపము లేవైన గలిగిన యెడల నవ్వానినన్నిఁటినుండి తప్పింపఁగలను. గోపికలు పరాత్పరుఁడగు శ్రీకృష్ణచంద్రుని చెంగట నీయథార్థసిద్ధాంతమునే ప్రకటించిరి. దీనింబట్టి యా మహామహుని పరీక్షయందు గోపికలు పూర్తిగా నెగ్గిరనియు నందులకు ఫలస్వరూపముగా భగవంతుని ప్రేమ గడించిరనియుఁ దెలియుచున్నది. భాగవతము దేమి వ్రాయఁబడినదనఁగా,

"ఇతి విక్లబితం తాసాం, శ్రుత్వాయోగేశ్వరేశ్వరః
పరిహస్యసదయం గోపీ రాత్మా రామో హ్యకీరమత్"॥

యోగేశ్వరులకుఁ గూడ నీశ్వరుండును, నాత్మారాముం డును, భగవంతుండునగు శ్రీకృష్ణచంద్రుఁడు కాంతాభావ ముతోఁ బ్రేమించెడి గోపికలయొక్క యిట్టి యాత్మార్పణ బుద్ధితోఁగూడిన వాక్యములను విని తన స్వరూపమునం దేయుండి గోపికలను సర్వవిధముల సంతుష్టిపరచెను ఈ శ్లోకములో యోగేశ్వరుఁడు, ఆత్మారాముఁడనెడి రెండు విశేషణములచేత శ్రీకృష్ణుని నిర్లిప్తతయు, స్వరూపమందలి స్థితియు సూచింపఁ బడుచున్నవి. ఇందుకొఱకే శ్రీకృష్ణునినుండి ప్రేమను సంపా దించి గోపికలు తమ్మును మానవతులుగాఁ దలఁచిన సమయ మందా భగవంతుఁడవ్వారి మానమును, మరియు నహంకార మును విడిపింపఁజేయుటకై యచ్చటనే యంతర్థానమయ్యెను. భాగవతమందెట్లు వ్రాయఁబడినదో కనుఁడు.

"తాసాం తత్సౌభగమదం, వీక్ష్యమానంచ కేశవః
ప్రశమాయ ప్రసాదాయ, తత్త్రైవాంతరధీయత" ॥

గోపికల సౌభాగ్య మదమును, మానమును జూచి వానిని నష్టపరచుటకై శ్రీ భగవంతుఁడచ్చటనే తిరోహితుఁడయ్యెను. విచారింపగా గోపికలు దేవతలైయున్నారు. అట్లైనను మాయామయమగు శరీరమును దాల్చుటవలన దాని ప్రభావము కలుగుచునే యుండును దీనింబట్టి గోపికలకిట్లహంకారము పుట్టి

నది. ఇఁక భక్తవత్సలుండగు భగవంతుఁడు భక్తుని యున్నతి యందు బాధాకరమైన యహంకారమును లేక యభిమానమును దప్పక నష్టపఱచి భక్తిమార్గమును గంటకరహితముగాఁ జేయు చుండును. ఇందువలన గోపికలను గరుణించి వారి మానమును బోగొట్టుటకై యాతఁడిట్లు చేసెను. భగవంతుఁడంతర్హితుఁ డైనందువలన గోపికల మానమదములు నష్టమయ్యెను వీరు మిక్కిలి పశ్చాత్తాపముఁజెంద మొదలిడిరి. భాగవతమందిట్లు వ్రాయఁబడినది.

"అంతర్హితే భగవతి, సహసైవ వ్రజాంగనాః
అతప్యంస్తమచక్షాణాః, కరిణ్య ఇవయూథపం"॥

భగవంతుఁడు తటాలున మఱుగుపడుటచేత గజరాజును జూడఁనట్టి యాడేనుఁగులవలె శ్రీకృష్ణుని గాంచనట్టి గోపికలు పశ్చాత్తాపపడిరి. ఈగోపికలు నల్గడలఁ దిరిగితిరిగి వెదకివెదకి పిచ్చివారివలె వృక్షాదుల నన్నిటినిగూడ "భగవంతుఁడెట్లు పోయె" నని యడుగఁదొడఁగిరి. ఎట్లనఁగా.

"గాయన్త్య ఉచ్చైరముమేవసంహతా, విచిక్యురున్మత్తక వద్వనాద్వనం
పప్రచ్ఛురాకాశవదన్తరంబహిః, ర్భూతేషు సన్తం పురుషంవనస్పతీన్"॥

పెద్ద గొంతుకతో నేడ్చుచు గోపికలందఱు గలిసి పిచ్చి వారలతీరున వనవనమునందు భగవంతుని వెదుక మొదలిడిరి. మఱియు గగనమువలె సకలభూతములయొక్క లోపలను వెలు పలను బ్రకాశించెడి భగవంతునికొఱకై వృక్షములను బ్రశ్నింపఁ

దొడఁగిరి. గోపికలు భగవంతుఁడెట్లు పోయెనని కొన్ని యెడల రాగిచెట్లను, గొన్నిచోట్ల కురవకవృక్షములను, గొన్ని స్థలముల నశోకతరువులను, గొన్ని స్థానములందుఁ జంపకములను, గొన్ని ప్రదేశములందు గోవిందునకుఁ బ్రియురాలగు తులసిని, మల్లికలను, మాలతిని నారీతిగా నేడ్చుచు నడిగిరి. గడ్డిపరకతో నిండి యున్న భూమినిజూచి ఇది దూర్వాదళము గాదు. శ్రీకృష్ణుని చరణ స్పర్శముచే భూమికి రోమాంచ (గగుర్పాటు) మగు చున్నదని వారు గ్రహించిరి. ఇందుకొఱకై గోపికలు "శ్రీకృష్ణుఁ డెట్లు పోయెనను సంగతి తెలిసికొనుటకుఁ బృథివిని సంబోధించి యిట్లనుచున్నారు.

> "కిం తే కృతం క్షితి! తపో బత కేశవాంఘ్రి
> స్పర్శోత్సవోత్పులకితాంగరుహైర్విభాసి
> అప్యంఘ్రిసంభవ ఉరుక్రమ విక్రమాద్వా
> ఆహో వరాహవ పుషః పరిరంభణేన"॥

ఓ పృథివీ! నీవెట్టితపమొనరించితివో నేనెఱుఁగఁజాలను. దీనివలన భగవంతుఁడగు కేశవుని పాదస్పర్శమువల్ల యానందముచే నీ శరీరమందు రోమాంచ మగుచున్నదిగదా. ఏమి? ఇప్పుడే శ్రీకృష్ణుఁడు నిన్ను తన చరణములతో స్పృశించి చనినాడా? అందులకేనా రోమాంచ మగుచున్నది? లేక, పూర్వమందు వామనుని చరణములను స్పృశించియుంటివి. దానివలన రోమాంచ మగుచున్నదా? లేక దానికంటె పూర్వ

మందలి వరాహావతారుని చరణస్పర్శమువలననా రోమాంచ మగుచున్నదా? ఈ శ్లోకమువలన గోపికలు శ్రీకృష్ణచంద్రుని యుగయుగమునందు నవతారమును ధరించెడి భగవంతునిగా నెఱుంగుచున్నారనెడి భావము ప్రకటితమగుచున్నది. గోపికల యీయవస్థభక్తుని పశ్చాత్తాపావస్థయైయున్నది. శాస్త్రములయందీ యవస్థ యందలి మహిమములు విశేషముగా వర్ణింపఁబడినవి. ఎందులకనఁగా. ఇట్టి యనుతాపమందలి కన్నీరే భక్తుని చిత్తములోని సమస్తదోషములను దొలఁగించి చిత్తమును నిర్మలము జేయుచున్నది. దీనివలన భక్తుని హృదయమనెడి యాసనముపై భగవంతుఁడాసీనుఁడుఁ కాఁగలఁడు. దీనింగురించి యోగదర్శన మందిట్లున్నది.

"తీవ్ర సంవేగానామా సన్నతమః"

భగవంతునింగూర్చిన భక్తునిచిత్త తీవ్రసంవేగమే, భగవంతుని దర్శనమును దొందరగాఁ జేయింపఁగలదు. ఈ ప్రకారముగా గోపికలు నలువైపుల నన్వేషణముఁ జేయుచు శ్రీకృష్ణుని భావములోఁ దన్మయులైరి. దీనివలన వారు తమ్మునే శ్రీకృష్ణునిగాఁ దలఁచుకొని శ్రీకృష్ణుని సమస్త బాలలీలలను జేయఁ బ్రారంభించిరి. భాగవతములో వ్రాయఁ బడిన దేమనఁగా—

"ఇత్యున్మత్త వచోగోప్యః, కృష్ణాన్వేషణకాతరాః
లీలా భగవతస్తాస్తా హ్యనుచక్రుస్తదాత్మికాః ॥

కస్యాశ్చిత్పూతనాయన్త్యాః, కృష్ణాయ న్త్యపిబ త్స్తనం
తోకాయిత్వారుదత్యన్యా, పదాహన్ శకటాయతీం॥

మాక్షైష్టవాతవర్షాభ్యాం, తత్త్రాణం విహితం మయా
ఇత్యుక్త్వైకేన హస్తేన యతంత్యున్నిదధేంబరం॥

ఆరుహ్యైకా పదా క్రమ్య, శిరస్యాహ పరాంనృప!
దుష్టాహే! గచ్ఛ! జాతే హం, ఖలానాం నను దండధృక్॥"

శ్రీకృష్ణుని వెదకుటయందుఁ గాతరల (భయపడెడి స్వభావముగలవారు) రీతిని, వెఱ్ఱివారి వలెను నల్గడల నూరక మాట్లాడెడి గోపికలు తుదకుఁదన్మయలై స్త్రీలమనెడి సంగతియు మరచి తమ్మును గృష్ణునిగాఁదలంచుకొని యతని సమస్త లీలల ననుకరింపఁగడఁగిరి. ఒక గోపిక, తన్ను బూతనగా నెంచుకొని మఱియొక గోపికను శ్రీకృష్ణ బాలునిగాఁదలఁచి యతనికి స్తన్యము (చనుబాలు) నీయఁదొడంగెను. ఒక గోపిక శ్రీకృష్ణమూర్తిగా మారి వేరొక గోపికను శకటాసురునిగా మార్చి పాదముతో నాశకటముపైఁదన్ని యేడువ మొదలు పెట్టెను. ఒక గోపిక గోవర్ధన పర్వతము నెత్తినట్లు తన చేతితో వస్త్రమును పైకెత్తిపట్టికొని "యోవ్రజవాసిలగు గోపికలారా! గోవర్ధన పర్వతమునెత్తితిని మీకిందుఁ్రిని వర్షము వలన భయములేదు. నేను గోవర్ధన పర్వతమెత్తి యందఱిని రక్షించుచున్నాను." అని యీ భావముతో జెప్పఁదొడంగెను. ఒక గోపిక, యింకొక గోపికయొక్క శిరముపైనెక్కి పాదము

లతోఁదొ్రిక్కుచు "ఓ దుష్ట కాళీయ నాగమా! నీవు దూరము గాఁబొమ్ము. ఎందులకందువా? నేను దుష్టులను దండించుట కొఱకే ప్రపంచమందవతరించితిని. ఈ ప్రకారముగా భగ వంతుని భావములోఁదన్మయులగు గోపిక లనేక ప్రకారములు గానుండు లీలలను జేయఁదొడంగిరి. ఇట్టి తన్మయ భావము భక్తుని ధ్యానముయొక్క తుదిదశలో నగుచుండును. ధ్యాన ముయొక్క తొలిదశలో ధ్యాత, ధ్యానము, ధ్యేయము, అనఁగా ధ్యానించువాఁడు, ధ్యానింపఁదగిన యిష్టదైవముఁ ధ్యానమనెడి యీ మూఁడును వేఱు వేఱుగానుండును. ఇఁక క్రమక్రమముగా ధ్యానమునందుఁజిత్తము గూర్పఁబడినపుడు తుదియందీమూఁడు నొకటియేకాఁగలదు. అనఁగా ధ్యాతయగు భక్తుఁడు ధ్యేయమగు పరమాత్మ భావమును బ్రాప్తముజేసి కొనును. దాని పేరే తన్మయభావము. ఈ భావము సమాధి యొక్క తొలిదశలోనగుచుండును. ఇందువలన భక్తుఁడు భగ వంతునిలోఁదన్మయుడై తన్ను భగవంతునిగానే తలఁపమొద లిడును. ఈ సమయమందే భక్తునకు భగవద్దర్శన మగును. గోపికల దశ, సరిగా నిట్టిదేయై యుండెను ఎంతవరకు గోపికలు నలువైపుల నేడ్చుచు భగవంతునిఁగూర్చి యేకాగ్ర చిత్తముతోఁ వెదకుచుండిరో యంతవరకు వారు ధ్యానదశలో నుండిరి. ఎందులకనఁగా, ఆ సమయమందు ధ్యానించెడి గోపి కలు వేఱుగాను, భగవంతుఁడు వేరుగా నుండెను. ఇఁక దాని

యన్నతదశలో గోపికలు తన్మయలెప్పుడయిరో, యప్పుడా పృథక్భావములేదు. ఆతరుణమునందు గోపికలు తమ్మును భగవంతునిగా భావించుకొని యతని లీలలను జేయఁదొడంగిరి. భక్తుఁడు తన్మయుడగుటవలన భగవద్దర్శనము దొరకఁగలదని యిప్పుడే చెప్పియుంటిమి. కాఁబట్టి గోపికలిట్లు తన్మయలైన వెంటనే వారు భగవంతుని చరణముల చిహ్నములను జూడఁగడంగిరి. భాగవతమందిట్లు వ్రాయబడినది.

"ఏవం కృష్ణం పృచ్ఛమానా, బృందావన లతాస్తరూన్
వ్యచక్షత వనోద్దేశే, పదాని పరమాత్మనః॥

ఇట్లు బృందావనములోని తరులతాదుల నడుగుచుఁ తన్మయలగు గోపికలకుఁ బరమాత్మని చరణచిహ్నములు గనుపడినవి ఎత్తఱి భక్తునకు విశేషధ్యానము వలనను తన్మయత్వమువలనను నానందమయుఁడగు భగవంతుని యీషదాభాస సుఖములు ప్రకటమగునో యత్తఱి నా భక్తుఁడింకను వ్యగ్రుడు నే కాంక్షచిత్తుడునునై భగవద్దర్శనమును బొందుటకై అతనిగురించి ప్రార్థించుటకును నతని గుణములను గానము జేయుటకునుబూనును ఇందుకొఱకు గోపికలుగూడనట్లేచేసిరి భాగవతమందెట్లున్నదనగా.

"తన్మనస్కాస్తదాలాపా స్తద్విచేష్టాస్త దాత్మికాః।
తద్గుణానేవ గాయన్త్యో నాత్మాగారాణి సస్మరుః॥
పునః పులినమాగత్య, కాళింద్యాః కృష్ణభావనాః।
సమవేతా జగుః కృష్ణం, తదాగమనకాంక్షితాః॥"

గోపికలు భగవంతునియందుఁ జిత్తముంచి, తదాత్మికలై యతని గుణములనే కీర్తించుచు దమగృహములను మరచిరి. ఇదంతయు బూర్ణ వైరాగ్యముగల భక్తుని భావము దీని తరువాతఁ గృష్ణునిగూర్చి చింతించుచుఁ జింతించుచు నతని దర్శనము గోరుచు గోపికలు యమునానది తటమునకు వచ్చి ప్రేమతో గూడ నిట్లు శ్రీకృష్ణునిం గొనియాడిరి.

"జయతితే ధికం జన్మనా వ్రజశ్శ్రయత ఇందిరా శశ్వదత్రహి।
దయిత! దృశ్యతాందిక్షుతావకారి, స్త్వయిధృతాసవస్త్వాంవిచిన్వతే॥
శరదుదాశయే సాధుజాత సత్సరసిజోదర శ్రీముషా దృశా
సురతనాథ! తేశుల్కదాసికా, వరద! నిఘ్నతో నేహకింవధః॥

ఓ ప్రియుఁడవగు పరమాత్మా! మీరు వ్రజమునందు జన్మించుటచే దానికి జయమగుచున్నది ఇచ్చట నెల్లప్పుడు లక్ష్మి ప్రకాశించుచున్నది. చూడుఁడు తమకొఱకే ప్రేమించెడి గోపికలు తమ చరణకమలములందుఁ బ్రాణము నర్పించి మీ దర్శనార్థమై ప్రార్థించుచున్నారు. శరత్కాలమందు జలాశయము (మడుగు)లో బాగుగా వికసించిన తామరలవలె నుండు మీ మనోహర నేత్రములతో మూల్యములేని తమదాసికలను హత్యచేయుచున్నావు. ఇది వధ గాదా యేమి? ఇట్లు గోపికలు భగవంతుని రూపమునుగురించియుఁ గుణములనుగురించియు బ్రశంసించుచు దర్శించుకోరికతో వేడఁదొడఁగిరి. శాస్త్రములలో నుపాసనము రెండు విధములుగా నుపదేశింపఁబడినది.

1. సాకారోపాసనము 2. నిరాకారోపాసనము. ఎంతవఱకుఁ బ్రపంచరూపమును జూచెడిరుచి మనుష్యునకుండునో యంతవఱకు నిరాకారోపాసన యతనికి సంభవింపఁజాలదు. ఎందులకనఁగా వాని చిత్తము ప్రపంచరూపమునందు బద్ధమైయున్నది. అతనికి నిరాకారోపాసన ముపదేశించినయెడల వానిచిత్త మెప్పుడు గూడ దానియందే కాగ్రముగా నుండజాలదు. ఇందువలననే మహర్షులు ప్రపంచరూపమునుండి చిత్తమును దొలఁగించి యాధ్యాత్మికోన్నతిని జేసికొనుటకై నిరాకారుండగు భగవంతునకు రూపమునుగల్పించి సాధకుని చిత్తము నేకాగ్రమొనరించుట కుపాయమును గావించిరి. సాధకుఁడు భగవంతునిరూపమందే చిత్తమును జేర్చి ప్రపంచరూపముపై నిట్టి లోభ మోహాదులను విడిచి మెల్లమెల్లగా నిరాకారుండగు భగవంతుని నుపాసించుట కధికారి గాఁగలఁడు. ఇదియే సగుణోపాసనము లేక సాకారోపాసనముయొక్క లక్ష్యము. భగవంతునియొట్టి సాకార మూర్తియందే కాగ్రచిత్తుఁడై ధ్యానించుటచే ధ్యానము పరిపక్వమగు తరుణమందు భగవంతుని సాకారమూర్తియొక్క దర్శనమతనికిఁ గాఁగలదు. ఇందుకొఱకే గోపికలు తొలియధికారియగు మూర్తి పూజకునివలె భగవంతుని లోచనములను, శరీరమును, గుణములు మున్నగు వానిని బ్రశంసించి ప్రార్థింప మొదలిడిరి. తరువాత భక్తియు జ్ఞానము సభిన్నమైనప్పుడే, పరాభక్తియొక్క దశలో సాకార, నిరాకారము, లనెడి రెండు

స్వరూపములయొక్క జ్ఞానమైనప్పుడే, సగుణోపాసనముతో నిర్గుణోపాసనకు గూడ సాధనమైనప్పుడే భక్తునకు సర్వవ్యాపకుండును, నానందమయుండును, నగు పరమాత్మ్మని యథార్థ దర్శనము ప్రతి శరీరమునందును బొడఁగట్టఁగలదు. కాబట్టి భగవంతుని సగుణ (సాకార) మూర్తిని జింతించుచుఁ జింతించుచు గోపికలు తటాలున నిట్లనిరి.

"నఖలు గోపికా నందనో భవా, నఖిలదేహినా మంతరాత్మదృక్
విఖనసార్థితో విశ్వగుప్తయే, సఖ! ఉదేయివాన్ సాత్వతాంకులే॥

ఓ పరమాత్మా! నీవు గోపికా కుమారుఁడవు గావు ఇఁక నేమన, సమస్తజీవుల యంతరాత్మ జూచెడివాడవును, ప్రతి శరీరమందును బ్రకాశించువాఁడవును, నిరాకారుండవునగు పరమాత్ముఁడవు. బ్రహ్మదేవుని వేఁడికోలువలనఁ బ్రపంచమును రక్షించుటకై యదుకులమం దుదయించితివి ఇప్పుడీ గోపికల చిత్తమునందు భగవంతుని నిర్గుణ, నిరాకార, సర్వవ్యాపక భావములుగూడఁ బ్రకటమైనవి. సాకార నిరాకారోపాసనములు సంపూర్ణములైనవి. భక్తియు జ్ఞానము నేకాధారమందుఁ గలిసినవి. దీనింబట్టి వారి యీ ప్రార్థనము వినుటతోటనే భగవంతుఁ డవ్వారికి దర్శనమిడెనని తెలియుచున్నది. ఎట్లన—

"తాసామావిరభూచ్ఛౌరిః, స్మయమానముఖాంబుజ
పీతాంబరధర స్స్రగ్వీ, సాక్షాన్మన్మథ మన్మథః॥"

పీతాంబరుండును. వనమాలాధారియు, మన్మథునకుఁ గూడ మన్మథుండునగు భగవంతుఁడు మృదువును, మందరము నగు హాస్యమును జేయుచు దర్శమిడెను.—

"తం విలోక్యాగతం ప్రేష్ఠం, ప్రీత్యుత్ఫుల్లదృశో బలాః
ఉత్తస్థుర్యుగపత్సర్వాస్తన్వః ప్రాణమివాగతం ॥"

ప్రియతముండగు భగవంతుఁడు వచ్చినమీఁదఁ జూచి యానందముచేఁ బ్రఫుల్ల నేత్రులై ప్రాణము చేరుటచే యావత్తు శరీరమొకసారి (ఏకాయకి) గా లేచి నిలిచినట్లు గోపికలెల్ల రొక్కసారిగా లేచి నిలిచిరి. అటు తరువాత నందఱు తమ తమ చిత్తము ననుసరించి భగవంతునకు స్వాగతమిడి యతనిని యమునానది గట్టునకుఁ దోడ్కొనివచ్చి తమ యుత్తరీయముల నాసనములుగాఁబరచి యాసీనునిఁ గావించిరి. గోపికలు జ్ఞానము మూలముగాఁగల భక్తివలన భగవంతుని సాకారమూర్తిని మాత్రము గాంచిరి. ఇంకి నతనిమూర్తి యెల్లెడల గోపికలకుఁ గన్పడినప్పుడే సంపూర్ణానందము గల్గును. ఎందుల కనఁగా, భగవంతుఁడు గీతలలో నిట్లు నుడివియుండెను.

"బహూనాం జన్మనామంతే, జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి, సమహాత్మాసుదుర్లభః॥"

జ్ఞానియగు మహాత్ముండనేక జన్మములందు సాధించిన మీఁద నన్నుఁబొందఁగలఁడు. ఆ సమయమందతనికి సమస్త ప్రదేశములందును సర్వవ్యాపకమైన వాసుదేవరూపమే కను

పడుచుండును. ఇట్టి మహాత్ముఁడు ప్రపంచములో దుర్లభుఁడు. ఇదియే భక్తి యొక్కయు జ్ఞానము యొక్కయు పరాకాష్ఠ. భగవంతుని రూపము ప్రతిస్థలమునందు గన్పడుచుండుటయే పరమానందలాభము. గోపికలు భక్తివలన భగవంతుని యేక దేశవర్తియగు సాకారమూర్తిని మాత్రము జూడఁగల్గిరి. కాని సర్వప్రదేశములందును బ్రకాశించెడి భగవంతుని యానంద మయమగు రూపమును గాంచలేకపోయిరి. ఎందులకనఁగా, గోపికలందు భక్తి పూర్తిగా నున్నప్పటికి జ్ఞాన పూర్ణత లేకుండెను. హృదయమందప్పుడప్పుడు జ్ఞానభావ ముదయించు చుండెడిది భక్తి, జ్ఞానము, రెండుగూడ సంపూర్ణముగా నున్నప్పుడే భక్తుఁడు భగవంతుని సర్వప్రదేశములందును గను గొనఁగలఁడు. అట్టి జ్ఞానము బ్రహ్మజిజ్ఞాసవలన లభింప గలదు. కారణమే మన? గీతలలో నిట్లు చెప్పఁబడినది.

"తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా॥

ప్రణిపాతముఁ(మ్రొక్కుట) వలనను, సేవవలనను, ప్రశ్నించుటచేతను జ్ఞానము గలుగును. గోపికలు ప్రణిపాత మును జేసిరి. సేవను జేసిరి. కేవలమొక ప్రశ్నించుటయే వారికి మిగిలియుండెను. దీనికొఱకు గోపికలు తమ గురువగు భగవంతుని నెదుటఁగూర్చుండఁబెట్టికొని యిట్టులఁ బ్రశ్నింపఁ దొడఁగిరి—

"భజతోను భజంత్యేక, ఏక ఏతద్విపర్యయం ॥
నోభయాంశ్చ భజంత్యన్యా, ఏతన్నో బ్రూహిసాధుభోః॥"

గోపికలకు జ్ఞానము భక్తిమూలకమే కావలసియున్నది. వీనికొఱకు వారి ప్రశ్నగూడ నట్లేయున్నది. వారు "ఓ పరమాత్మా! వచింపుము. ప్రపంచములోఁ గొందఱు మనుష్యులు ప్రేమించిన తరువాతఁ బ్రేమించెదరు. మఱికొందఱు ప్రేమింపక పోయినను బ్రేమింతురు" ఇంకఁ గొందఱు ప్రేమించినమీఁదఁగూడఁ బ్రేమింపరు. ఇదంతయు నేమి సంగతి" యని యడిగిరి. భగవంతుఁడీ మూఁడు ప్రశ్నలకు సక్రమముగాఁ బ్రత్యుత్తరము లొసఁగెను. ఎట్లనఁగా.

"మిథోభజంతి యే సఖ్యః స్వార్థైకాంతోద్యమాహి తే
నతత్రసౌహృదం ధర్మః స్వార్థార్థం తద్ధినాన్యథా ॥
భజంత్యభజతో యేవై, కరుణాః పితరోయథా।
ధర్మోనిరపవాదోత్ర, సౌహృదంచ సుమధ్యమాః॥
భజతోపిన వైకేచి ద్భజంత్యభజతఃకుతః॥
ఆత్మారామాహ్యాప్త కామా అకృతజ్ఞా గురుద్రుహః॥

భగవంతుఁడు ప్రథమప్రశ్నమునకు "ఎవరు ప్రేమించిన మీఁదఁ బ్రేమింతురో వారు ప్రేమపు నంగడివాండ్రనియు, నిట్టి ప్రేమయొక్క మూలమునందు స్వార్థమున్నందున నిది ధర్మముగాదనియు" సమాధానము నొసఁగెను. రెండవ ప్రశ్నమునకు "ఎవరు ప్రేమింపకపోయినను మాతాపితరులు సుతుని బ్రేమించినట్లు అనఁగా తమ పుత్రులయోగ్యులైనను ప్రేమలేనివారైనను వారిప్రేమ పూర్ణమైయే యుండును. ఇట్టి

ప్రేమతో ధర్మము పూర్ణముగా నున్నది. “ఇక ప్రేమింపని వారి సంగతి యేమనఁగా, కొందఱు మనుష్యులు ప్రేమించిన మీఁదఁగూడ నెంతమాత్రము ప్రేమింపరు. ఇట్టివారు ప్రపంచమందు నాల్గు విధములుగా నున్నారు. (1) ఆత్మారాములు. (2) ఆప్తకాములు, (3) అకృతజ్ఞులు, (4) గురుద్రోహులు. ఆత్మయందు రమించెడి బ్రహ్మకోటిలోని జీవన్ముక్తుల దృష్టి తటస్థదశనుండి తొలఁగినమీఁదఁ వీరు పరుల నెవరినిగూడఁ జూడనేచూడరు. కాబట్టి వీరు ప్రేమించినమీఁద గూడఁ బ్రేమింపరు. ఆప్తకాములనఁగా విషయలాలసులను, స్వార్థులు నగు వారి స్వార్థము పరిపూర్తిగా నైనతరువాత వీరుగూడ ప్రేమించినను ప్రేమింపరు. అకృతజ్ఞులనఁగాఁ గృతఘ్నులగు వారుగూడఁ బ్రేమించినను ప్రేమింపరు. ఇఁక గురుద్రోహులు గురువు వలన విశేషానుగ్రహము బొందియు గూడ వారిని ప్రేమింపరు. గోపికలు మిక్కిలి ప్రేమించినను గూడ భగవంతుఁడు వారిని విడిచి దాగికొనెను. ఇందువలన గోపికలు భగవంతునిగూర్చి భ్రమతో కృతఘ్నునిగాఁదలంచుటకు వీలు న్నది. అందువలన భగవంతుఁడు వారి యవిద్యను దూరీకరించుటకై యీరీతిగా నుడివెను.

“నాహంతు సఖ్యోభజతోపి జంతూన్
భజామ్యమీషా మనువృత్తి వృత్తయే
యథాధనోలబ్ధధనే వినష్టే
తచ్చింతయాన్యన్నిభృతో నవేద॥

ఏవం మదర్థోజ్ఝిత లోక వేద
స్వానాం హి వో మయ్యనువృత్తయేఽబలాః,
మయా పరోక్షం భజతా తిరోహితం
మాఽసూయితుం మాఽర్హథతత్ప్రియం ప్రియాః ॥
నపారయేఽహం నిరవద్యసంయుజాం
స్వసాధుకృత్యం విబుధాఽఽయుషాపివః
యామాఽభజన్దుర్జర గేహ శృంఖలాః
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా ॥"

ఓ గోపీగణమా! నేను మాటి మాటికి నన్ను ప్రేమించిన మనుష్యులనుగూడ ప్రేమింపనట్లేది ప్రతీతమగుచున్నదో దానినుండి నన్ను కృతఘ్నునిగాఁదలఁపవలదు. కాని నేనిట్లు చేయుటకుఁగారణమేమనగా? ఈ ప్రకారముగానుండు ప్రేమ నడుమ విరహమును జేకూర్చుటచేత నన్నుగురించి మనుష్యునకింకఁ ప్రేమ హెచ్చఁగలదు. ఒక దరిద్రుని ధనము దొరకిన మీఁద నాధనముగూడఁ దిరిగి నష్టమైనయెడల వాని చిత్తమంతయు నాధనమునందే లగ్నమైయుండునుగదా. మీరు నన్నుఁ ప్రేమించి ప్రపంచమును, గుటుంబమునుఁ మఱియు ధర్మాధర్మములను సైతము విడిచిపెట్టితిరి. కనుక మీ ప్రేమ పూర్ణమైన సఫలత్వమును బొందెడిదానికై నేనింకను ప్రేమను హెచ్చించుటకొఱకుఁ బరోక్షమందుండి జరుగుచున్న దంతయుఁజూచుచుంటిని. ఆ కారణముచేత నాపై దోషమారోపించుట దగదు.

మీకు నాపై నుండెడి ప్రేమ పవిత్రమైనది. అందు కొఱకు మీరు కఠినమగు సంసార బంధమును త్రెంచి వేసితిరి. దానిఋణము చిరకాలముకైనను గూడ శోధింపజాలను. కనుక మీరు మీ సాధు స్వభావముచేతనే నన్ను ఋణమునుండి విముక్తుని జేయవలసినది. ఈ మాటలనుబట్టి దయామయుండగు భగవంతుండు తన స్వరూపమును దెలిపినప్పుడు భక్తురాండ్రగు గోపికలకు భగవంతుని స్వరూప విషయమందున్న భ్రమ యంతయుఁ దూరముగాఁదొలఁగి పూర్ణజ్ఞానము కలిగెను. ఇప్పుడు వారికి భక్తి జ్ఞానములు రెండును బూర్ణములైనవి, పరాభక్తియొక్క పరాకాష్ఠయుఁగలిగినది. కనుక నిప్పుడు శ్రీకృష్ణభగవానుడేక దేశమందొకఁడుగ గనపడక నలువైపులను వేలకొలఁదిగనానందమయుఁలగు కృష్ణపరమాత్మ గనుపడఁ దొడంగెను. దీనిపేరే రాసక్రీడయందురు. ఎట్లన —

"యోగేశ్వరేణ కృష్ణేన, తాసాం మధ్యేద్వయోర్ద్వయోః
ప్రవిష్టేన గృహీతానాం. కంఠేస్వనికటం స్త్రియః"—

యోగీశ్వరుండును, భగవంతుడు నగు శ్రీకృష్ణచంద్రుండిరువురిరువురు గోపికలనడుమ నొక్కొక్క రూపమును దాల్చి "సిషేవ ఆత్మన్యవరుద్ధసౌరతః" తనయందుఁ గామదేవుని లయింపఁజేసి గోపికల కానంద ప్రదానము గావించెను నలుగడలను భగవంతుని వేలకొలఁది రూపములు గలిగెను. జ్ఞానలక్ష్యము, పరాభక్తిలక్ష్యము, మఱియు యోగలక్ష్యమును

"వాసుదేవ స్సర్వం" అంతటనున్న భగవద్దర్శనము గోపికలకుం గాం దొడంగినది. ఇదియే బ్రహ్మజ్ఞాని కెల్లయెడల నుండు నాత్మదర్శనము. భగవద్గీతలో వ్రాయంబడిన దేమనగా.—

"సర్వభూతస్థ మాత్మానం, సర్వభూతానిచాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా, సర్వత్ర సమదర్శనః ॥"

యోగయుక్తుండగు మహాపురుషుండాత్మను సకలభూతములలోను, సర్వభూతముల నాత్మయందును జూచి బ్రహ్మానందమును బొందుచున్నాండు. ఈ యవస్థయే యుపనిషత్తులందు వర్ణింపంబడినది. ఎట్లన ?

"బ్రహ్మైవ ఇదం అమృతం పురస్తాద్బ్రహ్మ, పశ్చాద్బ్రహ్మ, దక్షిణతశ్చోత్తరేణ అథశ్చోర్ధ్వంచ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం ॥"

ఆనందమయము, నమృతమయమునగు బ్రహ్మమంతట నన్నిదిక్కులందును వ్యాప్తమై యున్నది. సర్వ ప్రపంచము బ్రహ్మమయమే.

ఈభావమే జ్ఞానవతులును, భక్తురాండ్రునగు గోపికలకుగూడ బొడగట్టందొడంగినది ఏవైపు జూచిన నావైపే రసరూపుండగు పరమాత్మయు, నే దిక్కుం గనుంగొనిన నా దిక్కే యానందసముద్రమును గన్పడెను. గోపికలు—సంసారమునుండి విరక్తిని బొంది భక్తురాండ్రయిన గోపికలు—

పూర్వజన్మమునం దున్నతి బొందిన గోపిక లిట్లు సంసారము నుండి విరక్తి బొంది పరమాత్మను వెదకుటలో చాల దుఃఖించుచు తుదియం దెల్లచోట్లఁ బ్రకాశించెడి యానందమయుం డగు పరాత్పరుని జూచిరి. వారిజన్మము సఫలమైనది. శ్రీకృష్ణ చంద్రునిఁ బరమపతిగాను, బరమాత్మగాను గుర్తెరిఁగి కాంతా భావముతో నాతని శాంతిమయియగు చరణముల ఛాయను బొందుటకై వా రాచరించిన దుష్కరమగు కాత్యాయనీవ్రత మీాదినమునందు సఫలమైనది. గోపికలు బ్రహ్మరూపుడగు శ్రీకృష్ణుని చరణకమలములందుఁ దమ జీవనమును సమర్పించి పరమానందరూప సముద్రములోఁ దమ తనువును, మనమును, ప్రాణమును మఱియు జీవాత్మను లయింపఁజేసి ధన్య లయిరి. ఇదియే రాసలీలయొక్క యథార్థ స్వరూపము. దీనినే వేదవ్యాస భగవానులవారు భాగవతాది గ్రంథములందు వర్ణించి యున్నారు. శ్రీకృష్ణుఁడు భగవంతుని పూర్ణావతారము కనుక నతనియందు సచ్చిదానందుని యానందము యొక్క పూర్ణత్వమున్నది. కనుకనే యాపూర్ణానందముయొక్క యాదర్శము రాసలీలరూపమునం దతఁడు ప్రకటించియున్నాఁడు. శ్రీకృష్ణ చంద్రుఁడు పూర్ణావతారుఁడు కానియెడల నిట్లొనర్పి యుండఁడు. కాఁబట్టి రాసక్రీడ యతని పూర్ణావతార మహిమనే ప్రకటించుచున్నది. భరతవర్షములోఁ బాపము హెచ్చగుటతోఁబాటనేక ప్రకారములుగాఁ జెడు పద్ధతులు చెలరేగినవి.

వానిలో రాసలీలగూడ నొకటియై యున్నది. కొందఱు శ్రీకృష్ణ పరమాత్మునియొక్కయు, రాసలీల యొక్కయు యథార్థస్వరూపమును గుర్తెఱుఁగక నేఁటి కాలమున శ్రీకృష్ణుని పేరు బెట్టి విశేషముగా మిక్కిలి యసభ్య లీలలను గావించుచున్నారు. ఇది యంతయు నజ్ఞానము. మఱియుఁ బాపవృద్ధియొక్క ఫలమే. భగవంతుని లేక ధర్మముయొక్క పేరు బెట్టి పాపములను చేయుచున్నారు. కాఁబట్టి యట్టి యకార్యము నెగురఁగొట్టవలయును. రెండియు భగవంతుని యథార్థలీలలను బ్రచారము జేయవలయును.

భయంకరమగు కలికాలమందలి విపరీతగతిచే శ్రీకృష్ణ భగవానుని భక్తిమయియగు మధుర లీలనుగూడఁ గలికాలపు మనుష్యు లెఱుంగఁజాలక బహు ప్రకారములుగా దోషముల నారోపింపమొదలుపెట్టిరి. కాఁబట్టి కృష్ణభగవానునియొక్కయు గోపికలయొక్కయుఁ జరిత్రములను వర్ణించి యా సకల శంకలకు సమాధానము లొసఁగఁబడుచున్నవి. రాసలీలయందట్లు జేయఁబడినకార్యము లన్నిటెని విచారించి చూచుటవలన శ్రీకృష్ణుని స్వరూపజ్ఞానము పూర్ణముగాఁ గాఁగలదు. ఈ విషయ మీావఱకే యిట్లు చెప్పియున్నాము.

"యోగేశ్వరేణ కృష్ణేన, తాసాం మధ్యే ద్వయోర్ద్వయోః
ప్రవిష్టేన గృహీతానాం, కంఠే స్వనికటం స్త్రియః॥"

శ్రీకృష్ణుఁడు రాసలీలను గావించు తరుణమునం దిరువు రిరువురు గోపికలనడుమ నొక్కొక్కఁడయి వేలకొలఁది మూర్తు

లను దాల్చెను. మఱియు రాసలీలను గావించిన రాత్రియుడ్ల దిల్లు విడిచి వచ్చినట్టి గోపికలయొక్క రూపమును దాల్చి వారి ప తులకడఁ బ్రకాశింపఁ దొడఁగెను. భాగవతమం దిట్లు నుడువఁ బడినది.

"నాసూయన్ ఖలు కృష్ణాయ, మోహితాస్తస్య మాయయా
మన్యమానా స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్దారా న్వ్రజౌకసః॥"

భగవంతుని మాయవలన ముగ్ధులై గోపకులు తమ స్త్రీలు తమ్ము విడిచిపెట్టి పోయిన సంగతిఁ దెలిసికొనఁజాలక వారిని దమయొద్ద నున్నట్లు జూచుచుండిరి. దీనింబట్టి యారాత్రి యందు భగవంతుఁడు వేలకొలఁది స్త్రీ రూపములను, బుం రూపములను ధరించి యుండెనని సిద్ధించుచున్నది. ప్రస్తుత మందు విచారణీయాంశ మేమనగా, ఒక స్థూల శరీరమును వేలకొలఁది స్థూలశరీరములుగను, మరియు నొక సూక్ష్మ శరీరమును వేలకొలఁది సూక్ష్మ శరీరములగను గల్పించుట యోగశాస్త్రవిషయ మైనయెడల యోగము యొక్క మెట్టి యధికారమునందు యోగి, యీప్రకారముగా గాఁగలఁ డనునది విచారణీయాంశమై యున్నది. మాయావు లగు జను లింద్రజాలవిద్యవలన ఒకవిధముగా నున్నదానిని మ రొకవిధముగా జూపుటకై యింద్రజాలమువలనఁగాని, వనమూ లికవలనఁ గాని లేదా నికృష్టములగు సిద్ధులవలనఁ గాని కను లను నిశ్చేష్టితము లగునట్లు చేయుటయే. దీనివలన నొక విధ

ముగా నున్నది మఱొక రకముగాఁ గనుపడుటయుఁ, దమ యథార్థస్వరూపమును మఱియొక రూపముతోఁ జూపుటకొఱకు వారియందొక మాయాకరూపమునే మార్చివేయఁగల శక్తి మాత్రము కలదనియుఁ దెలియుచున్నది అనేక రూపములను ధరించు శక్తి లేదు. ఎందులకనఁగా, ఈ యింద్రజాలికులు కేవల మొక స్థూలశరీరమునే మార్పఁగలరు. సూక్ష్మశరీరమును మార్చెడి శక్తి వారియందుండదు. కాబట్టి సూక్ష్మశరీర మొకటియే యున్నందువలన మూర్తియుగూడ నొక దానిని మాత్రమే ధరింపగల్గుదురు. పెక్కింటిని దాల్పలేరు. ఇంద్రజాలమందింతయే కలదు. ఇంతకంటె నధికములేదు. కాని యోగాధికార మిద్దానికంటె మిక్కిలి హెచ్చుగానున్నది. ఈ యధికారమును బొందుటచేత యోగి వేలకొలఁదిగ స్థూలశరీరములను, వేలకొలఁది సూక్ష్మశరీరములను జేయజాలును. ఇది యెట్టి యవస్థయందు శక్యమో యది చెప్పఁబడుచున్నది. యోగదర్శనమందలి యొక సూత్రమునందిట్లున్నది.—

"నిర్మాణ చిత్తాన్యస్మితా మాత్రాత్"

స్వరూప స్థితుఁడును జీవన్ముక్తుఁడునగు యోగి, తమ ప్రారబ్ధకర్మము శీఘ్రముగా ననుభవించి సమాప్తిజేయదలచిన యెడల ననేకస్థూలశరీములను మఱియు ననేక సూక్ష్మశరీరములను ధరించి భోగింపఁగలఁడు. ఇది బోధపడుటకై దృష్టాంతమును జూపుచున్నాము. ప్రారబ్ధకర్మము ననుసరించి యొక

యోగి కేఁబదిసంవత్సరము లాయువు నిండును. కాని యా యోగి యోగరూపమగు నలౌకిక పురుషార్థమువలన ముప్ప దేండ్లలో జీవన్ముక్తుఁడైనయెడల నతని యాయు వేఁబదివత్సర ములగుటచేత నింక నిరువదియేండ్లలో భోగింపవలసిన ప్రారబ్ధ కర్మను శేషింపఁగలదని తెలిసికోవలెను. ఏలనన శాస్త్ర సిద్ధాంత మిట్లున్నది.

"ప్రారబ్ధకర్మణాం భోగాదేవక్షయః"

ప్రారబ్ధకర్మముయొక్క క్షయమనుభవించుట వలననే యగును ఇప్పుడీ యిరువది సంవత్సరముల ప్రారబ్ధకర్మ మా యోగి యిష్టమున్నచో నిరువది యేండ్లలోనే యనుభ వింపఁగలఁడు, లేదా యంతకంటె దక్కువ కాలమందును భోగిం పఁగలఁడు. ఎట్లనగా ఆయోగియొక్క ప్రకృతి, యిరువది వర్ష ములకర్మమును నాలుగేండ్లలోననుభవింపలయునని యున్నచో నొక స్థూల, సూక్ష్మ శరీరమును నైదు స్థూల సూక్ష్మ శరీర ములనుగా గల్పించి యోగి యిరువది సంవత్సరముల ప్రారబ్ధ కర్మసులను నాల్గు సంవత్సరములలోనే యనుభవింపఁగలడు కాని యిట్టి స్థూల సూక్ష్మశరీరములను గల్పించుట, స్థూల సూక్ష్మ శరీరముల బంధనమునుండి ముక్తుడై యున్న అనఁగా జీవన్ముక్తుఁడగు నా యోగికే సంభవింపఁ గలదు. స్థూలభూత ములమీఁద నధికారమున్నప్పుడే యా భూతముల నొకచోఁ జేర్చి స్థూలశరీరము కల్పింపనగును. అట్లే సూక్ష్మభూతము

లపై నధికారమున్నప్పుడే వాని నొకచో జేర్చి యంతఃకరణము మొదలగు సూక్ష్మశరీరమును గల్పించుట యోగికి శక్యమగును.

యోగి రెండు (స్థూల, సూక్ష్మ) తత్వములనుండి వే అగునప్పుడే యా స్థూల, సూక్ష్మముల రెంటియందు నధికార ముండఁగలదు. ఎందుల కనఁగా, ఎవఁడు దేనికంటే వేఱులేక హెచ్చగునో వాఁడే యద్దానియం దధికార ముంచఁగలఁడు. విషయలంపటులగు పురుషు లిట్లు చేయఁజాలరు. కారణ మేమ నఁగా, విషయు లగువారి యాత్మ, మనస్సు, ఇంద్రియములు, సూక్ష్మశరీరమునకు స్వాధీనము లయినందునఁ దత్వములపై నధికార ముంచగల శక్తి వానియందుఁ గలుగఁజాలదు. ఈ పనిని రాగరహితుఁడును, జితేంద్రియుఁడు నగు యోగి యొన రింపఁగలఁడు. విషయు లగువారు చేయఁజాలరు. దీనింబట్టి శ్రీకృష్ణుఁడు భగవంతుఁడును, నిర్లిప్తుఁడును, జితేంద్రియుఁడు ను, జ్ఞానియు, యోగియునని సిద్ధించుచున్నది. ఇట్టివాఁడే కాని యెడల శ్రీకృష్ణుఁ డేతరుణమందుఁగూడ స్థూల సూక్ష్మతత్వ ములపై నధికారము గలిగి వేలకొలఁది స్థూల సూక్ష్మ శరీరము లను ధరింపఁజాలకుండెడివాఁడు. దీనింబట్టి జను లాక్షేపించెడి రాసక్రీడనుగూర్చి విచారించుకొనినచో శ్రీకృష్ణమూర్తి పూ ర్తిగా జితేంద్రియుండును, యోగియు నై యున్నాఁడనియు, నతనియందుఁ గామము లేశమాత్రమును లేదనియు సిద్ధించినది. ఇదిగాక రాసలీల యగుచుండఁగా రెండుసూఁఖులు శ్రీకృష్ణు

డంతర్ధాన మయ్యెను. ఈ విషయము గూడ భాగవతమందు వ్రాయఁబడినది. యోగదర్శనము ననుసరించి కాయమునందు సంయమ మొనరించుటవలన నంతర్ధానము గాఁగలఁడు. మరియు సంయమముయొక్క లక్షణమును గురించి దానియందే యిట్లు వ్రాయఁబడనది.

త్రయ మేకత్ర సంయమః॥

ధారణ, ధ్యానము, సమాధి యీ మూడును గలిసిన మీఁద సంయమ మగును. ఎవఁడానూటిని గలుపఁగలఁడో వాఁడు కాముకుఁడు గాఁజాలఁడు. ఇది కామదశకంటె మించిన యవస్థ. కనుకనే వేద వ్యాస భగవానులవా రిట్లు వ్రాయుచున్నారు.

యోగేశ్వరేణ కృష్ణేన॥

యోగేశ్వరుండగు శ్రీకృష్ణుం డిన్ని శరీరములను ధరించెను. అతనియందుఁ గామ మున్నచో "యోగేశ్వర" అని లిఖింపక "కామేశ్వర" అని లిఖించెడివాఁడు. ఈ యఖండ యోగయుక్తియే శ్రీకృష్ణచరిత్రము చాగుగా సమర్థించుచున్నది. ఎందుల కనఁగాఁ పురుషుఁడు జితేంద్రియుఁ డైనప్పుడు స్త్రీ వానిని నేమి చేయఁగలదు. కనుక గోపిక లెట్టివారైనను గానిండు. ఆ విషయమందు శ్రీకృష్ణున కెట్టి హాని యును నుండదు. కనుకనే భాగవతమం దిట్లు వ్రాయఁబడినది.

సిషేవ ఆత్మన్యవరుద్ధ సౌరతః॥

తనయందు బ్రహ్మచర్యము నడ్డగించుకొని వారిని సం
తుష్టి పరచెను. శ్రీకృష్ణునియందుఁ గామము లేదు. ఇతఁ డెట్టి
వాఁడో ప్రపంచ మెఱుంగును. ఒక ప్రపంచమే మెఱుఁగుట
యేమి ? భగవద్గీతలలో భగవంతుఁడు స్వయముగా నతఁ డెట్టి
వాఁ డయినది నుడివియున్నాఁడు. ఎట్లన,

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం,
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి నకామ కామీ॥

నదులు, స్థిరము, గంభీరము: పూర్ణము, విశాలము నగు సముద్రములోఁ బ్రవేశించి తమ్మును గలిపివేసికొని దానికంటె వేఱుగా నుండనియట్లే యే మహాపురుషుని యుదారచిత్తరూపమగు మహాసముద్రములో సమస్త కామములును వచ్చి లయించుచున్నవో యా మహామహుఁడే శాంతిని బొందును. కామపరాయణుండగు జీవున కట్టిశాంతి చిక్కనేరదు. శ్రీకృష్ణ పరమాత్మ సామాన్యుండును, కామాసక్తుండునగు జీవునితో సమానముగా స్త్రీలను జూచి పాఱకుండెను. మఱియొక వ్యక్తియందుఁ గామము గనుగొని దుర్బలునివలెఁ బరుగిడెడి జనుఁడు పూర్ణుఁడు గాఁజాలఁడు. శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

నాఽయ మాత్మా బలహీనేన లభ్యః॥

బలములేని మానవుఁ డాత్మను బొందఁజాలఁడు. తేజస్సు గల పురుషుఁడుమాత్రమే యాత్మను గనఁజాలును. శ్రీకృష్ణుని యుదారహృదయము త్రైవిధముల దేజస్సుగలదియు, బూర్ణము నైయుండెను. అందువలన నా మహాత్మునిపై స్వకామమే యన నేల? పరుల కామపరిభావముగూడఁ బరిసరింప జాలకుండెను. కాని యేభక్తులెట్టి కామముతో వచ్చుచుండిరో యా యందఱి కామములును సముద్రములోనికి నదులువచ్చి కలిసిపోయినట్లా మహాత్మునికడకువచ్చి లయించి పోవుచుండెను. దీనివలన భక్తునకు ముక్తి గలుగుచుండెను. ఇదియే భగవంతుని స్వరూపము. మఱియు నా యా శాస్త్రములందు చెప్పబడిన ముక్తపురుషుని లక్షణ రూపములే భగవంతుని స్వరూపమని యెఱుంగవలెను. ముక్తుఁడగు పురుషుఁడు స్ఫటికమణి మాదిరి నుండి కమలదళము నందలిజలమువలె నిర్లిప్తుఁడుగ నుండును. స్ఫటికమణి సమీపమున నెరుపో నలుపో పసుపో యేదోరంగుగల పుష్పముంచినచో నా స్ఫటికముగూడ నా యా రంగుగలదై కనుపడుచున్నది. కాని వాస్తవములో స్ఫటికమునకు మాత్రమిా రంగు లేవియు లేవు. స్ఫటికము స్వచ్ఛముగను నిర్మలముగను నుండును. ఇట్లే ముక్తుడగు పురుషుని యంతఃకరణముగూడ నుండును. ఇది యెద్దానితోఁ గలియునో దానితో సమముగానే కాగలదు. ఎట్లన—

బాలే బాలా విదుషి విబుధో గాయకే గాయకేశః
శూరే శూరా నిగమవిదిచాఽమ్నాయలీలా గృహాణీ
సిద్ధే సిద్ధామునిషు మునయః సత్సు సంతోమహాంతః
ప్రౌఢే ప్రౌఢాః కిమితివచసా తాదృశాయాదృశేషు!
మానే మానీ గుణిని గుణవాన్పండితే పండితోఽసౌ
దీనే దీనః సుఖిని సుఖవాన్భోగిని ప్రాప్తభోగః
మూర్ఖే మూర్ఖః యువతిషు యువా వాగ్మిషు ప్రౌఢవాగ్మీ
ధన్యః కశ్చిత్త్రిభువనజయీ యోవధూతేఽవధూతః॥

ప్రాకృతిక భావము లన్నింటిని దాటి విరాజిల్లు బ్రహ్మ రూపియగు ముక్త పురుషుఁడు పిల్లవాండ్రలోఁ బిల్లవాఁడును, విద్వాంసులలో విద్వాంసుండును, గాయకులలో శ్రేష్ఠ గాయకుండును, శూరులలో శూరుండును, వేదవిదులలో వేదవేత్తయును, సిద్ధులలో సిద్ధుండును, మునులలో మునియు, మహాత్ములలో మహాత్ముండును, ప్రౌఢులలోఁ బ్రౌఢుండును, పలుమాట లేల ? ఎటువంటి వారిముందట నటువంటి వాఁడగుచుండును.

దీనివలన నతనిస్వరూపమున కెట్టి హానియు గలుగదు. మఱియు నతని స్వరూపమును మారదు. దీనింబట్టి యతఁడు తన స్వరూపమందే యుండి మునులచెంగట మునియు, గుణులయెదుట గుణియుఁ, బండితులమ్రోలఁ బండితుండును, దీనులదరి దీనుండును, సుఖులలో సుఖియును, భోగులదగ్గఱ భోగియు మూర్ఖుల ముంగల మూర్ఖుండును, యువతుల చెంగట యువ

కుండును, వక్తలలో మంచి వక్తయు, అవధూతలలో నవధూతయును నగుచుండును, ఈ రీతిగా నుండు ముక్తపురుషుడు ముల్లోకంబులను జయించి ధన్యుండగుచున్నాడు. ఇదియే నిర్లిప్తత, అనగా, నన్నిపనులం జేసినప్పటికిని నేమియుం జేయనట్టి భావము గల్గియుండుటయే ముక్తపురుషునియొక్క గాని, పూర్ణపురుషునియొక్కవాని లక్షణము. శ్రీ కృష్ణచంద్రుండు పూర్ణ పురుషుడు. అందువలన నా మహామహునియందు పై లక్షణ ముండెను. శ్రీమద్భాగవతములో నిట్లున్నది.

"మల్లానా మశనిర్నృణాం నరవరః, స్త్రీణాం స్మరోమూర్తిమాన్
గోపానాం స్వజనోసతాంక్షితి భుజాం, శాస్తా స్వపిత్రోశ్శిశుః॥
మృత్యుర్భోజపతే ర్విరాడ విదుషాం, తత్వం పరం యోగినాం,
వృష్ణీనాం పరదేవ తేతి విదితో, రంగంగత స్సాగ్రజః॥

స్ఫటికమణివలెం బూర్ణముగా నిర్లిప్తుండగు శ్రీకృష్ణ భగవానుడు జెట్టులకు వజ్రశరీరుండగు జగజ్జెట్టియును, నరులకు నరవరుండును, స్త్రీలకు మూర్తీభవించిన మన్మథుండును, గోపకులకు స్వజనుండును, దుష్టరాజులకు శిక్షకుండును దలిదండ్రులకు బిడ్డయును, భోజరాజగు కంసునకు మృత్యువును, సగుణోపాసకులకు విరాట్టును. నిర్గుణోపాసకులగు యోగులకు నిరాకారుండగు పరమాత్మయును, యాదవ కులమునకుం బరమ దైవతమునునై యుండెను. ఇట్లే భగవంతుడొక్కడే యనేక రూపములతో భాసిల్లును. ఇదియే పూర్ణత్వమునకు లక్షణము.

పై భాగవతములోని వర్ణనమునుబట్టి చూడ గోపికలుగూడ శ్రీకృష్ణచంద్రుండు సామాన్యపురుషుండుగాక సాక్షాత్పరమేశ్వరుండని తెలిసికొనియుండునట్లే సిద్ధించుచున్నది. కనుకనే యా గోపికలింతకుముందు చెప్పినట్లు రాసక్రీడ, జలక్రీడ మున్నగు వానిని జేయుపట్టులను శ్రీకృష్ణునింగూర్చి విభూ! పరమాత్మా! పరమేశ్వరా! లోనగుపదములతో సంబోధించియున్నారు. ఇట్లు వారాతనిని సంబోధించుట పిచ్చిప్రేమతోఁగాక యథార్థ జ్ఞానముతోఁ జేసిరి. ఈజ్ఞానమున్నందున గోపికలాశ్రీకృష్ణుని బొందుటకు భక్తిశ్రద్ధాపూర్వకముగాఁ గాత్యాయినీవ్రత మనుష్ఠించిరి. ఈవిషయముపై విచారించినచో బ్రపంచమునందుఁ బురుషుఁడు దుర్బలుఁడనియు, గాముకుఁడనియుఁ దెలిసిన మీఁదటగూడ నతని కధీనయయ్యెడి స్త్రీగాని, మరియు నతనిని మంచి గొప్పగొప్ప పదములతో సంబోధించెడి స్త్రీ గాని యుండదని చెప్పవచ్చును. ఈవిషయము విషయలాలసులకు బాగుగాఁ దెలియును. స్త్రీజాతి యభిమానముగలదిగా నుండును. కాముకులగు పురుషులను దమవశమునందే యుంచుకొనుటయం దాసుందరీమణుల కానందము గల్గును. కేవలము జితేంద్రియులగు బురుషులదరిని జంకుదురు. జితేంద్రియులుకాని పురుషులను వీరు దమవశమందుంచుకొని విచ్చలవిడిగా సంచరించుచుందురు. దీనింబట్టి శ్రీకృష్ణున కేవిధమైన కామభావముండినచో గోపికలంతగా నతనిఁ బ్రశంసింపరు. రోదింపరు.

ప్రార్థింపరు. జీవునకును నీశ్వరునకును భేదముగలదు. యోగ దర్శనమం దిట్లున్నది.

"క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః"

ఈశ్వరుఁడు, అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము, అనెడి యీ యైదు క్లేశములనుండియు, గర్మము, కర్మఫలము, సంస్కారములనుండియు మించియుండును. ప్రకృతి కధీనుఁడై యుండఁడు. ఈశ్వరునకే మాయ యధీనమైయుండును. జీవుఁడే మాయకధీనుఁడైయుండును. దీనిఁబట్టి స్త్రీకి జీవుఁడధీనుఁడైయుండుట సంభవింపఁగలదు. ఈశ్వరుఁడు స్త్రీకి వశుఁడు గాఁజాలఁడు. ఈభావమే పాలసముద్రమునందు శయనించియున్న శ్రీ విష్ణుమూర్తి పాదములను బిసుకుచుండెడి శ్రీమహాలక్ష్మీదేవీమూలముగా వ్యక్తమగుచున్నది. ఇదియే రాసక్రీడద్వారమునగూడ స్పష్టపడుచున్నది. ఎట్లన, గోపికల కెంతమాత్రమేని యభిమానము (గర్వము) న్నట్లు తోచిన వెంటనే వారిని శ్రీకృష్ణుఁడు విడిచి యంతర్ధాన మయ్యెను. వారలలో గర్వములేని కొందఱు గోపికల కింక గొంచెముతడవు శ్రీకృష్ణునిదర్శనముగలుగుటకు వీలయ్యెను. కొంతతడవైనతరువాత వారును దమ్ము నందఱికంటె భాగ్యవతులనుగా నెంచుకొని గర్వముగలవారై శ్రీకృష్ణ భుజముపై నెక్కఁగోరిరి. అప్పుడు శ్రీకృష్ణుఁడాగోపికలకు దన భుజమునుమాత్రముఁజూపి యధఃప్రదేశమునుండి యంతర్ధాన

.మయ్యెను. దీనింబట్టి యీశ్రీకృష్ణుఁడీశ్వరుఁడనియు, మాయకధీనుఁడు గానివాఁడయినందువలన స్త్రీలకు లొంగియుండెడిపద్ధతి యతనిస్వరూపస్వభావములకు విరుద్ధమనియు, తెలియుచున్నది. ఈకృష్ణుఁడు వాస్తవముగా సామాన్యమానవుఁడే యైనచో నట్లొంటరిగా రాత్రిసమయమందు పరస్త్రీ లభించినచో మిక్కిలి మక్కువతో భుజముపైనెక్కించుకొని రాత్రియంతయు మహానందముతో దిరిగియుండును. కాని భగవంతుఁడిట్లు చేయఁడు. కృష్ణుఁడు భగవంతుఁడు గాబట్టియే యాగోపికలు దిట్టతనముఁజూపినతక్షణమే వారిని శిక్షించెను. ఇదంతయు నతని యీశ్వరభావలక్షణము.

ఇందుకొఱకే పరీక్షిన్మహారాజు రాసక్రీడావృత్తాంతమంతయు విని "మహర్షివరేణ్యా! ధర్మస్థాపనముకొఱకవతరించిన ఈశ్రీకృష్ణభగవానుఁడిట్లు పరస్త్రీలతో వర్తించుట న్యాయమగునా?" యని శుకమహర్షినిఁ బ్రశ్నించెను. అందులకా శుకదేవుడాశ్రీకృష్ణునియొక్క యథార్థరూపమును నచ్చజెప్పి సమస్త శంకలకును జక్కని సమాధానములనిచ్చి సంశయములఁ దీర్చి మందమతులగు కలియుగములోని జీవులకుగూడ సపూర్వములైన ధర్మము లిట్లుపదేశించెను.

"ధర్మవ్యతిక్రమోదృష్ట ఈశ్వరాణాంచ సాహసం
తేజీయసాం నదోషాయ వహ్నే స్సర్వభుజో యథా॥
నైతత్సమాచరేజాతు మనసాపి హ్యనీశ్వరః
వినశ్యత్యాఽఽచరన్మౌఢ్యా ద్యథా రుద్రోఽబ్ధిజం విషం॥

కుశలాచరితేనైషా మిహస్వార్థో నవిద్యతే
విపర్యయేనవాఽనర్థో నిరహంకారిణాం ప్రభో॥

కిముతాఖిల సత్త్వానాం, తిర్యఙ్మర్త్యదివౌకసాం
ఈశితు శ్చేశితవ్యానాం కుశలాఽకుశలాన్వయః॥

యత్పాదపంకజ పరాగ నిషేవతృప్తాః
యోగప్రభావ విధుతాఖిల కర్మబంధాః
స్వైరంచరంతి మునయోఽపి న సహ్యమానాః
తస్యేచ్ఛయాత్తవపుషః కుత ఏవ బంధః॥

గోపీనాం తత్పతీనాంచ సర్వేషా మేవదేహినాం
యోఽన్తశ్చరతిసోఽధ్యక్షః క్రీడనే నేహ దేహభాక్॥

అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాస్థితః
భజతే తాదృశీఃక్రీడా యాశ్శ్రుత్వా తత్పరో భవేత్॥

లోకమునం దేదిధర్మమో యీశ్వరునియం దాధర్మము యొక్క విపరీతము కన్పడును. కారణమేమనఁగా, యీశ్వరునియం దెక్కువగా శక్తి యుండుటంబట్టి సాహసముగూడ నెక్కువగా నుండుటయే. అగ్ని సమస్తపదార్థములను దగ్ధము జేయఁజాలినట్లు తేజస్సుగల పురుషులుగూడ లౌకికధర్మములకు విరుద్ధముగానుండు ధర్మమువలనఁగలుగు దెబ్బలను సహింపఁ గలరు. దీనింబట్టి యట్టి విరుద్ధ ధర్మాచరణమువలనఁ గలుగు దోషము తేజస్వులగువారి నంటఁజాలదు. ఎవఁడీశ్వరుఁడు గాఁడో అనఁగా జీవుఁడో యతనికిట్టి విరుద్ధాచారము మనస్సునంగూడఁ గలుగఁగూడదు. కలిగినచో నతనికి వినాశము

గల్గును. చూడుఁడు! శివుఁడు విషమును ద్రాగినప్పటికిగూడ నీల కంఠుఁడయ్యెను. కాని యా విషపానమే సాధారణమనుష్యుఁడు గావించినయెడల మృతిజెందును జీవునకు జీవత్వము అనఁగా, అంతఃకరణము, ఇంద్రియములు, స్థూలశరీరములతో బాటు జీవున కహంకార మమకారము లెంతవఱకుండునో యంత వఱకుఁ బ్రత్యేకమగు ధర్మముగాని యధర్మముగాని యాజీవుని నంటియుండును. ఇఁకేమన, ఏసమయమం దహం మమేతి భావములు విడిచినందువలన ఆత్మ, మనశ్శరీరములనుండి వేఱ గునో యాసమయమందు శుభముగాని యశుభముగాని కల్గిం చెడి యెట్టికర్మయుగూడ జీవుని స్పృశింపనేరదు. ఇందువలన శ్రీకృష్ణచంద్రుఁడు నిత్యుఁడు, ముక్తుఁడు, నగు సాక్షాత్పర మాత్మయును, స్థూల, సూక్ష్మ. కారణశరీరములతో నెట్టి మమత్వ సంబంధములు లేనివాఁడును నైయుండినప్పుడు మంచిని గాని చెడునుగాని గలిగించెడి యెట్టికర్మగూడ నామహాత్ముని నంటఁజాలదని తేలినది. ఏపరమేశ్వరుఁడు మనుష్యులందును, జంతువులందును, దేవతలందును, వేయేల! సమస్త ప్రాణుల యందును వ్యాపకుఁడును, సర్వప్రపంచములకుఁ బ్రభువును, ప్రార్థింపఁదగినవాఁడు నయ్యెనో యామహామహునకు మంచి చెడు లెట్లంటఁజాలును? ఎవని పాదారవిందముల ప్రభావముల వలన యోగులు కర్మబంధమునుండి విడువఁబడి ప్రపంచమును బవిత్రీకరించుచుఁ బర్యటనము జేయుచుండిరో, యెవఁడు నిరా

కాదుఁడో, యేమహానుభావుఁడు కేవలము మాయతో శరీరము ధరించెనో యాపరమాత్మకుఁ గర్మబంధన మెట్లు సంభవింపఁ గలదు? ఎవఁడు స్వయముగా బద్ధుఁడగునో వాఁడితరునిఁ గర్మ బంధనమునుండి యెట్లు విడిపింపఁగలఁడు? విడిపింపఁజాలఁడు. శాస్త్రమిట్లు చెప్పుచున్నది.

"స్వయ మసిద్ధః కథం పరాన్ సాధయతి"

తానే సిద్ధుఁడుగానపుడు పరుని సిద్ధునిగా నెట్లు చేయఁజాలును? శ్రీకృష్ణుఁడు సిద్ధుఁడుగాక బద్ధుఁడైయున్నయెడల నితరుని ముక్తునిజేయనేరఁడు. కాని వేలకొలఁది యోగులాశ్రీకృష్ణుని చరణకమలముల మహిమవలన ముక్తులైరి. దీనివలన శ్రీకృష్ణుఁడు బద్ధుఁడుగాఁడు. ఏలనన, భగవంతుఁడు గోపికాభర్తలందును, దదితర సర్వజీవులయందును, వ్యాపకుఁడైన సర్వాంతరాత్మగా నున్నప్పుడతనికి బంధనమెట్లు గల్గును? అతని శరీరధారణము కేవలము భక్తుల ననుగ్రహించుటకొఱకే యైయుండెను. ఎంత పర్యంతము పురుషుఁడు తన్ను భోక్తగను, స్త్రీ భోగ్యగను దలంచునో యంతపర్యంతము పురుషుఁడు స్త్రీకి బద్ధుఁడై యుండును. అనఁగా, ఎందాఁక స్త్రీ, పురుషునికంటె దాను వేఱుగను, బురుషుఁడు స్త్రీకంటె దాను భిన్నుఁడుగను దలంచునో యందాఁక వారికిఁ బరస్పరము భోగేచ్ఛ గలుగుచుండు నని యర్థము. ముక్తుఁడగు పురుషునకుఁ గామేచ్ఛ గలుగకుండు టకుఁ గారణమేమనగా, ఆముక్తునకు ద్వైతరూపాజ్ఞానము

నశించుటవలన నతఁడు స్త్రీపురుషుల నందరనుగూడ నద్వితీయ మగు బ్రహ్మరూపముగాఁ గనుచున్నాఁడు. అతనికి స్త్రీ యనెడి పురుషుఁడనెడి భేదదృష్టి నశించును. ఇందువలనఁ గామేచ్ఛ వేళ్ళతోఁగూఁడ నష్టమగును. శ్రీకృష్ణుఁడు గోపికల కంటెఁ దాను వేఱుగానున్నప్పు డతనియందు గామేచ్ఛ యుద యించును. ఇఁక శ్రీకృష్ణుఁడు పరమాత్మమైనప్పుడు గోపకులు నతఁడే, గోపికలు నతఁడే. పురుషుడునునతడే, స్త్రీయు గూడనతడే. స్వయముగా స్త్రీపురుషు లిరువురును దానే యైనప్పు డతనికి స్త్రీ-పఁందు గామేచ్ఛ యెట్లు గల్గజాలును? ఒక శ్రీకృష్ణుఁడే, రాసక్రీడఁ గావించెడిదినమున వేలకొలఁది బురుషులుగను. వేలకొలఁది స్త్రీలుగను నయ్యెనవెడివిషయ మీవఱకే చెప్పఁబడినది. ఇందువలననతనికి గోపికాస్త్రీలయం దెప్పుడుగూడఁ గామేచ్ఛ' గలుగఁజాలదు. ఎందులకనఁగా, కామేచ్ఛ తనకంటె భిన్నమైనదానియందే కలుగును. కాని తనకామేచ్ఛ తనయందే కలుగదుగదా. శ్వేతాశ్వతరోప నిషత్తులో నిట్లు చెప్పఁబడినది.

> "త్వం స్త్రీ, త్వం పుమానసిత్వం కుమార ఉతవా కుమారీ
> త్వం జీర్ణోదండేన వంచసి||

ఓభగవంతుఁడా! నీవేస్త్రీవి. నీవే పురుషుఁడవు. నీవే బాలుఁడవు. నీవే బాలికవు. మరియు నీవే వృద్ధుఁడవునునై చేతియందు దండముగొని వంచించుచున్నావు. అని యర్థము.

ఈప్రకారముగా బరమపురుషుఁడును, సర్వవ్యాపియును, సర్వాంతర్యామియు నగు శ్రీకృష్ణభగవంతుఁడే స్వయముగా గోపికలుగానుండి వేలకొలఁది రూపములను ధరించి భక్తులకు వారివారి యధికారముల ననుసరించి కోరికలఁదీర్చుచు వారందరియొక్క కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను దనయందు లయముగావించి వారికందఱకుఁ బరమానందమయమగు ముక్తిపదమునునిచ్చుచుండెను. అతనియం దెవరికామభావపరిభావముగూడ బ్రసరింపఁజాలదు. అతనియందును గామములేదు. ఇతరులయందలి కఠినమగు కామముగూడవచ్చి సముద్రములోనికి నదులువచ్చి కలిసిపోయినట్లు లయించి పోవును. ఇదియే శ్రీకృష్ణచంద్రుని స్వరూపము. ఈభావమునే యతఁడు శ్రీ భాగవతము దశమస్కంధము ౨౨ వ అధ్యాయములో గోపికావస్త్రాపహరణము గావింపఁబడినపిదప గోపికలు తన్నుఁగూర్చి పతిభావమును బొందుటగనుగొని వారితో నిట్లనెను.

"నమయ్యావేశితధియాం కామః కామాయకల్పతే
భర్జితాః క్వథితాఃధానాః ప్రాయోబీజాయ నేష్యతే ॥
యాతాఽబలా వ్రజంసిద్ధా మయేమారంస్యథక్షపాః
యదుద్దిశ్యవ్రతమిదంచేరు రార్యార్చనం సతీః ॥"

ఎవనిచిత్తము నాపై లగ్నముచేయబడునో, యవ్వానియొక్క నన్నుగూర్చిన కామభావముగూడ నొకసారివేయించిన

ధాన్యపుగింజలు తిరిగి యంకురింపనట్లు కామమును బుట్టింప జాలదు. ఇందువలన "నో గోపికలారా! మీ కాత్యాయనీవ్రతము సిద్ధించినది. నన్నుఁ బతిరూపముగా భావించి పొందుటకొఱ కేవ్రతము మీచే జేయబడినదో యది సంపూర్ణమైనది. మీరందరు నన్ను బతిరూపునిగాఁ బొందఁగలరు. కాని యందు గామబుద్ధిగలుగక కామములయించి ముక్తి గలుఁగగలదు."

## -◆◆ గోపికావస్త్రాపహరణ రహస్యము ◆◆-

వస్త్రాపహరణముయొక్క రహస్యమును గుర్తెరుగ జాలక చాలమంది వ్యర్థముగా ననేక సందేహములకు లోనై శ్రీకృష్ణచంద్రునిపై నానాప్రకారములుగాఁ గళంకముల నారో పించుటకుఁ బాల్పడుచుందురు. కాన నిద్దానితత్త్వముచూపఁ బడుచున్నది. చక్కఁగా విచారించిచూచినచో రాసక్రీడ గావిం చుటలో భగవంతుని పూర్ణావతారమెట్లు సిద్ధించి గోచరించి నదో యట్లే యీ గోపికావస్త్రాపహరణమువలనఁగూడ నా పరమాత్ముని పూర్ణావతారము ప్రమాణితమగుచున్నది. స్త్రీ పురుషులు కామభావముదయించినప్పుడే లజ్జయను రజ్జువుచే బద్ధులై వస్త్రధారణముజేయుట సర్వజన విదితమైయున్నది. కామభావమేమియు నెఱుంగనివాఁడగుటవలననే బాలకుఁడు సిగ్గుగాని, స్త్రీ పురుష స్వరూప భేదజ్ఞానముగాని లేక బట్టలను గట్టక విచ్చలవిడిఁ దిరుగుచున్నాఁడు. మఱియు నద్వితీయమగు

బ్రహ్మజ్ఞానమునుబొందిన పరమహంస, స్త్రీపురుష భేదబుద్ధియు గామవాసనయు నశించినందున దిగంబరుఁడై యుండును. ముక్త పురుషుఁడగు పరమహంసయొక్క వస్త్ర మప్రయత్నముగా స్వయముగానే విడిపోవును. అనఁగాఁ బరమాత్మయే యతని వస్త్రములను హరించునని యెఱుంగవలెను. అట్టి పరమహంస వృత్తి రాకుండనే యెవఁడైన నగ్నుఁడుగాఁ దిరిగినచో నట్టి వాఁడు నపాత్రీకృతుడగు సిగ్గులేనివాఁడనిమాత్రమే గ్రహింప వలెను. అట్టి బ్రహ్మజ్ఞానము బొందిన పరమహంసకును, నిట్టి సిగ్గులేనివానికిని నెట్టి సంబంధమును లేదు. దీనింబట్టి పరమ హంసకు వస్త్రాపహరణము స్వయముగానే యెప్పుడు జరుగ గలదని విచారింపవలసియున్నది. మనుష్యుఁడతనియందలి గామభావము పూర్తిగా నశించినప్పుడే పరమహంస గాఁగలడు. మఱియు సాధకుఁడు తన సాధనములద్వారా ప్రపంచమునందలి స్త్రీలందరును జగదంబ (కాత్యాయనీదేవి) గాను, సమస్త ప్రపంచమును బరమాత్మస్వరూపముగాను, దలంచి చూడఁజాలి నప్పుడే కామభావము పూర్తిగా నశింపఁగలదు. అప్పుడే యత నికి వస్త్రహరణము స్వయముగా సంభవింపఁగలదు. ఇట్టి మహాపురుషుఁడు స్త్రీ పురుషమయమగు నీ ప్రపంచమందున్నను నతనికి లజ్జగాని, కామభావముగాని యెంతమాత్రమేవిధమునఁ గూడ గల్గనేరదు. ఇఁక గోపికావస్త్రాపహరణ మేయవస్థలో సంభవించినదో విచారింతము.

గోపికల యాధ్యాత్మికమగు నవస్థయును బరమహంస మాదిరియైయుండెనని వివేకులకుఁ దెలియగలదు. ఏలనన, గోపికలు శ్రీకృష్ణచంద్రుని ప్రతిశరీరమందును నెల్లెడల బ్రకాశించుచున్నవానిగను నెల్లెడలవ్యాపించియున్నవానిగను, బరమపతిగను, బరాత్పరునిగను భావించి పతిరూపముగా బొందుటకై కాత్యాయనీవ్రతమాచరించి సిద్ధిలాభములను బొంది మాయామయం బగు నీప్రపంచమునుండి విడివడుటకుఁ గాంక్షించియుండిరి. ఇట్టి యవస్థలోనే వారి ప్రేతోద్యాపనస్నానమై యుండెను. ఈ యవస్థ తరుచుగా బరమహంసయవస్థయై యుండెను. ఏలనన, పరమహంసవలెనే పరమాత్మను దెలిసికొనుట, జగదంబా (కాత్యాయనీ) వ్రతమందు సిద్ధిబొందుట, యీరెండును వారికి బ్రాప్తించినవి. దీనింబట్టి సాధకుడు జ్ఞానసిద్ధిలాభమును బొంది పరమహంసగామారినపుడు భగవంతుఁడే యతని వస్త్రములను హరించి నగ్నునిగా నెట్లుచేయుచున్నాఁడో యట్లే గోపికలుగూడఁ బరమహంసపదవి నధిష్ఠింపఁబోవునప్పుడు వారి చీరల నపహరించుట భగవంతునకుఁ గర్తవ్యమైయున్నది. ఇట్లాతఁడొనరింపకపోయినచో నతనిని భగవంతుఁడని చెప్పుటకుగూడ వీలుండెడిదికాదు. ఎందులకనఁగా, పరమహంస యొక్కవస్త్రములను భగవంతుఁడు హరింపకపోయినయెడల నామహాత్మ్యుని యీశ్వరత్వమునందును, నంతర్యామిత్వమందును గళంకమాపాదించుట కెట్లు వీలగుచున్నదో యటులనే గోపికల

యొక్క వస్త్రములను శ్రీకృష్ణుఁ డపహరించనియెడల నతని యీశ్వరత్వమందును, నంతర్యామిత్వమందును గళంక మాపా దింప వీలగును. ఇదియే గోపికావస్త్రాపహరణమందలి రహ స్యము. ఇందు మరియొక విషయము విచారణీయాంశమైయున్నది. గోపిక లున్నతాధికారిణులైనప్పటిగూడ వారియం దభిమా నము, మమత, లోనగు కొన్నికొన్ని లోపములు కొంతవఱకున్నం దువలన నిప్పటికిని బరమహంసావస్థను బరిపూర్ణముగాఁ బొంద లేకపోయిరి. ఇందువలన నేప్రకారముగాఁ బరమహంస తన దశను బొందుటకుఁబూర్వమొక్కొక్కప్పుడు వస్త్రములను ధరిం చియు, నొక్కొక్కప్పుడు వస్త్రములనుధరింపక తిరుగుచుండునో యట్లే గోపికలవస్త్రములనుగూడ నపహరించి యా కృష్ణుఁడే మరల వారికి వస్త్రముల నిచ్చియుండెను. ఇట్లతఁడొనర్చుటకుఁ గారణమాగోపికలకింకను సిగ్గు కొంతయుండుటయే. మరియు గొంతసిగ్గు వారికుండుట యెప్పుడుసంభవించినదో యప్పుడు బూర్తిగా బట్టకట్టుకొనకుండనుండగూడదు. ఎందువలననన గా, అట్లొనర్చినయెడల దైవీప్రకృతికి భంగముగల్గి కాత్యాయనీ వ్రత భంగదోషము సంభవింపఁగలదు. ఇందులకు శ్రీకృష్ణుఁడు దన్నుఁ బతిగాఁగోరుభావమును గుర్తెరింగి వ్రతభంగ ప్రాయశ్చిత్త మైనతరువాత మీావ్రతము సిద్ధింపగలదనియు గారీవ్రతఫలము మీాకు లభించుననియు, చెప్పెను. అట్టిఫలమే శ్రీకృష్ణభగవానుని బతిరూపముగాఁబొంది భక్తిశాస్త్రాంతర్భూతమగు కాంతా

సక్తిద్వారా యానందకందుఁడగు సచ్చిదానందునియందు తను మనఃప్రాణములతోఁగూడ నాత్మను సమర్పించి బ్రహ్మానంద మనుభవించుటయే. కాని యిట్టి బ్రహ్మానందానుభవము నద్వైతియుఁ జ్ఞానసంపన్నుండును. నహంకార మమకార రహితుండును నగు పరమహంసకుమాత్రమే ప్రాప్తింపఁగలదు. గోపికలకభిమానము, లజ్జ, మున్నగునవి యుండుటవలన నిప్పటికిఁ గూడఁ బరమహంసభావము గొంత తక్కువగానే యుండెను. ఎందనుక లజ్జ లోనగు నెనిమిదిబంధనములు పోవో యందనుక సాధకుఁడు ముక్తిమార్గమందు బ్రవేశింపఁజాలడు. ఈ కారణము వలననే భక్తవత్సలుఁడగు శ్రీకృష్ణుఁడు బంధనములలోనికెల్ల మొదటిదగు లజ్జయను పాశమును ద్రెంచివేసి యప్పుడవ్వారిని ముక్తిమార్గమందు బ్రవేశింపఁజేసెను. అందువలన భక్తవత్సలుడగు భగవంతుఁడు వస్త్రాపహరణమం దేయేలోపములుండెనో రాసక్రీడయం దవియన్నియు బూర్తి గావించెను. అనఁగా, "క్లీం" యనెడి కామబీజముద్వారా గోపికలను సంసారమునుండి తొలఁగించి వైరాగ్యవతులఁ గావించెను. పిమ్మటఁ దా నంతర్ధానమై యనుతాపమనెడి నగ్నిచే వారి యభిమానమును భస్మముచేసి తొలుత నొక విగ్రహమునందు దర్శనమొసఁగి ప్రణిపాత, పరిప్రశ్న, సేవలవలన భక్తిజ్ఞానములనుబూర్ణముగా గల్గించెను. పిమ్మట వేలకొలది రూపములతో దర్శనమిచ్చెను. కాఁబట్టి గోపికలును, బరమహంసమాదిరిగా నెల్లెడలఁ బ్రకా

శించువాఁడును, ఆనందమయుఁడును, నగు భగవంతుని దను మనఃప్రాణాత్మలద్వారా పొంది రాసక్రీడలో వర్ణించినవిధ మున మనుష్యజీవనమును సఫలము గావించుకొనిరి. ఇదియే గోపికావస్త్రాపహరణ గూఢ రహస్యము.

-♦♦♦ శ్రీకృష్ణుఁడు పెరుగు వెన్నల దొంగయా? ♦♦♦-

ఈ శ్రీకృష్ణచంద్రునిపై కొందఱు మఱియొక దోషమాపా దింపఁజేయుచున్నారు. అదేదన! ఇతఁడు సామాన్యచోరుని తీరున గోపికల యిండ్లలోనుండి వెన్న, మీఁగడ లోనగువానిని దొంగిలించుకొనివచ్చెడివాఁడని. ఆమహామహుని స్వరూపమును గుర్తెరుఁగజాలనివారే యీ యపవాదమాతనిపైఁ బడవేయు దురు. శ్రీ భాగవతమం దెచ్చట నీకథ చిక్కుటయే లేదు. ఒక వేళ నితరగ్రంథమందెందైన నున్నచో దాని యుద్దేశము మఱి యొకటి యైయుండును. ఎందులకన, గోపికల గృహములలో నుండి వెన్న దొంగిలించుకొనిపోయెననెడివిషయ మెందు వ్రాయఁబడియున్నదో యందే యేగోపికయుగూడ నట్లు వెన్న దొంగిలించిన శ్రీకృష్ణుని వలదని నిషేధించియుండలేదనియు, అంతేగాక గోపికలెల్లరు శ్రీకృష్ణుఁడువచ్చి వెన్నను గైకొని పోవుగాకయని కోరుచుండిరనియు వ్రాయఁబడియున్నది. మఱియు బెరుగునుజిలుకుచు వెన్నఁదీయుసమయమునం దామెల్ల గోపిక లాశ్రీకృష్ణభగవానుని గుణగానమును జేయుచుండెడి

వారు. ఇట్లు పెరుగును జిలికినతరువాత నేయేవస్తువులు గలవో వానినన్నిటిని నాభగవంతునకు నివేదించెడివారు. చూడుఁడు, భాగవతము దశమస్కంధము.

"యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేంఖనార్భరుదితోక్షణమార్జనాదౌ
గాయన్తి చైన మను రక్తధి యోఽశ్రుకణ్ఠ్యో
ధన్యావ్రజస్త్రియ ఉరుక్రమ చిత్తయానాః ॥

భగవంతునిపై ననురక్తిగల గోపికలు ధన్యులు. వారు దధిని మథించునపుడును, వెన్నదీయు సమయమందును, దన్మథన ధ్వనితోఁబాటు ప్రేమనిర్భరములగు పలుకులతోఁ గలుపుచు నశ్రుకంఠలై భగవంతుని మధురగుణములను పాడుచుండిరి. వారి సకలకర్మలు, సమస్తప్రాణములు, యావత్తు మనస్సును భగవంతునిం బ్రేమించుటయందే నిమగ్నములైనవి. వారు తమ సర్వస్వమును భగవంతుని పాదారవింద సన్నిధిని సమర్పించి యుండిరి. ఇట్లుచేసిన గోపిక లేదో కొంచెము వెన్న యిచ్చుటయు నొక గొప్పవిషయమా? ఏమి! దీనింబట్టి గోపికల యిండ్లలోనుండి వెన్న దెచ్చుట దొంగిలించుట గానేరదు. దొంగ యితరులపదార్థములను వారి కిష్టములేకుండగనే దొంగిలించును. ఆవస్తువులుగలవారి యిచ్ఛననుసరించి తెచ్చుకొనినచో నది దొంగతనమనఁబడదు. ఇప్పుడొక ప్రశ్న యుదయింపవచ్చును. ఏదనగా, శ్రీకృష్ణుఁడు తన తల్లియగు యశోదయింటిలోఁ

గావలసినంత పాలు, పెరుగు, వెన్న, యుండగాఁ బరుల యిండ్లలోనుండి యవి యెత్తుకొనివచ్చుటకుఁ గారణమేమి? అని. ఇందులకు మొదటిసమాధానమేమన, గోపికలు భక్తితోఁ దమ సర్వస్వమును సమర్పించినపుడద్దానిని గ్రహించుట భక్త వత్సలుండగు భగవానునకు విధియైయున్నది. రెండవ సమాధానమేమన, తన తల్లి యింటిలో నుండు వస్తువులనన్నిఁటిని విడిచిపెట్టి ప్రపంచమందలి యితరులపదార్థములను గైకొని ప్రపంచమును దృప్తిపరచుటయే భగవంతునకు లక్ష్యమై యున్నది. శాస్త్రములందీరీతిగా నుడువఁబడినది.

"తస్మిన్తుష్టే జగత్తుష్టం ప్రీణితే ప్రీణితం జగత్" ॥

సమస్తబ్రహ్మాండములు నిండియున్న విరాట్పురుషుని యొక్క యుదరము నిండినయెడల యావత్తుబ్రహ్మాండములకు దృప్తియగును. ఈవిషయము శ్రీ మహాభారతమందుఁగూడ జక్కఁగా బోధింపఁబడియున్నది. ఒకప్పుడు శిష్యసమేతుండగు దుర్వాసుండను మహామునీంద్రుండు దుర్యోధనచక్రవర్తికి అతిధిగానుండెను. అప్పుడామహారాజామునీంద్రునకు సగౌరవముగా భోజనమిడి తృప్తిపరచి "ఓ ఋషిపుంగవా! యీప్రకారము గానే ప్రస్తుతమున వనవాసముగావించు పంచపాండవులును ద్రౌపదియు భుజించినతరువాత వారి గృహమునకుబోయి శిష్యులతోఁగూడ మీరు వారికతిధులుగా నుండు"డని వరమడి

గెను. అందులకాదుర్వాసుఁడంగీకరించి శిష్యసమేతముగాఁ బంచపాండవులును ద్రౌపదియు భుజించినపిమ్మటనే చేరి వారి కతిథిగానుండెను. అప్పుడు ద్రౌపది తనయింట భోజనపాత్రి మం దన్నమున్న దేమో యని చూచెను. గాని లేకపోయెను. అంతఁ బంచపాండవులును. ద్రౌపదియు నేమిచేతుమా దుర్వాసుడు శాపమిచ్చునేమోయని మిక్కిలి భయపడుచుండిరి. ఎంత యోజించినను నుపాయముదోఁచక తుట్టతుదకు ద్రౌపదీదేవి శ్రీకృష్ణునింగూర్చి యిట్లు స్తుతించెను. ఇట్టి భావమునే కైకొని శ్రీమద్భాగవతమందుఁగూడ నిట్లు చెప్పఁబడినది.

"యోనోజుగోప వనమేత్య దురన్తకృచ్ఛ్రాత్
దుర్వాససోఽరిరచితాదయుతాగ్రిభుగ్యః
శాఖాన్నశిష్టముపభుజ్య యతస్త్రిలోకీం
తృప్తామమంస్త సవిలేవినిమగ్నసంఘః."

దుర్యోధనుని యీదౌష్ట్యము వలన బదివేలమంది శిష్యులతోఁగూడి దుర్వాసోమహర్షి పాండవ శిబిరమునకు వచ్చి యతిథిగానుండెను. కాని సూర్యునిచే నొసంగబడిన పాత్రిమందన్న మెంతమాత్రిమును లేకుండెను. అప్పుడేమి చేయుటకుఁ దోచక ద్రౌపదీదేవి భగవంతుని స్మరించెను. ఆమెమొఱవిని వెంటనే శ్రీకృష్ణుఁడు సరసనున్న రుక్మిణీదేవిని విడిచి ద్రౌపదికడకుఁజేరి యన్నముబెట్టుమని యడిగెను. ఈమాటవిని ద్రౌపదీదేవి మరింత యధికముగానేడ్చి, శ్రీకృష్ణా!

నాభోజనముగూడనయినది. సూర్యదత్తమగు నాపాత్రిమందు గొంచెముగూడ నన్నము లేదనిచెప్పెను. ఇట్లు చెప్పినప్పటికిని శ్రీకృష్ణుఁడా స్థాలిని దెప్పించి పరిశోధించిచూడగా దాని కొనకతుకు కొనియున్న యొక కూరముక్కనే తిని యిట్లనెను.

" అనేన విశ్వాత్మా భగవాన్ప్రీయతాం"

నేనే విశ్వరూపుఁడనైనచో నా యీ భోజనముచే విశ్వాత్ముండగు భగవంతుండు తృప్తిపడుగాక. దీనివలన, బ్రిపంచమంతయు సంతుష్టి జెందుగాక, ఆ మహాత్ముండిట్లు భుజించి వచించినతరువాత సమస్త ప్రపంచము యొక్క యాకలిమంట చల్లారిపోయెను. దీనివలన స్నానము జేయుటకై పోయిన శిష్య యుతుండగు దుర్వాసుండు వచ్చి భోజనమొన ర్పకుండనే సంతృప్తిజెంది వెడలిపోయెను. గోపికలనుండి వెన్న దీసికొనుటకుఁగూడ నీయుద్దేశ్యమే. యశోదయింటిలోఁ గావలసి నంత వెన్న యున్నప్పటఁగూడ నచట నది దినక పరుల గృహ ములందున్న వెన్నను దినుటకుఁ గారణమిాచెప్పఁ బోవునదియే రుక్మిణీదేవియింటిలో భుజించినచో నామెకుమాత్రిమే కల్యా ణమగును. కాని జగత్తునకుఁ గలుగదు. ఎందులకనఁగా తమ కొఱకై యేకర్మచేయఁబడునో దాని ఫలాఫలములు తమకుమా త్రిమే సంక్రమించును. యేకర్మ జగత్తునకంతకు సంబంధింపఁ జేసి యొనర్పఁబడునో దాని శుభాశుభములు జగత్తునకు సంక్రి

మించును. ఈ కారణమువలన ద్రౌపది యింటిలో నతఁడు భుజించినందున జగత్తంతయు సంతుష్టిపడెను. రుక్మిణీ గృహమందు దిన్నయెడల దృష్టిగాలేదు. సరిగా నా ప్రకారమే కృష్ణుఁడు తన తల్లి యశోదయింటిలోని వెన్నఁదిన్నచో నచటనుండువారెల్లరాత్మీయులగుటఁబట్టివారికిమాత్రమే మేలుగలుగగలదు. కాని సర్వలోకములకుఁగానేరదు. శ్రీ కృష్ణుఁడు భగవంతుని పూర్ణావతారమైనప్పుడతని మహిమ యిట్లు గాఁగినది. అదేదన ఎంతవఱకు బ్రపంచమందు శ్రీకృష్ణుఁడుండునో యంతవఱ కేప్రాణియు క్షుధతో నుండగూడదు. సర్వులకు మేలును సంతుష్టియుఁ గలుగుచుండవలెను. శ్రీకృష్ణుఁడు భక్తులగు పరులయిండ్లలో నుండి వెన్న దిన్నప్పుడే ప్రపంచమందంతట సంతుష్టియు గల్యాణము గల్గుట సంభవమైయుండును. ఈ కారణమువలనఁ గృష్ణుఁడు యశోదయింటిలో గావలసినంత వెన్నయున్నను దినక గోపికలద్వారా యిచ్చినవెన్నను గైకొని తినుచుండెను. నవనీతలీలలోని రహస్యమిదియే.

-*) శ్రీకృష్ణుఁడు నల్లగానుండుటకుఁ గారణమేమి? (*-

అవతారముయొక్క విజ్ఞానముపై మననము చేసినయెడల నతఁడు పూర్ణావతారుఁడగుట వలననే నల్లనివాఁడయ్యెనని సిద్ధాంతమగుచున్నది. ఎందులకన నిరాకారుడగుభగవంతుడు పూర్ణావతారముగా పుట్టుట మాయవలననేయని శాస్త్ర సిద్ధాంతము భాగవతమునందు.

"కృష్ణ మేనమ వేహిత్వ మాత్మానమఖిలాత్మనాం
జగద్ధితాయ సోప్యత్ర. దేహీవాభాతి మాయయా"

శ్రీకృష్ణుఁడు జగత్తును వ్యాపించినవాఁడును, నిరాకారుండును నగు పరమాత్మ. కేవలము విశ్వ కళ్యాణముకొఱకై మాయ నాశ్రయించుకొని దేహిమాదిరిగా గనుపడుచున్నాడు. వాస్తవము విచారించినచో సచ్చిదానందుఁడై యున్నాఁడు. ఆత్మప్రకృతులు ప్రపంచమందు ప్రకటించు లక్షణమేమనగా జీవునకున్నతిఁ గల్గినకొలఁది ప్రాకృతిక ప్రభావము దగ్గుచు ఆత్మప్రభావ మతిశయించుచుండును. ఆత్మప్రభావము సంపూర్ణముగా గల్గిన పిమ్మటఁ బ్రాకృతిక ప్రభావము లోనఁబరిపూర్ణముగా నశింపగలదు. దాను బాహ్యామునందు జూడబడ్డది స్థూలశరీరమునందుమాత్రమే గోచరింపగలదు. దాన స్థూలశరీరము కనపడుచుండును. శ్రీకృష్ణభగవానుఁడు పూర్ణాత్మయగుటంబట్టి యతనిలోపల సత్తు, చిత్తు, ఆనందములు సంపూర్ణముగా నుండెననియు గేవలము వెలుపలమాత్రము మాయద్వారా యతనిరూపము చూపఱకందఱకును గోచరించుచుండెననియు దేలినది. కాని పూర్ణపురుషుండగుటంబట్టి మాయావరిభావమెంతమాత్రమును లేదు. కాని కేవలమురూపమును జూచుటకుమాత్రమే యేనుఁగకొట్టబడిన మాయాసత్తపైన యున్నది. ఇప్పుడణఁగఁగొట్టబడిన మాయాయందు కృష్ణవర్ణమెట్లు వచ్చెనను విషయము విచారణీయాంశము దృశ్యమగు యావత్తు ప్రపంచము మాయాస్వరూపమే. అప్పుడా

ప్రపంచములోని సమస్తవర్ణములుగూడ మాయవలననే పుట్టి నవి. ఇందు సందేహమేమియు లేదు. ఈ సమస్తవర్ణముల లోను సూర్యకిరణములనుండి బయలుదేరెడి ఏడు రంగులుగా విభజింపబడినవి. ఎచట నేడురంగులు పూర్తిగా ప్రకాశించునో యచట సూర్యకిరణములమాదిరి తెల్లని రంగు యుండును. ఇతరవర్ణముల విషయమేమనగ, ఏ వస్తువునుండి యేడురంగుల లోని యేరంగు బయలుదేరుచున్నదో యా వస్తు వారంగు లోనే కన్పడుచుండును. ఎట్లన ఎఱ్ఱనిపూవులో యెఱ్ఱనిరంగే ప్రకటమగును ఇతర వర్ణము లందులోనే దాగియుండును. నీలపుష్పములో నీలపురంగే కన్పడును. వేరు రంగులా వస్తువులలోనే నిమిడియున్నవి. ఏ పదార్థ మెల్లరంగు లను ప్రకటించునో నది తెల్లని [సఫేద్] రంగుగా నుండును. పదార్థము ప్రాకృతికములగు రంగులన్నిటిని లోన నిమిడ్చి కొనియున్నది. దాని రంగు నలుపుగానుండును. దీనింబట్టి తేలిన సిద్ధాంతమేమనగా, దేనియందు ప్రకృతి యున్నప్పటికి పూర్తి గానణగియుండునో దానియందు కృష్ణవర్ణమున్నదనియు, దేని యందుఁ ప్రకృతియుండి సంపూర్ణముగాఁ బ్రకటమగుచుండునో యందు గౌరవర్ణమునుగలదు.

శ్రీ కృష్ణభగవానునియందు ప్రకృతి యున్నప్పటికి నతఁడు పూర్ణముగా సచ్చిదానంద స్వరూపుండైనందున బూర్తిగా నణఁగియున్నది. ప్రపంచమునందు బ్రకటమగుటకు మాత్రమే పై పైన మాయగలదు. ఆమాయయుఁ బూర్తిగా నణఁగి యున్నది. రాధాదేవి ప్రకృతిరూపిణియైనందున నామెయందు

ప్రకృతి సంపూర్ణముగా ప్రకటమగుచున్నది. ఇందువలన శ్రీకృష్ణుఁడు కృష్ణవర్ణముతోడను, రాధ గౌరవర్ణముతోడను విరాజిల్లిరి. ఈ విజ్ఞానము యోగశాస్త్రము ననుసరించియు సిద్ధించును. ఎట్లనగా:లయయోగములోఁగుల కుండలినీశక్తికి జాగ్రత్త కలిగినవెంటనే యొక బిందుదర్శనము యోగికిఁ గాఁగలదు. అది లోపల స్వచ్ఛముగను, వెలుపల నలుపుగ నుండును. లయ యోగముయొక్క యీ బిందువు ప్రకృతిపురుషాత్మకము. అనఁగా ఆ బిందువు లోపలఁ బూర్ణపురుషుని జ్యోతిస్సును వెలుపల ప్రకృతియొక్క జ్యోతిస్సును నుండును, ఈ వెలుపలనుండు వెలుగే ప్రకృతిది యైనందున నల్లరంగుగా నున్నది. ఈ భావమే శ్రీకృష్ణుని రూపమందును గ్రహింపవలెను. దీని వలన శ్రీకృష్ణుఁడు నల్లనివాఁడయ్యెను. ఇదిగాక యోగి ప్రకృతియొక్క స్థూలరాజ్యమునుండి సూక్ష్మరాజ్యములోనికి బోవుచుఁ బోవుచుఁ బూర్ణప్రకృతియొక్క స్వతంత్రరూపమును జూడఁగలఁడు ఇద్దానిరంగు శుద్ధశ్వేతమై యుండును. ఇది రాధయొక్క రూపమని యెఱుంగవలెను.

బ్రహ్మమునందు మూడుభావములు పూర్ణములై యుండుటవలనఁ బ్రపంచములోని సమస్త వస్తువులందును మూడుభావములు నిండియున్నవని ఇదివరకే చెప్పఁబడినది. ఈ మూడును, అధ్యాత్మము, అధిదైవము, అధిభూతముల నెడి భావములు: జీవునకుఁ బూర్ణత్వము శరీరము, మనస్సు, బుద్ధి పరిశుద్ధము లైనప్పుడా త్రిభావపూర్ణత్వమువలన కలుగఁగలదు. మనుష్యులలోఁగూడ నొక్కొక్క వర్ణమునకు బూర్ణత్వము,

త్రివిధములైన పూర్ణత్వమువలన నగుచుండును. ఎట్లన, ఆధ్యాత్మిక భావమునందును, అధిదైవిక భావమునందును, ఆదిభౌతిక భావమునందును బ్రాహ్మణుడుగా నెప్పుడుండునో యప్పుడే యతఁడు బూర్ణబ్రాహ్మణుఁడు కాఁగలఁడు. అనగా జ్ఞానమునందును బ్రాహ్మణుఁడై యుండవలె, కర్మాచరణమందును బ్రాహ్మణుఁడై యుండవలె. జన్మమందును బ్రాహ్మణుఁడై యుండవలెనని యెరుఁగవలెను. ఇట్లే క్షత్రియాది వర్ణముల విషయమై గ్రహింపవలెను. ఇంక నిందలి రహస్యములు మరి యొకసారి చెప్పఁబడును. ఈ సిద్ధాంతము ననుసరించి ఆధ్యాత్మిక పూర్ణత్వము, ఆధిదైవికపూర్ణత్వము, ఆదిభౌతిక పూర్ణత్వము అనఁగా శరీరపూర్ణత్వము, శక్తిపూర్ణత్వము, జ్ఞానపూర్ణత్వము ఎవనియందుండునో యతఁడు పూర్ణావతారుడు. ఈ త్రివిధపూర్ణత్వములు శ్రీకృష్ణ చంద్రునియందు స్పష్టముగా దెలియుచున్నవి.

-*) శ్రీకృష్ణుని యాధిభౌతికశక్తి పూర్ణత్వము (*-

స్థూల ప్రకృతి (శరీరము) యొక్క పూర్ణత్వ మగుట కెన్ని గుణములుండవలయునోయవి యన్నియు శ్రీకృష్ణునియందున్నవి. స్థూలప్రకృతికిఁ బూర్ణత్వముండిననే సంపూర్ణమగు సౌందర్యము, బ్రహ్మచర్యము మున్నగునవి యుండును. అంగవైకల్యముగాని యంగహీనతగాని యెట్టి దుర్బలతగాని యుండగూడదు. ఈ సౌందర్యాదులన్నియు శ్రీకృష్ణునియందు సంపూ

ర్ణముగా నున్నవి అతని సౌందర్యమునకు సాటిగూడఁగలదా? ఇట్టి సుందరపురుషుఁడుపుట్టియుండలేదు. పుట్టుటలేదు. పుట్టఁడు ఇతని సౌందర్యమువలనఁ బ్రపంచమంతయు ముగ్ధమగు చున్నది. ఇతని రూపలావణ్య సముద్రమునందు జిత్తము ముంచి సాధకుఁడు ప్రపంచములోని సమస్త రసములను మరచు చున్నాడు. ప్రకృతిమాత తనకోశము ( ఖజానా ) లో నున్న సౌందర్యము నంతను గైకొని యొకనియందే నింపినట్లుగా నున్నది. శ్రీ కృష్ణుని యంగములును, బ్రత్యంగములును బూర్ణ త్వము గలిగియున్నవి. ఎట్టి వైకల్యమును లేదు.

## -*) శ్రీకృష్ణుడు బ్రహ్మచారి (*-

ఇఁక శ్రీకృష్ణుని బ్రహ్మచర్య విషయమును గూర్చి యేమి చెప్పగలము? వేలకొలఁది పరస్త్రీల నడుమ నుండియు శ్రీకృష్ణుడు మన్మధునింగూడ మోహింప జేయువాఁడును, తను మనోబుద్ధులను మించిన ఆత్మయందు రమించువాఁడును తనయందే వీర్యమును స్తంభింపజేసికొనువాడును, యోగేశ్వరులకు గూడా నీశ్వరుండునునై విరాజిల్లెనుగదా. మనుష్యులబుద్ధి సాధా రణముగు కామాసక్తివలననే వ్యాకులమగును. చిత్తమునకు చాంచల్యము కలుగును. మరియు ఏకాంతమందు బరస్త్రీవచ్చి ప్రార్థించిన యెడల నాదశ ఏమని చెప్పగలము. కాని వేలకొలది గానున్న పరస్త్రీ ప్రక్కను దనస్వరూపమును మరువక స్థితి ప్రజ్ఞ నిలువఁజాలియుండిన శ్రీకృష్ణభగవంతుని బ్రహ్మచర్యము

యొక్క పూర్ణత్వశక్తి విదితమగుచున్నది. ఇదియేయతని స్థూల శరీర పూర్ణత (అనఁగా నాధిభౌతికపూర్ణత) లక్షణము.

-*) శ్రీకృష్ణుని యాధిదైవికశక్తి పూర్ణత్వము (*-

శ్రీమద్భాగవతమును జదివిన వారికా మహాత్మునియందున్న దైవీశక్తి పూర్ణత మెట్టిదైనది విదితమగును. అతడు బాల్యమందెంతెంత యమానుషపు పనులఁ గావించెనో చూడుఁడు. పూతనావధ, శకటాసురవధ. కాలియ మర్దనము. గోవర్ధనోద్ధారణము మున్నగునవి. ఈ పనులన్నిటివలనను నాతనిశక్తి పూర్ణత్వము సువ్యక్తమగుచున్నది. అజ్ఞానులగు జనులు శ్రీకృష్ణ భగవంతుని స్వరూప మెఱుంగఁ జాలక యీ పైకార్యములందనేక విధములుగా సందేహములం బొందుచున్నారు. ఇందు గొందఱీ యలౌకిక లీల లన్నిటిని నెగురగొట్టివేసి మరియొక రకముగా నర్థముజేయుచున్నారు. ఇదంతయు నజ్ఞానమువలన గలిగినఫలమే. ఏయేదైవీశక్తుల ప్రతాపముచేఁ బ్రపంచచక్రము దిరుగుచున్నదో, యేశక్తి ప్రతిపదార్థమందును దూరి సమస్త ప్రపంచమును సంరక్షించుచున్నదో యది భగవంతునిశక్తియే. అవతారమనునది యాశక్తియొక్క స్థూలకేంద్రము వలని వికాసమని తెలిసికొనవలెను. ప్రకృతి ధర్మమును, దైవకార్యములను రక్షించుటకొరకు అక్కరనుబట్టి యొకప్పు డంశరూపముతోడను, మరియొకప్పుడు పూర్ణరూపము

తోడను నొకానొక కేంద్రముద్వారా యుద్భవించి యాశక్తి ప్రపంచరక్షణమును జేసి ధర్మమార్గమును జక్కజేయును. శ్రీకృష్ణుడు పూర్ణావతారుడైనప్పుడు, వానియందు భగవంతుని పూర్ణశక్తి యున్నప్పుడు, నొక గుట్ట నెత్తుట, యొక పామును గొట్టుట, యీ మొదలగు పనులొక లెక్కలోనివా! అవిగూడ గొప్పపనులా ? ఆ భగవచ్ఛక్తివలన వేలకొలంది పర్వతములు ననంతములైన నక్షత్రములు, గ్రహములు, ఉపగ్రహములు, సూర్యుడు, చంద్రుడు, మొదలగునవి నిరాధారముగా నాకాశమునందు వ్రేలాడుచున్నవి. మఱియు వేలకొలంది క్రూరజంతువులు గొట్టబడుచున్నవి. చంపబడుచున్నవి. ఇట్టిశక్తికొక చిన్న గుట్ట నెత్తుట, యొక పామును గొట్టుట, యేయిరువురనో నల్వురనో రాక్షసులను జంపుట యివి గొప్పవిషయములు గావు. అవి యన్నియు భగవంతుని వ్యాపకశక్తిచేత నగుచుండును. ఈకార్యములు లావ్యాపకశక్తియొక్కయే కేంద్రస్థానమునుండియో ప్రకటమగుటవలన నెరవేరును. ఇందెట్టి యనుపపత్తికూడలేదు. కేవల మజ్ఞానులగు జనులకది బోధపడకపోవుటయను దోషమే యొక కారణము. నిజము విచారించినయెడల శ్రీకృష్ణుని జీవితమంతయు నలౌకికకార్యములతో నిండియున్నది. అందు దైవీశక్తి సంపూర్ణముగా గోచరించుచుండును

-*)శ్రీకృష్ణుని యాధ్యాత్మికశక్తి పూర్ణత్వము(*-

శ్రీకృష్ణునియొక్క మూడవదియగు ఆధ్యాత్మిక (జ్ఞాన) పూర్ణత్వము దెలిసికొనవలసియున్నది. ఇది భగవద్గీతను బాగుగా బఠించినవారికిఁ దెల్లమగును. శ్రీకృష్ణభగవానుఁ డర్జునునకు గీతల నుపదేశించెను గీతయందుపూర్తిగా సమాధి భాషగలదు. ఇందు సర్వోపదేశములయొక్క జ్ఞానము నిండియున్నది. ఇట్టి జ్ఞానమయమగు సమాధిభాషను బూర్ణజ్ఞానియగు మహాత్ముఁడు దప్ప మరియొకఁడు చెప్పఁజాలఁడు. ఎందులకన, సమాధిభాషను సమాధియందున్న పురుషుఁడే పలుకఁగలఁడు కాని యన్యుఁడు పలుకఁజాలఁడు.

-)* గీతా పూర్ణత్వము *(-

మరియు రెండవకారణ మేదన, గీత, పరిపూర్ణమైనదగుటచేత భగవద్వాక్యమని చెప్పనగును. ఇది పూర్ణవస్తువని యీవరకే దివ్యవాణీ సుకృతిప్రాసాద ప్రథమ సుకృతియగు వేద వేదాంగ చంద్రికయందు సిద్ధాంతీకరింపఁబడినది. ఇందు జీవునకుఁ బూర్ణత్వము గలుగు విధానము సంపూర్ణముగా నుపదేశింపఁబడినది. జీవునకుఁ బూర్ణత్వము త్రిభావములయొక్క పూర్ణత ద్వారా కలుగను. ఆమూడు భావములలో శరీరము ఆధిభౌతిక భావమనియు, మనస్సు, ఆధిదైవిక భావమనియు, బుద్ధి యాధ్యాత్మిక భావమనియు దెలియనగును. ఈ శరీరమనో

బుద్ధులనెడి మూటియొక్క పూర్ణత్వమువలననే సాధకుఁడు పూర్ణ బ్రహ్మరూపమును బొందఁగలఁడు. కర్మవలన శరీరమునకు, ఉపాసననువలన మనస్సునకును, జ్ఞానమువలన బుద్ధికిని బూర్ణత్వము గల్గును. దీనింబట్టి యే గ్రంథమందు కర్మ, ఉపాసన, జ్ఞానములనెడి ఈ మూడును సంపూర్ణముగాఁ జెప్పఁబడియుండునో యదియే పూర్ణగ్రంథమనియు, భగవంతుఁడు పూర్ణుఁడైనందువలన నదియే భగవద్వాక్యమనియు, దెలియుచున్నది. వేదమునందు కర్మకాండము, ఉపాసనాకాండము జ్ఞానకాండము జీవుల నుద్ధరించుటకై విశదముగా వర్ణింపబడియున్నవి. అందువలన వేదము భగవద్వాక్యము. ఈ గీతయందుగూడ బదునెనిమిది యధ్యాయములలో కర్మోపాసనా జ్ఞాన కాండములు వర్ణింపఁబడినవి. ఈ యధ్యాయములన్నింటియందును నన్నిరకముల పలుకులున్నను ముఖ్యముగా మొదటి యా అధ్యాయములలో కర్మవిషయమును, దర్వాతి యా అధ్యాయములలో ఉపాసనా విషయమును, దాని తరువాతి యా అధ్యాయములలో జ్ఞాన విషయమును జెప్పఁబడినది. ఇందువలన గీత పూర్ణము. పూర్ణత్వమున కొక లక్షణమున్నది. దేనియందొక సాంప్రదాయిక భావము లేక నిష్పక్షమగు సార్వభౌమునగు భావముండునో యది పూర్ణత్వ లక్షణము. ఋషుల బుద్ధికిని, సాంప్రదాయకుల బుద్ధికిని నిదియే వ్యత్యాసము. ఋషివర్యులబుద్ధి పూర్ణమగుటవలన దానియందు

సాంప్రదాయికమగు పక్షపాతము లేదు. ఒక భావమును ముఖ్యముగాఁ దీసికొని గౌరవించుచుఁ దదితర భావములను నిందించు పద్ధతియుండదు. వేదవ్యాసులవారు పూర్ణమనీందుడ్రిం డైనందువలన దాను వ్రాసిన భిన్న భిన్న పురాణములందు నశేషవిషయములను వచించియుండిరి. కాని సాంప్రదాయికుల వలె నొకదానిని ముఖ్యముగాను, మరియొకదానిని నముఖ్యముగాను దలఁచి వర్ణించి యుండుటగాని, నిందించి యుండుటగాని, చేసియుండలేదు. భరతవర్షమం దెప్పటినుండి యిట్టి సాంప్రదాయిక మతములు బైలుదేరెనో యప్పటినుండి మన పుణ్యభూమియం దశాంతి, మతభేదములు పొడసూపినవి. మరియు జనులలో బరస్పర నిందయు, నసూయయు జనించినవి. క్రమముగా ధర్మమను పేర నధర్మము ప్రబలఁ దొడంగెను కాని గీతయందు మాత్రమిట్టి దెంతమాత్రము నుండదు ఎందులకన, గీత భగవంతుని ముఖారవిందమునుండివచ్చిన యమృతమయమగుపూర్ణ గ్రంథము. ఇందువలన నది నానావిధములుగానుండు అధికారుల కందఱకును సమానముగా గల్యాణము జేకూర్చునది యని తేలగలదు. దీనియందుఁ గర్మిష్ఠులకొఱకు నిష్కామకర్మయొక్క యుదారభావమును భక్తులకొఱకు భక్తిసారస్యమును జ్ఞానుల కొఱకు పారమార్థిక జ్ఞానమందలి గంభీరతత్త్వము నొక్క దానిలోనే సామంజస్యముగా నిండియున్నది. గీతను జక్కగాఁ బఠించిన సమస్త మతస్థులును సంతుష్టి జెందుచున్నారు. గీత

సకలదేశములందును సర్వధర్మములందును ప్రతిష్ఠ జెందుచున్నది శ్రీకృష్ణుఁడు పూర్ణావతారుఁడు గాకపోయినయెడల గీతవంటి విజ్ఞానశాస్త్రమును జెప్పుటకెప్పుడును వీలుండెడిదిగాదు. గీతము యొక్కమరియొక పూర్ణత్వమేమనగా భక్తినిగూర్చి యాఅధ్యాయములు గీతాగ్రంధమునకు మధ్యభాగమునఁ గూర్పబడియున్నవి. ఇట్లుండుటవలన, కర్మమిశ్రితమగు భక్తి కేవలశుద్ధభక్తి, జ్ఞానమిశ్రయగుభక్తి, యీ మూడు విధములుగా నుండుభక్తి, సర్వవిధాధికారులకు కల్యాణము జేకూర్చునదియైయున్నది. మరియు నది సకలసాధనములకు ప్రాణమైయున్నది. కర్మిష్ఠులుగా నిందు జ్ఞానులుగానిందు. ఎవరికైనను భక్తిశూన్యమైనచో నాకర్మజ్ఞానములు రెండును బంధనరూపముగా మారవచ్చును భక్తిలేని కర్మడంబమును, కర్తృత్వాభిమానమును గల్గించునదియునగుచు. కాని కార్మికులు దమ్ము భగవంతునకు నిమిత్తమాత్రులుగాఁ దలఁచికొని జగత్సేవయే భగవత్సేవయని నిశ్చయించుకొని భక్తిభరితులై కర్మగావించినచో దానివలన దంభముగాని బంధనముగాని పుట్టదు. ఆ ప్రకారమే భక్తిలేనట్టి వట్టిజ్ఞానము కూడఁ జిత్తమందు తర్కబుద్ధిగలిగి యహంకారమును బుట్టించి జ్ఞానమార్గమందుగల పురుషుని, బంధనమునందుఁ బడద్రోయ గలదు. కాని జ్ఞానముయొక్క మూలమునందు భక్తి యున్న యెడల జ్ఞానియగు భక్తుఁడాత్మరతి గాంచును. 'వట్టి తార్కికుఁడును, అభిమానియునై యుండఁడు. అందువలన నతఁడు

పూర్ణజ్ఞానమును బొందును. ఈ ప్రకారముగా నెప్పుడు కర్మ జ్ఞానముల రెండింటికి నడుమ భక్తియుండునో యప్పుడే యిట్టి పూర్ణత్వము గలుగును. ఇందువలననే శ్రీకృష్ణభగవానుఁడా గీతయొక్క నడుమనుండు అధ్యాయములలో భక్తినుంచెను. ఇట్లుంచుటకు మరియొక యుదారకారణముకూడగలదు. ఔదార్యముగల పురుషుఁడెల్లప్పుడు వివాదములను నశింపజేసి శాంతిని బ్రచారముచేయ బ్రయత్నించినట్లు శ్రీకృష్ణుఁడుకూడా బ్రపంచమునందు శాంతి నెలకొల్పు నుద్దేశ్యముతోడనే యట్లు కర్మ జ్ఞానములనడుమ భక్తినుంచెను. కారణమేమన ఇరువురు తగవులాడుకొనుచుందురనుకొనుఁడు. వారి తగవును దీర్పవలయునన్నచో నడుమ శాంతుఁడగు పురుషుఁడొకఁడు రావలసియుండును. ఇతఁడట్లువచ్చినచో నాకయ్య మభివృద్ధిచెందదు. ఇంకను శాంతించును. కర్మమునకు, జ్ఞానమునకు నెల్లప్పుడు వివాదమున్నది కర్మచెప్పిన విషయము జ్ఞానము గాదనును. జ్ఞానముచెప్పినది కర్మగాదనును. కర్మమతములో జగత్తుసత్యము జ్ఞానమతములో జగత్తు మిథ్య. కర్మమతములో గర్మిష్టుఁడుగావలెను. జ్ఞానమతములో నిష్కర్మిగావలెను. ఇట్లు కర్మజ్ఞానములకు రెండింటి కెల్లప్పుడు వివాదముండియేయున్నది. దీనింబట్టి శ్రీకృష్ణుఁడు మధ్యభాగమందు భక్తియోగముంచి కర్మ జ్ఞానముల వివాదమును నశింపఁజేసెను. గీతా మధ్యభాగమందు భక్తియోగ ముంచుటవలన ప్రపంచము వ్యావహారిక దశలో

గూడ మిథ్య యైనప్పటికిని దానిని భగవద్రూపమని తెలిసికొని మహాత్ముండగు జ్ఞాని జగత్తునకు మేలునుగూర్చెడి నిష్కామ కర్మలను జేయగలఁడు. ఇకఁ గర్మియగువాఁడు సకలవిధముల నుండు కర్మలను జేసినప్పటికిగూఁడ జగత్తుయొక్క పారమార్థికసత్త (బ్రహ్మ రూపత్వమును) గా గుర్తెరింగి కర్మమార్గమం దహంకారము మున్నగు బంధనములనుండి విముక్తి జెందగలఁడు. ఇట్లు భక్తినడుమ నిలువబడి జ్ఞానమునకును, గర్మకును సామంజస్యము గల్పించి యీ రెంటికి విరోధములేకుండ జేసెను. ఇదే గీతయొక్క పూర్ణత్వమునకు లక్షణము. కాబట్టి గీతా ప్రవక్తయగు శ్రీకృష్ణచంద్రునియందిట్టి యాధ్యాత్మిక పూర్ణత యుండుటచేత నా మహామహుఁడు పూర్ణపరమాత్మయని గుర్తెరుంగవలెను. ఇందు సందియములేదు.

* (ద్వంద్వసామరస్యము) *

పూర్ణతకు మరియొకలక్షణముగూడ గలదు. అదేదన ద్వంద్వ(పరస్పర విరుద్ధ) భావములకు సామరస్యము గల్పించుట యనునది. ఎవడు సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వముల నోర్చునో వాఁడే పూర్ణ ముక్తపురుషుఁడు. ఇతని చిత్త ... సుఖమందలి సంతోషముయొక్కయు, దుఃఖమందలి ... యొక్కయు సంస్కారమంటదు. ఈ సుఖదుఃఖము ... ... యానందమయమగు సామ్యదశ బొందును. పూర్ణావతారమందుగూడ నీలక్షణమే గోచరించుచున్నది.

ఎందులకన, పూర్ణజ్ఞానిమైనందున నతనియందు సర్వవిరుద్ధ భావ సామంజస్యమున్నది. ఇట్లే శ్రీకృష్ణునియందుగూడ బరస్పర విరుద్ధభావములయొక్క సమన్వయముగలదు. ఇందు వలన నతఁడు భగవంతుని పూర్ణావతారమని స్పష్టముగా సిద్ధించుచున్నది. ఇందులకు దృష్టాంతములు చూపఁబడుచున్నవి. క్షత్రియులకు యుద్ధమునందస్త్రములంగొని శత్రువులనుజంపుట ప్రకృతిసిద్ధము. గీతలో నర్జునునకు భగవంతుఁడు ఓ అర్జునా! నీవు యుద్ధమొనరించుటదప్ప యూరక యుండఁజాలవు. ఎందులకనఁగా!

" ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి "

ప్రకృతి, నిన్ను బలాత్కారముగా యుద్ధమునకు దింపగలదు" అని యుపదేశించెను. యుద్ధరంగమును జూచినప్పుడు క్షత్రియుల భుజము లదుర మొదలిడును. ఇది క్షత్రియునకు స్వాభావిక ప్రవృత్తి. కాని శ్రీకృష్ణుని జీవితకాలమందేమి కని పెట్టితిమి? కురుక్షేత్రమందంత గొప్పయుద్ధ మొనరింపజేసినను, బదునెనిమిదక్షౌహిణుల సేనను జంపించి భూభారహణము జేసినను క్షత్రియుఁడయ్యు శ్రీకృష్ణుఁడు శస్త్రాస్త్రముల ధరించియుండలేదు. శ్రీకృష్ణుఁడు సాధారణ మనుష్యుఁడే మైనయెడల నిట్టిపని యెప్పుడుగూడ జేయఁజాలఁడు. ఇదే శ్రీకృష్ణుని పూర్ణచరిత్రయందలి పరస్పర విరుద్ధభావ సామరస్యము. క్షత్రియులు ప్రతిజ్ఞాశూరులు. వారు తమ ప్రతిజ్ఞను

ప్రాణములు బోయినప్పటికిగూడా విడువరు, భగవంతుఁడు సత్యస్వరూపుఁడైనను భక్తవశుడై యుండును. కాబట్టి యుద్ధమునం దస్త్రముల ధరింపననెడి ప్రతిజ్ఞను నంతట భంగము కాకుండ నిర్వహించను. తుట్టతుదకుఁ బరమభక్తుఁడగు భీష్మదేవుని బ్రతిజ్ఞను నిలుపుటకొరకై యస్త్రమును ధరించి ద్వంద్వ (పరస్పర విరుద్ధ) భావములకు సామరస్యములఁ గూర్చెను. కర్మ ప్రపంచములో బంధనమునకు కారణమగును. కర్మిష్ఠులకు సోమరితనము కర్తృత్వాభిమానముండును. కర్మిష్ఠులు గానివారు నిష్క్రియులై సోమరితనము గల్గియుందురు. ఈ రెండుభావములకు నిష్కామకర్మయే సామరస్యమైయున్నది. అనఁగాఁ గర్మ చేయుచున్నప్పటికిని దాని వాసనకూడా నుంచికొనక కర్మకొఱకే కర్మ చేయవలెను. గీతలోనిట్లు చెప్పఁబడినది.

"కర్మణ్యేవాధికారస్తే. మాఫలేషుకదాచన
మా కర్మ ఫలహేతుర్భూ, ర్మాతే సంగో స్త్వకర్మణి॥"

మనుష్యుని యధికారము కర్మచేయుటయందుఁగలదు. కాని కర్మ ఫలమునందుమాత్రము లేదు. ఫలమును గోరుచు గర్మ నొనరింపఁగూడదు. మరియు విడువగూడదు. ఇది నిష్కామకర్మ కాదర్శము. ఈ యాదర్శమును బూర్ణుఁడగు శ్రీకృష్ణుఁడు, తన జీవనమందు మనుష్యుఁడు సకల కర్మలను సలుపుచుండియుఁ గమలదళమందలి జలమువలె నెట్లు నిర్లిప్తుడై యుండునో సంపూర్ణముగా జూపించియున్నాఁడు.

శ్రీకృష్ణుఁడు తన యవతారమం దెన్ని కర్మల నొనరించి యుండెనో యన్నికర్మలను నే మనుష్యుఁడైన నాచరించి యుండినయెడలఁ గర్మచక్రమందుఁజిక్కి పిచ్చివాఁడైయుండును. కాని లెక్కలేని చిక్కులుగల కర్మల నొనరించినప్పటికిని శ్రీకృష్ణుని మనోబుద్ధులయం దిట్టికర్మల ప్రభావ మావంత గూడ సోకియుండలేదు. మరియు నిశ్చింతతను, ఆనందమును బ్రకటించు లక్షణముగా నున్న మురళిని వాయించుట విడువ లేదు. యోగదర్శనమం దీశ్వరలక్షణముంగూర్చి యిట్లు చెప్ప బడెను.

"సఏవపూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్"

కాలమువలనఁ బరిచ్ఛిన్నుఁడు కాఁపోయినందువలన "ఈశ్వరుఁడు" పరమజ్ఞానులగు ఋషులకుగూడ గురువై యున్నాఁడు. ఇట్టిజ్ఞానము శ్రీకృష్ణునిలోనున్నది. సర్వోప నిషత్తులయొక్క సారమైనగీత యాతని దివ్యవాణి. ఇఁక నా మహామహుని జ్ఞానమునకుఁ బరిమితియున్నదా? ఇంత యపార జ్ఞానముగలిగియు, మహర్షుల కందఱకు గురువయ్యు నీ లౌకిక ప్రపంచమునకు వచ్చినప్పుడు లోకాచారము బూర్తిగా ననుస రించి ప్రవర్తించుట యా మహానుభావుని కర్తవ్యమై యుండెను! ఎందులకనఁగా.

"యద్యదా చరతి శ్రేష్ఠ స్తత్తదేవే తరోజనః"

శ్రేష్ఠుఁడగువాఁ డే పనిచేయునో లోకముగూడ దానినే

యనుకరించుచుండును. ఇందుకొఱకే ప్రపంచములో నాదర్శ
మును స్థాపించుటకై యెల్లరకు గురువరేణ్యు సాందీపని ముని
కడకు జని చదివి గురుదక్షిణగా నతని మృతపుత్రులను జీవిత
లుగాజేసి సమర్పించి నమస్కరించియుండెను. దీనియందుగూడ
బరస్పర విరుద్ధభావముల సామరస్యముయొక్కయు పూర్ణత
యొక్కయు లక్షణమున్నది. ప్రపంచమునం దహంకారము
నిర్లక్ష్యభావము మిక్కిలి ప్రబలియున్నది. జనులు సామాన్య
శక్తి గలవారైనను వర్ణధర్మములు బూటకములని చెప్పి
యేమేమో విరుద్ధపు పనులను జేయవలయునని సిద్ధమగుదురు.
ఇచట మనమొక విషయము విచారింపవలసియున్నది. శ్రీకృ
ష్ణునియందున్నంతశక్తి యే బ్రాహ్మణునియందుగలదు?
ఇది తెలిసికొనియే భీష్ముడు శ్రీకృష్ణమూర్తికే యందరికంటే
ముందుగా యజ్ఞభాగ మొసగవలసినదిగా బ్రస్తావించెను.
కాని యింత గొప్ప శక్తిగలవాడైనప్పటికి వర్ణధర్మ మర్యా
దను శ్రీకృష్ణుడు ద్రోసి రాజనలేదు. ఎందులకనగా వర్ణ
ధర్మమునకు జన్మకర్మలకును నెట్టి సంబంధమున్నదో దానిని
బాగుగా గుర్తెరింగినవాడగుటచే శ్రీకృష్ణుడు తనది క్షత్రియ
శరీరమగుటంబట్టి యుధిష్ఠిరుని యజ్ఞమునందు బ్రాహ్మణులను
సత్కరించు కార్యమును గైకొనెను. సర్వశక్తి సంపన్నుం
డైనప్పటికి నీ విధముగా సమస్తవిషయములను సర్వవిధముల
విమర్శించుకొని కార్యమును నిర్వహించుటయే యతని చరిత్ర

యందు విరుద్ధభావముల సామరస్యముయొక్కయు బూర్ణత యొక్కయు లక్షణము. నేటి దినములలో ముప్పది ముప్పది రూపాయలచొప్పున జీతము దీసికొనెడి కార్యాలయ నియోగులు (ఆఫీస్ క్లర్కులు) తాము గతించినపిమ్మట భార్య జీవించు కొఱకై ప్రాణరక్షణ విశ్వాసక సంఘముల (Life insureance companys) లో రూపాయలు నిలువఁజేయుచున్నారు. వీరు తమ సగముకఁ పువకే తిని స్త్రీ మోహమందు జిక్కుకొని యీ విధముగా బాట్లుపడుచుందురు. కర్మమందు దృష్టి పడనియ్యరు. శ్రీకృష్ణమూర్తి తలఁచినచో తన ధర్మపత్నుల రక్షణకుగాను ఈ ప్రపంచమునందు లీలావతారము ముగియుటకు ముందే తగిన యేర్పాటు జేయజాలఁడాయేమి? ముప్పది రూప్యములుమాత్రము సంపాదించెడి యీ సామాన్య నియుక్త(క్లర్కు)లకేయింతశక్తి యున్నప్పుడిక నా మహా మహునియందుమాత్రము శక్తి తక్కువయున్నదా? కాని శ్రీకృష్ణుఁడిట్లు సామాన్యభోగివలె మోహగ్రస్తుఁడుగాఁడు. కర్మ విజ్ఞానమును మరచి బారిబద్దము నడగించెడివాఁడుగాఁడు. కాఁబట్టియే శ్రీకృష్ణుఁడు వైకుంఠ లోకమునకుఁ జేరిన తరువాత నర్జునుని శక్తి నశించుటయు, స్త్రీలు సంరక్షింపఁబడక పోవుటయు సంభవించినది. ఇదిగూడ శ్రీకృష్ణుని విరుద్ధభావములయు బూర్ణతయొక్కయు, సామరస్యలక్షణమైయున్నది. ప్రపంచమునందు తన స్వజనమును వదలెడి సమయమందు

దుఃఖము జెందును. మోహాంధుడగు పురుషుని లక్షణము. ఎవని పై నెవని కెంత ప్రేమ యుండునో యతని కతనితో వియోగము గలిగినప్పుడంత కష్టముగానుండును. ప్రపంచమునందు మోహ కామ, ప్రేమలు మున్నగువానితో జిత్తము బద్ధమైయుండుట జీవలక్షణము. వీనిచే నంటకుండ నుంటయు, ప్రేమించినప్పటికిని గట్టుబడియుండకుంటయు, నిట్లే కామమోహాదులయందు జిక్కుకొని గర్తవ్యమును మరువకుండుటయు, ముక్తపురుషుని స్వరూపమై యున్నది. ఇట్టిభావము శ్రీకృష్ణునియందు పూర్ణముగా నున్నది. అక్రూరుఁడు శ్రీకృష్ణుని మధురకుఁ దోడ్కొనిపోవు సమయమున నెంతో ప్రేమతోనున్న గోపికలందఱేవిధముగా నత్యంత విషాదముతో నేడ్చి యేడ్చి నతని నడ్డగించుటకు బ్రయత్నించిన సంగతి విశదముగా దెలియుచునే యున్నదిగదా. సామాన్యపురుషునకంత ప్రేమతో నున్నవారిని విడిచిపెట్టి పోవజాలెడి శక్తియుండదు. కాని శ్రీకృష్ణుఁడు తన వ్రజ లీలామహోత్సవమును వెంటనే ముగించి తాను చేయదగిన పనులన్నింటెని చేయుటకొఱకు మధుర మున్నగు ప్రదేశము బోవలసియుండుటచేత బూర్ణజ్ఞానియగు నతని చిత్తమందు గోపికల ప్రేమయొక్కయు, ప్రార్థనయొక్కయు ప్రభావ మిసుమంతయు బ్రసరింపలేదు. మరియు నతడవ్వారిని విడనాడి పోయెను. దీనింబట్టియు నతనిచరిత్రలో రెండుభావములు సామరస్యమున్నది. ఈ ప్రకారముగా మనము నిస్పక్షపాత విచా

రణము గావించినకొలంది శ్రీకృష్ణుని లోకాతీతమగు చరిత్రియు, బూర్ణతామహిమయు బూర్తిగా స్పష్టముగా గలదు.

(శ్రీ కృ ష్ణుఁ డు, గో పి క లు)

పురాణములందుఁ బూజ్యపాదులగు మహర్షులు సాధారణములుగాని దైవీచరిత్రిముల వర్ణించి ధార్మికలోకమునకు మహోపకారమొనర్చిరి. ఈ పురాణములన్నియు శ్రీకృష్ణుని చారిత్రిముతో సమానమగు పవిత్రిములును, గంభీరములునగు భావములతో నిండియున్నవి. ఇందు కేవలము శ్రీకృష్ణచరిత్రిమునే యాదర్శముగా గైకొని పురాణములస్వరూపము విమర్శింపబడినది. పురాణపాఠకులీ విజ్ఞాన మెరింగి యితర చరిత్రిలపై శ్రిద్ధగలిగి యుండవలెను.

గోపికల చరిత్రిముగూడా మననము చేసినయెడల నద్భుతములగు రహస్యములను గుర్తెరుంగగలము. గోపికలపై శ్రీకృష్ణభగవానుడనుగ్రిహించుటకు వారి మధురభావములును వారా భగవంతునింగూర్చి కావించిన యాత్మసమర్పణమును కారణములు. పురాణములందు గోపికలనుగూర్చి విచారించిన యెడల వారనేక శ్రేణులకు జెందినవారని సిద్ధాంతము గాగలదు. జనకపురమందు స్త్రీలు, భగవంతుని విశేషముగా బ్రేమించుటకొఱకు బృందావనమందు జన్మించిరి. మరియు

శ్రీమద్భాగవతపురాణమునుబట్టి చాలమంది దేవస్త్రీలేకాక భగవతియగు మాయాదేవిగూడ గోపికారూపముతో జన్మించినదని సిద్ధాంతమగుచున్నది

"వసుదేవ గృహేసాక్షా ద్భగవాన్ పురుషః పరః
జనిష్యతే తత్ప్రియార్థం, సంభవంతు సురస్త్రియః
విష్ణోర్మాయాభగవతీ, యయా, సమ్మోహితంజగత్
ఆదిష్టా ప్రభుణాంశేన, కార్యార్థం సంభవిష్యతి"

వసుదేవుని గృహమందు సాక్షాత్ పరమపురుషుఁడగు భగవంతు డవతరించును. ఇతనికొఱకు దేవస్త్రీలు బృందావనమందు జన్మింతురు. అందే మాయగూడ యావశ్యకమగు రూపముతో బ్రికటము కాగలదని యాజ్ఞాపింపబడెను. ఇట్లు గోపిక లనేకవిధముల విభాగింపఁబడియుండిరి. గోపికలెల్లరును భగవంతునియందు గాంతాభావమయమగు ప్రేమతోనున్నారు భక్తిశాస్త్రమునందు పదునాల్గురకములగు రసములు చెప్పఁబడినవి. వానిలో వీర, కరుణా, హాస్య, బీభత్సాది సప్త రసములు గౌణములును, దాస్యాసక్తి, వాత్సల్యాసక్తి కాంతాసక్తి మున్నగునవి ఏడు రసములు ముఖ్యములునై యున్నవి. ఈ సమస్తరసములద్వారా ప్రేమించెడి విషయమందు భక్తిశాస్త్రమిట్లు సిద్ధాంతీకరించుచున్నది.

"మాహాత్మ్యజ్ఞాన సాపేక్షం
తదభావే జారవత్"

కాంతాసక్తిగానిమ్ము, మరియొక యాసక్తిగానిమ్ము. ఆసక్తు లన్నిటియందుఁగూడ మాహాత్మ్యజ్ఞానములుగల ప్రేమ గావలయును. ఈశ్వరునియందుమాహాత్మ్యబుద్ధినుంచక ప్రేమించినయెడల నా ప్రేమ జారునిపైఁ జూపించెడి ప్రేమవలె నగును. గోపికలకు శ్రీకృష్ణునిపై గాంతాసక్తిప్రేమయున్నది. కాని వారిలో చాలమంది గోపికలకు శ్రీకృష్ణునియొక్క మాహాత్మ్యజ్ఞానముండెను. వీరు శ్రీకృష్ణుఁడుసాక్షాత్పరబ్రహ్మ, పరమాత్మయని గుర్తెరింగినవారతే. శ్రీ భాగవతమం దిట్లున్నది.

"ప్రేష్ఠోభవాంస్తనుభృతాం కిలబంధురాత్మా"
నఖిలు గోపికానందనోభహ
నఖిల దేహినా మంతరాత్మదృక్॥

నీవు సకల భూతములయొక్క యాత్మవు. సర్వవ్యాపి వగు అంతరాత్మవు. భగవంతుడవు అని యనేకరీతులఁ బ్రశంసించిన పై శ్లోకమునుబట్టి గోపికలకు శ్రీకృష్ణునియం దీశ్వరజ్ఞానముగలదని తెలియుచున్నది. ఇందువలనఁ గాంతాభావముతోఁ బ్రేమించినందుచే, మాహాత్మ్యజ్ఞాన ముండుటచే గోపిక లున్నతదశ బొందిరి. కాంతాభావ ముండినందులకు గారణమేమనగా శరీరము, మనస్సు, ఆత్మ అన్నిటితో బర

మాత్మానందమును అనుభవించుటకు సాధకుఁ డిచ్ఛగించిన యెడల స్త్రీభావమునందే యది సంపూర్ణముగా నెరవేరును గాని పుంభావము నందుమాత్రము గాజాలదని వారు పురుషశరీరములను ధరింపక స్త్రీ శరీరములను ధరించిరి. వీరి యధికారము గోపబాలకులకంటె నతిశయము. శ్రీకృష్ణ భగవానుని మురళీనినాదమునువిని గోపికలందఱు ప్రపంచమును రోసి విరక్తులై భగవంతుని చరణారవిందములందే యాత్మను సమర్పించిరి. గోపబాలకులిట్లు చేయలేదు.

-*) గోపికలు వ్యభిచారిణు లేల కారు ? (*-

ఇచట గోపికలు తమ తమ భర్తలను విడచిపెట్టి శ్రీ కృష్ణమూర్తినే పతిగా భావించినపుడు వారు వ్యభిచారిణులును బాపిష్ఠురాండ్రు నేలకా నెరరు? యనియొక ప్రశ్న యుదయింప వచ్చును. ఇందులకు సమాధానమేమన, గోపికలు తమతమ భర్తలను విడనాడి ఇతరపురుషుల నెవ్వరినైనఁ బతులుగాఁ జేసికొనినప్పుడు వారు వ్యభిచారిణులును, బాపిష్ఠురాండ్రు నౌదురనియు, వారికి నరకవాసము సంభవించుననియు, జెప్ప వచ్చును. కాని గోపికలు సకలపతులయొక్క యంతరాత్మయు బరమపతియు నగు భగవంతునకు దను మనఃప్రాణములను సమర్పించినప్పు డవ్వారిపై వ్యభిచారదోష మెట్లు సంక్రమించును? సంక్రమింపదు. ఇందులకా భగవంతుఁడే యనేక

రూపములనుదాల్చి ప్రపంచమునకంతకు భర్తయగుటయే కారణము.

"యథా తరోర్మూల నిషేచనేన
తృప్యన్తి తత్స్కంధ భుజోపశాఖాః
ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణి
తథైవసర్వార్హణమచ్యుతేజ్యా"

ఎట్లు వృక్షమూలమునందు నీరుపోయుటచేతఁ గొమ్మలు ఆకులు, మున్నగునవి తృప్తిపడుచున్నవో! ఏ ప్రకారముగా ప్రాణము సంతుష్టిపడినయెడల నింద్రియములుగూడ దృప్తి పడునో, యట్లే పరమపతియగు భగవంతుని సేవించుటచేత సమస్త పతులయొక్కయు, సర్వ ప్రపంచముయొక్కయు సేవ జేసినట్లగును. స్త్రీ, పురుషులు ప్రేమను పరస్పర వృద్ధి జేసికొని భగవంతునిం బ్రేమించుట కలవాటు పడవలెననెడిది వివాహోద్దేశము. భగవంతునియందలి ప్రేమయే నిత్యమగుట వలనను, భగవంతుఁడు ప్రేమరూపుడగుటవలనను భగవత్ప్రేమయే నిజమైన ప్రేమ. ఎందులకనగా ఇద్దానియందు దుఃఖము లేదు, వియోగములేదు, విషాదములేదు ఏవిధమైన శోకముగాని యశాంతిగాని లేదు. జీవుని హృదయముగూడ నీ నిత్యప్రేమ కొఱకే యువ్విళ్లూరుచున్నది. యావత్ప్రపంచములోని జీవ కోటి యీ పరమశాంతిమయుండును, బ్రేమమయుండును నగు భగవంతుని పాదారవిందములను బొందుటకొఱకే యంతులేని

కాలమునుండియీ కాలచక్రమునుండి దిరుగుచున్నది ప్రపంచము లోని యశాంతి చాంచల్యమును నంతయుఁగూడ నీ నిశ్చలమును శాంతిమయమును నగు పరమపదమును బొందుటకొఱకేయున్నవి. భగవంతునితోడి యీ కలయిక, యథార్థమగు కలయికయు ఆధ్యాత్మిక వివాహమునైయున్నది ఈ వివాహమే సమస్త వివాహములకు లక్ష్యము. దీనికొఱకే సమస్త ప్రపంచము పరిభ్రమించుచున్నది. అనంత కర్మానుష్ఠానము గావింపఁబడు చున్నది. కాని భగవంతుఁడు నిరాకారుఁడైనందువలనను, నింద్రి యాదుల కతీతుఁడైనందువలనను దక్షిణమందే భగవంతుని యందుఁ బ్రేమకుదురుట కష్టమగును. దీనికొఱకుఁ బ్రపంచము లోని స్త్రీపుంజీవులు పరస్పరముఁ బ్రేమించుకొని హృదయ మందు దాగియున్న ప్రేమను రేకెత్తించి భగవంతుని బ్రేమిం చుటకభ్యాసమొనర్చుచుందురు. శరీరముతో శరీరసంబంధము, మనస్సుతో మనస్సంబంధము, నీలోనగునదంతయు నాయా ధ్యాత్మికవివాహమనగా భగవంతునిగూర్చి ప్రేమించుటకొక యుపాయమాత్రమైయున్నది. లక్ష్యమాధ్యాత్మిక వివాహమే కాబట్టి యిట్టి యాధ్యాత్మిక వివాహ మెవరికగునో, యనగాఁ నెవరు ప్రపంచప్రేమను దుచ్ఛముగాదలంచి భగవంతుని యందుఁ జూపెడిప్రేమనే జీవనమునకుఁ బ్రధానమైన యొకటే లక్ష్యమని తలంతురో వారి జీవనోద్దేశము పూర్ణమైనది. ఇందు, వలన వారికి ప్రపంచమందలి యేవస్తువతోఁగూడ నెట్టిసంబం

ధమునుంచుట కావశ్యకత యుండదు. ఎందులకనఁగా భగవం తుని బ్రేమించుటవలనఁ గర్తవ్యములన్నియు బూర్ణములగును. వారికే విషయమందెట్టి బాధ్యత (దాయిత్వము) యుండదు. భగవంతుని నెక్కువగా బ్రేమించిన గోపికల చిత్తవృత్తి యిట్టిదే. వారి జీవనమనెడి పడవ సచ్చిదానందమనెడి సముద్రమందు మునిగిపోయినది. వారు చేయదగిన పనుల న్నియు భగవంతుని పాదారవిందములలో లీనమైనవి. వారి వివాహములన్నియు ఆధ్యాత్మిక వివాహములోఁ జేరి లయిం చినవి. వీరు శ్రీకృష్ణుని బరమభర్తగాను, బరమాత్మగాను గుర్తెరింగి యతనియందే తను మనఃప్రాణములను సమర్పించి యుండిరి. సర్వ ధర్మములను బరిత్యజించి ధర్మస్వరూపుండును, శాశ్వతుండును నగు భగవంతున కాత్మార్పణము గావించిరి. కాఁబట్టి యిట్టి కాంతాసక్తియం దెట్టి పాపముగాని, వ్యభిచా రముగాని లేదు. భగవంతుడిట్లు గీతలో నుడువుచున్నాడు.

"యేతుసర్వాణి కర్మాణి, మయిసన్న్యస్యమత్పరః
అనన్యే నైవయోగేన, మాంధ్యాయన్త ఉపాసతే
తేషామహం సముద్ధర్తా, మృత్యుసంసారబంధనాత్
భవామి న చిరాత్పార్థ, మయ్యావేశితచేతసాం"
మన్మనాభవ మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః
సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకంశరణంవ్రజ
అహంత్వాం సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మాశుచః"

ఏ భక్తుఁడు నాయందే సమస్తకర్మల నర్పించి చిత్తము నుంచి యనన్యయోగముచేత నన్నుపాసించుచున్నాఁడో వానిని వెంటనే సంసార సముద్రమునుండి యుద్ధరింపఁగలను. ఓ అర్జునా! నీవు నామీఁదఁ జిత్తముంచుము నా భక్తుఁడవు గమ్ము. నన్ను బూజింపుము. నాకు నమస్కరింపుము. దీని వలన నీవు తప్పక నిశ్చయముగా నన్ను బొందఁగలవు. సర్వ ధర్మములను త్యాగమొనర్చి కేవలము నన్నే శరణు బొందుము. ధర్మత్యాగమువలన గలిగిన పాపము నుండి నిన్నుద్ధరింతును. గోపికలుగూడ నిట్లే భగవంతున కాత్మార్పణము గావించి ప్రాపంచిక స్త్రీధర్మమును విడిచిరి. ఆత్మసమర్పణము చేయుటకు ధర్మములను విడనాడినందువలన సంభవించిన పాపమునుండి యా గోపికలను శ్రీకృష్ణభగవానుఁ డుద్ధరించెను. ఇదే గోపికాప్రేమరహస్యము. గోపికాప్రేమ రహస్యవిషయ మధికముగా నింకేమి చెప్పవలెను? గోపికలు వేదములనుగాని, వేదాంతములనుగాని చదివియుండలేదు. కాని వారు కేవలము భక్తివలననే భగవంతుని వశపరచుకొని యుండిరి. భగవంతుఁడేమి వచించుచున్నాఁడో చూడుఁడు.

అహంభక్త పరాధీనో, హ్యస్వతంత్రఇవద్విజ
సాధుభిర్గ్రస్తహృదయో, భక్తైర్భక్త జనప్రియః॥
నాఽహమాత్మా న మాశాసే, మద్భక్తైః స్సాధుభిర్వినా
శ్రియశ్చాఽఽత్యంతికీంబ్రహ్మన్, యేషాంగతిరహంపరా
మయినిర్బద్ధహృదయాః, సాధవస్సమదర్శనాః
వశేకుర్వన్తిమాంభక్త్యా, సత్త్స్రియస్సత్పతింయథా॥

నేను భక్తులకు లోబడినవాఁడను. భక్తులయెదుట నాకు స్వాతంత్ర్యము లేదు. సాధువులందు నా హృదయము కట్టబడి యుండును. సాధువులకు లేకుండ నేను నా యాత్మను శ్రీని, గోరను. నేను సాధువులకు బరమ శరణ్యుఁడను. నాయందు చిత్తమును బంధించి సమదర్శులగు సాధుజనులు పతివ్రతయగు స్త్రీ, తన పతిని స్వాధీనపరచుకొనినట్లు నన్నుగూడా దమ వశమందుంచుకొందురు. గోపికలకుగూడ భగవంతునిపై ప్రేమ యిట్లున్నది.

> 'వాణీ గుణానుకథనే, శ్రవణౌ కథాయాం
> హస్తౌచ కర్మసు, మన స్తవపాదయోర్నః
> స్మృత్యాం శిరస్తవ, నివాసజగత్ప్రణామే
> దృష్టిస్సతాం దర్శనేఽస్తు, భవత్తనూనాం"

గోపికలవాక్కు భగవంతుని గుణగణమును గానమొన ర్చుటకును, చెవులు భగవద్గుణ మధురగానమును వినుటకును, జేతులు భగవత్కార్యములను సల్పుటకును, చిత్తము భగవంతుని పాదకమలములను ధ్యానించుటకును, శిరస్సు భగవంతుని విగ్రహమునకును, దీర్ఘములకును నమస్కరించుటకును, చూపు భగవద్భక్తులను జూచుటకును నుండినవి. ఇట్లు తను, మనః, ప్రాణములతో గోపికలు భగవంతుని ప్రేమించుచున్నందు వలననే భగవంతుఁడా గోపికల సంత మెక్కువగాఁ గరు ణించి యుండెను. మరియు నా మహామహు డుద్ధవుని బృందా

వనమునుండి పంపించు సమయమున వారి ప్రేమను దన ముఖ కమలముతో నిట్లు ప్రశంసించెను. భాగవతములో,

"తా మన్మనస్కా మత్ప్రాణా, మదర్థేత్యక్త దేహికాః
మామేవ దయితం ప్రేష్ఠ మాత్మానం మనసాగతాః ॥

యేత్యక్తలోకధర్మాశ్చ మదర్థే తా న్బిభర్మ్యహం
మయితాః ప్రేయసాం ప్రేష్ఠే దూరస్థే గోకులస్త్రియః ॥

స్మరన్త్యోఽఙ్గ! విముహ్యన్తి విరహౌత్కంఠ్య విహ్వలాః
ధారయంత్యపి కృచ్ఛ్రేణ, ప్రాయః ప్రాణాన్ కథంచన ॥

గోపికలు నాకు మనస్సును బ్రాణమును సమర్పించిరి. నాకొఱకే వారు పతిపుత్రాదులను విడిచిపెట్టిరి. వారి స్థూలశరీరము బృందావనమునం దున్నప్పటికిని జిత్తముమాత్ర మాత్మ స్వరూపుండనగు నాయందే లవలీనమయ్యెను వారు నాకొరకే లౌకికధర్మములను ద్యజించిరి. ఇందువలన వారిని రక్షించుట నాకు గర్తవ్యము. నేను దూరదేశమందున్నందువలన నన్నెక్కువగా బ్రేమించెడి గోపికలు నా వియోగముచేత మిక్కిలి దుఃఖమునుబొందుచు "నేను దిరిగి రాఁగలను" అనెడి యీ యాశతో నత్యంత కష్టముగా నేదోరీతిగా బ్రాణములను నిల్పుకొనుచున్నారు. గోపికలకున్న యిట్టి భగవత్ప్రేమను ఉద్ధవునిసముఖమున శ్రీకృష్ణుఁడే ప్రకటించెను.

## -*) గోపికలకు ముక్తి యెట్లుచేకూరెను ? (*-

శ్రీమద్భాగవతమునందు రాసలీలావర్ణనమం దెన్ని శ్లోకములు గలవో యవ్వాని నన్నిటియందు నన్నిచోట్ల యోగీశ్వరుఁడని, మన్మథమన్మథుఁడని, ఆత్మారాముఁడని, యీ మొదలగు విశేషణములతో శ్రీకృష్ణుని వర్ణించిఁ నప్పటికిని గోపికాప్రీతి విషయమునం దచ్చటచ్చటఁ గామాదిభావములు గోచరమగునట్టి వర్ణనములు చిక్కుచున్నవి. కామదశ, శరీరముమీఁదను, మనస్సుమీఁదను ఎంతవరకధికారమును నిల్పగలదు? ఏదశపైన జేరినయెడల జీవుఁడు కామమునుండి యతీతుఁడు గాఁగలఁడు? దీనితత్వమును గుర్తెరుంగఁజాలక యీ భాగవతములోని శ్లోకములను గైకొని గోపికల భావమునుగురించి యనేకప్రకారముల శంకించుచున్నారు. కాఁబట్టి గోపికల భావములను చెప్పి శంకా సమాధానములు గావింపఁబడును. గోపికలు తొలిజన్మమందు జనకపురమందలి స్త్రీలనియు, వారియందు శరీరము, మనస్సు, ప్రాణము, ఆత్మ, వీనిద్వారా భగవంతుని సేవించుటయో, భగవంతునితోఁగూడి యానందలాభమును బొందుటయో, యనెడి యీవాసనయే యున్నదనెడిసంగతి యీవలకే చెప్పఁబడినది. కాఁబట్టి గోపికలయం దీవాసన యుండుట వాసననను సరించి స్వాభావికము. ఈ గోపికలలోఁగూడ రెండు రకములవారున్నారు. మొదటిరకమువారు, తమభర్తలు, రాస

క్రీడగాపించెడి రాత్రియందు శ్రీకృష్ణునికడకుఁ బోనియ్యక యడ్డగించినందున దుఃఖించి దుఃఖించి వెంటనే ప్రాణములను విడిచినవారైయున్నారు. భాగవతమం దీగోపికలంగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

"అన్తర్గృహగతాః కాశ్చిద్గోప్యోఽలబ్ధవినిర్గమాః
కృష్ణం తద్భావనాయుక్తా దధ్యుర్మీలితలోచనాః ॥
దుస్సహప్రేష్ఠవిరహ తీవ్రతాప ధుతాఽశుభాః
ధ్యానప్రాప్తాచ్యుతాశ్లేష నిర్వృత్యా క్షీణమంగలాః ॥
తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః
జహుర్గుణమయం దేహం సద్యఃప్రక్షీణ బంధనాః ॥

శ్రీకృష్ణునికడకు బోవుటకు బయలుదేరిన కొందరు గోపికలు తమ భర్తలచే నడ్డగింపఁబడి యింటిలోనికి మరలిపోయి కనులమూసికొని యేకాగ్రచిత్తలై శ్రీకృష్ణునే ధ్యానింప మొదలిడిరి. ఇట్టిదశలో వీరికి ముక్తిలభించుటకై శుభాశుభములగు రెండురకముల కర్మలును నశింపవలసియుండును. అవి నశించినవి. ఎట్లన, ప్రియతముండగు భగవంతుని వియోగదశచేత వారికి మిక్కిలి కష్టమయ్యెను. దానిచేత వారి చెడుకర్మలన్నియు క్షయించినవి. ఇఁక ధ్యానమువలనఁ బరమాత్మతో మానసికముగా గలిగిన సంబంధమువలని పరమసుఖమును ననుభవించిరి. దానివలన వారి శుభకర్మల బంధనముగూడ విడిపోయినది. ఇట్లు శుభాశుభకర్మలు రెండును క్షయించి

నందువలన బంధనవిముక్తులై గోపికలు గుణమయమగు దేహ
మును తత్క్షణమే త్యాగమొనర్చి ముక్తిపదమును బొందిరి. భగవ
ద్భావముతో సంబంధముగల గోపికలకీ సంయోగ, వియో
గములనెడి రెండురకముల భావములుండుటవలన వానిచే గలి
గెడి సుఖదుఃఖములు రెండుగూడ నసాధారణములై యున్నవి.
ఇందు సందియమేమియున్నది? అందువలనఁ గర్మబంధనము
నుండి విడివడి ముక్తిజెందుటయు స్వతస్సిద్ధమగు విషయము
విషయము. ఈ గోపికలకు గృష్ణునియందు బరమాత్మజ్ఞానము
లేదు. అయినను వారు(ఇట్లు దేహమువిడిచిన గోపికలు) భగవ
త్సంగమువలన ముక్తిబొందిరి. ఇట్లుండ నేగోపికలు
గృహమువిడిచి భగవంతుని దరికిచేరిరో, యే గోపికలకుఁ
గృష్ణునియందుఁ బరమాత్మభావముండెనో, యట్టివారు ముక్తి
జెందుదురనెడి విషయమందు సందేహమేమి? ఇపుడు మనము
తెలిసికొనదగిన విషయమేదన, గోపికలు రెండురకములవా
రున్నారనియు, వారిలో మొదటిరకమువారు భగవంతుని
విషయమునందు పతిభావము గలిగియుండిరనియుఁ, బ్రహ్మభావ
ముతో నుండలేదనియు, రెండవరకపు గోపికలు పతిభావ
మును, బ్రహ్మభావమును గలిగి శ్రీకృష్ణుని భజించిరనియు
మొత్తముమీద గందఱకు నా శ్రీకృష్ణునిపై గామభావ
మున్నదనియు తెలియదగియున్నది. ఈ రెండు విషయము
లందుగూడఁ బరీక్షిన్మహారాజు శ్రీమద్భాగవతమందు

"శ్రీకృష్ణచంద్రునిపై బ్రహ్మభావము లేకపోయినప్పటికిని, గామభావ మున్నప్పటికి నా గోపికల కందఱకును ముక్తి యెట్లు చేకూరె" నని సందేహించి ప్రశ్నించెను. భాగవతమం దిట్లున్నది.

"కృష్ణం విదుః పరం కాంతం, నతుబ్రహ్మతయామునే
గుణప్రవాహో పరమ, స్తాసాంగుణధియాం కథం॥"

"ఏ గోపికలకు గృహమందు ధ్యానముచలన ముక్తిగలిగనో వారికి శ్రీకృష్ణునిపైఁ బ్రహ్మభావము లేకుండెను. ఇట్లుండ వారికా యుత్తమగతి యెట్లుప్రాప్తించె". ననెడి పరీక్షిన్మహారాజు ప్రశ్నమునకు శ్రీ శుకమహర్షులవా రిట్లు సమాధాన మిచ్చుచున్నారు.

"ఉక్తం పురస్తా దేతత్తే చైద్యస్సిద్ధిం యథాగతః
ద్విషన్నపి హృషీకేశం, కిముతాధోక్షజప్రియాః॥
నృణాం నిశ్శ్రేయసార్థాయ, వ్యక్తిర్భగవతోన్నృప!
అవ్యయస్యాప్రమేయస్య, నిర్గుణస్య గుణాత్మనః॥
కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృదమేవచ
నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాం హి తే॥
నచైవం విస్మయః కార్యో భవతాభగవత్యజే
యోగేశ్వ రేశ్వరేకృష్ణే యతఏత ద్విముచ్యతే॥"

భగవంతుని ద్వేషించెడి శిశుపాలుఁడు మున్నగువారికి సిద్ధియయినప్పుడిఁక భగవంతుని త్రికరణశుద్ధిగా ప్రేమించెడి

గోపికల కేలకాదు? అవ్యయుండును, నిర్గుణుండును నగు పర మాత్మ ప్రపంచమునందు బహిరంగటనమగుట కేవలము మను ష్యులకు ముక్తినిచ్చుటకొఱకే యైయున్నది. అమృతమును దెలిసి యైనను, దెలియకయైనను ద్రాగినట్టివారికి జరామరణములు లేనట్లు భగవత్స్వరూపమును గుర్తెఱింగినను, గుర్తెఱుంగజాల కున్నను మనుష్యుఁడు ప్రేమను సర్వశక్తి సంపన్నుండగు భగ వంతునియం దుంచిన యెడల నా భగవచ్ఛక్తివలన నా జీవున కుండు సమస్త విషయభావములు నశించి తుట్టతుదకు ముక్తి ప్రాప్తింపఁగలదు. నయముననో, భయముననో, పగనో, వగనో, యేకతనో, యిష్టతనో, కామముననో యేదోరీతిగా భగవంతునితో సంబంధముఁ గల్గించుకొన్నప్పు డాభావమును బురస్కరించుకొని శాశ్వతుండగు భగవంతుని జింతించుచు జీవుఁడు తన్మయుఁడు గాఁగలఁడు. శాస్త్రములిట్లు చెప్పు చున్నవి.

"పతిసక్తో నరోయాతి, సద్భావం హ్యేకనిష్ఠయా
కీటకో భ్రమరంధ్యాయ న్భ్రమరత్వాయకల్పతే॥"

ఏ ప్రకారముగా దైలపాయియగు నొకరకపు కీటకము భ్రమరము (తుమ్మెద) చేతఁ బట్టువడి భయపడి దానినే యేకనిష్ఠతో జింతించి చింతించి యా భ్రమరముగా మారి పోవునో యా ప్రకారమే యేవిధమగు భావముతోనైననేమి భగవంతునిధ్యానించుచు జీవుఁడు భగవంతునియందుఁ దన్మయు

డయి తుదకు ముక్తిపదమును బొందును. ఈ రీతిగానే శిశు పాలుడు మున్నగువారు సిద్ధిబొందిరి. ఇదేప్రకారము గోపిక లకుగూడ ముక్తిలభించెను. భాగవతమందలి వర్ణనమునుబట్టి గోపి కలకు దమ స్థూలశరీరముతోఁగూడ నా పురుషోత్తమునితోఁ గలియుటకు గోరిక (స్థూలశరీర సుఖేచ్ఛ) గలదని తోఁపఁ గలదు. కాని యా కోరిక యెందనుక మనస్సుతో సంబంధము ఇంద్రియములకును, స్థూలశరీరము కు నుండునో యందనుక సంభవించును కారణమేమనగా స్థూలశరీరభోగ మాదశయందే సిద్ధింపఁజాలును. మనస్సే యింద్రియములతోడను, స్థూలశరీ రముతోడను గలసి స్థూలశరీరమునకు భోగానుభవము గల్గించు చుండును. దీనింబట్టి యెవనిమనము ఏ సమయమం దింద్రియము లనుండియు, స్థూలశరీరమునుండియు వేఱయి యేయొక యున్నత వస్తువునందు తన్మయమైయుండునో యాతని కా సమయ ములో ఆ స్థూలశరీరభోగముగాని, దాని చింతగాని చింతా కంతమైన నుండఁజాలదు. ఎందులకనగా తన్మయమైనప్పుడు మనస్సు శరీరమునుండి వేరగును. గోపికలస్థితి సరిగా నీప్రకా రమే యున్నది.

పూర్వజన్మమందలి వాసన, మిక్కిలి యధికమగుట వలన శ్రీకృష్ణభగవంతునిజూచిన తొలితొలి క్షణమునందే, గోపికల చిత్తమునందు విచిత్రముగా భగవంతునితో తన స్థూలశరీరముతో సంశ్లేషించుట కిచ్ఛ జనింపనిండు! శ్రీకృష్ణుఁ

డన్ననో భగవంతుఁడే. సమస్త ప్రపంచము నాకర్షింపగలఁ వాఁడు. కామము, కోపము మున్నగునెల్ల యింద్రియ వ్యాపారముల నరికట్టి తనలో లయింపఁ జేసికొనగలవాఁడునై యుండెను. కాఁబట్టి గోపికల చిత్తములో బ్రప్రథమ క్షణము నందేదో కొంచెము కామభావ మున్నప్పుడుగూడ సర్వశక్తి సంపన్నుండును, సర్వరసముల కాధారుండును, సకల వృత్తులఁ దనలో లయించుకొనజాలినవాఁడును, నైన భగవంతునియందిట్టి భావముతో జిత్తము పడినతోడనే నది సముద్రమందు లయమై తన్ను మరచిపోయినట్లు సచ్చిదానంద సముద్రుండగు శ్రీకృష్ణభగవానునిలో గోపికల చిత్తరూపమగు నది గలిసి తన్మయమగుచున్నది. అనగా భగవంతునిశక్తి వలన ముగ్ధలై యతనియందే మనః ప్రాణములను సమర్పించి గోపికలు తన్మయలైనప్పుడు వారి మొదటి కామభావము నష్టమైపోవును. ఎందులకనగా ఎప్పుడు చిత్తము దేహము నుండియు నింద్రియములనుండియు బ్రత్యేకించి భగవంతుని యందు లయించునో అప్పుడు స్థూలదేహపు భోగముయొక్క ధ్యానముగూడ నుండ నేరదు. ఈ దశయే గోపికలది. ఈ భావమునందే గోపికలు తమ మనఃప్రాణములను భగవంతునిలో తన్మయము లగునట్లు జేసిరి. దీనివలన వారి సమస్త విధ కామభావనలు నశించి తుదకు వారికి ముక్తిపదము ప్రాప్తించినది. ఇట్లు విషయ భావములను విడిచి విషయములకు మించిన

తన్మయ భావమునకు వచ్చుటయు నున్నతి జెందుటయు సామాన్య మనుష్యున కుండెడి ప్రేమయందు సంభవించెడిది కాదు. కారణమేమనగా, సామాన్య మనుష్యుడు విషయ లంపటుండును, బ్రకృతి కధీనుండు నగుటవలన దనలో బ్రకృతిని లయింపజేసికొనెడి శక్తి యతనియందుండదు. గీత యిట్లు నుడువుచున్నది.

> ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్
> తద్వత్కామాయం ప్రవిశంతిసర్వే సశాంతిమాప్నోతి న కామకామీ॥

నదులు సముద్రమునకుంబోయి కలిసినట్లు సమస్త కామ భావములును దనలో లయింపజేసికొను శక్తిగలవారికి శాంతి లభించును. ఈ సిద్ధాంతము ననుసరించి తనలో బ్రకృతిని లయింపజేసికొనుశక్తి, యిట్టి సర్వశక్తిమంతుండును సమస్త ప్రపంచమును ఆకర్షించెడివాఁడు నగు భగవంతునియందే యుండజాలును. ఇట్లు సర్వశక్తిమంతుఁడగుటకు శ్రీకృష్ణభగవానుఁడు పూర్ణావతారుండగుటయే కారణము. ఇందువలననే గోపికలామహాత్ముని చరణకమలముల నాశ్రయించి సంసార సముద్రమునుండి యుద్ధరింపఁబడిరి. శ్రీకృష్ణునియందలి గోపికల తన్మయత్వమును గురించి యిట్లున్నది.

> తామాఽవిదన్మయ్యనుషంగబద్ధ ధియఃస్వమాత్మానమదస్త థేదం
> యథాసమాధౌ మునయోఽబ్ధితోయే నద్యః ప్రవిష్టాఇవనామరూపే॥

మునులు సమాధిదశలోను నదులు సముద్రమందును కలిసినందువలన నామరూపమయమగు ద్వైతభావము నశించినట్లు గోపికలు తమచిత్తమును ప్రేమతో సహితముగా నాయందు లయింపఁజేసియుండిరి. దీనివలన వారికత్యంతము తన్మయత్వము కలుగుటచేత ద్వైతభావమున కునికిలేకపోయెను. ఈగోపికలు తమ్ము బూర్తిగా మరచిపోయియుండిరి. ఇట్టిదశలో స్థూల శరీరస్థితి గోచరింపదు. కనుక గామభావముకూడ సంపూర్ణ ముగా నష్టమగును. ఇట్లు గోపికలు తను మనః ప్రాణములతో భగవంతునిఁ బ్రేమించి ముక్తిఁజెందిరి. ఇందులకొక యుదా హరణము జూడుఁడు. ఇనపమేకులతోఁడను, లోహపుసీలలతో డను గట్టబడిన యొకపడవను నొక మహాసముద్రమందు విడిచి పెట్టిరనుకొనుఁడు. ఆనదికొకగట్టున సూదంటురాళ్ళతో నిండిన యొకగొప్పగుట్ట గలదని యనుకొనుఁడు అప్పుడా నావ సము ద్రమునందు దిరుగుచు ఆసూదంటురాళ్ళ గుట్టకడకువచ్చినచో నప్పుడా సూదంటురాళ్ళ యాకర్షణశక్తిచేత నామేకులన్ని యును నావోడనుండి విడివడి యా చుంబకపర్వతమునుజేరి తగులుకొనును. ఆపడవయు దుత్తునుకలై సముద్రమునందు మునిగిపోవును. అట్లే కామము మోహము అభిమానము అహం కారము మున్నగు సీలలచేత నిర్మింపబడిన శరీరములనెడి పడ వలను శ్రీకృష్ణభగవానుని ప్రేమసముద్రమందు విడిచిపెట్టిరి. ఆప్రేమసముద్రముయొక్క దరిమీద చుంబక(సూదంటురాళ్ళు)

శైలమనెడి సర్వప్రపంచమును నాకర్షింప శక్తిగల శ్రీకృష్ణుం డుండెను. గోపికలు తమ శరీరములనెడి నావలను ప్రేమసము ద్రమునందు ద్రిప్పుచు నెప్పుడా శ్రీకృష్ణునికడకుఁ జేర్చిరో యప్పుడే యతని యాకర్షణశక్తిచే వారిశరీరరూపనావల కామకీలము, మోహకీలము అభిమానకీలము, అహంకార కీలము, లోనగు సీలలన్నియు నొక్కసారివిడిపోయి శ్రీకృష్ణునిఁ జేరి లయమయ్యెను. గోపికలును, శరీరసుఖభోగము, అహం కార, కామ, మోహాదులన్నిటని విస్మరించి శ్రీకృష్ణునియందు దన్మయులైరి. అనఁగా వారిశరీరము ప్రేమసముద్రమందులయిం చెను. మరియు వారి ద్వైతభావము పూర్ణముగానశించెను. ఇది గోపికల ప్రేమరహస్యవిషయము. దీనివలన సమస్తబంధ భావములనుండియు వారికి ముక్తిలభించెనని తెలియఁగలదు. ఇదియే పురాణములందుఁ జెప్పఁబడిన రాసలీలయాధిభౌతిక భావము. దీనికాధ్యర్థము, శ్రీకృష్ణభగవానుఁడు బృందావన మందు బ్రకటమై భక్తజనులఁ బరమాదరముతో నుద్ధరించు టయే.

పూజ్యపాదులగు మహర్షులద్వారా యేర్పడిన పురాణ శాస్త్రము యొక్క లౌకికభాషా, పరకీయభావములలో ననేకవిధ ములుగా విస్మయమును, సందేహములను కలిగించెడి భావము లును, గాథలును వచ్చుచుండును. వానిస్వరూపమును బ్రకటించు కొఱకును, నావిషయములలోని సంశయములను దూరీకరించుట

కును గోపికాచరిత్రము గొంతవఱకు సమాలోచింపఁబడినది. విమర్శింపవలసిన విషయములనేకములుగలవు. అయినను వానిలో మిక్కిలిప్రసిద్ధమైనది. గోపికాచరిత్రమైనందువలన నది విశేషముగా విమర్శింపఁబడినది. ఇట్లే పురాణములందుండెడి గంభీరతయు తెలిసికొనవలెను. ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక,ములనెడి యీమూడింటి కుదాహరణమిచ్చెడి విచారణలో శ్రీకృష్ణ గోపికాసంవాద విమర్శయందాధిభౌతిక రాసలీల వర్ణింపబడినది. ఇప్పుడు మిగిలిన రెండుభావములను గ్రమముగావర్ణింపబడును.

## -*) ఆధిదైవిక రాసలీల (*-

రాసలీలయందుండెడి ఆధిదైవిక భావము దేవీభాగవతమునందు వర్ణింపఁబడియున్నది. ఇందు స్థూలలీల సుంతయు లేదు. ఇచటనుండెడి శ్రీకృష్ణుఁడు బృందావనములోనివాఁడు గాఁడు. అనఁగాఁ బరమాత్మ, యవతారరూపముగాఁ బ్రకటింపఁబడిన స్వరూపముగలవాఁడుగాడు. కాని సాక్షాత్పరమాత్మయే. ఇందు పరమాత్మకు శక్తిస్వరూపిణియగు ప్రకృతియో, మాయయో రాధగానున్నది. మహాప్రలయమైనతరువాత బ్రహ్మాండమును సృష్టించుసమయము వచ్చినప్పుడు పరమాత్మ తనశక్తినే ప్రకటించి దానితోఁగలిసి యద్దానిని సృష్టించును. ఆసమయమందుగలుగు ప్రకృతి పరమాత్మల కలయికకు దైవీరాసలీలయని వ్యవహరింతురు. దేవీ భాగవతమునం దిట్లున్నది.

సకృష్ణస్సర్వస్రష్టాదౌ సిసృక్షన్నేక ఏవచ
సృష్ట్యున్ముఖస్తదంశేన కాలేన ప్రేరితః ప్రభుః॥

స్వేచ్ఛామయస్స్వేచ్ఛయాచ ద్విధారూపో బభూవహ
స్త్రీరూపో వామభాగాంశో దక్షిణాంశః పుమాన్ స్మృతః॥

తాందదర్శ మహాకామీ కామాధారాం సనాతనః
అతీవకమనీయాంచ చారుపంకజసన్నిభాం॥

దృష్ట్వాతాంతు తయాసార్ధం రాసేశో రాసమండలే
రాసోల్లాసేసురసికో రాసక్రీడాంచకారహ॥

నానాప్రకారశృంగారం శృంగారో మూర్తిమానివ
చకారసుఖసంభోగం యావద్వైబ్రహ్మణోదినః॥

అథసాకృష్ణచిచ్ఛక్తిః కృష్ణగర్భందధారహ
శతంమన్వంతరం యావజ్జ్వలంతీ బ్రహ్మతేజసా॥

శతంమన్వంతరాంతేచ కాలేతీతేపిసుందరీ
సుషావడింభంస్వర్ణాభం విశ్వాధారాలయంపరం॥

మహాప్రలయసమయములలో కృష్ణపరమాత్మయొక్కడే యున్నాడు శ్రుతి యిట్లుచెప్పుచున్నది-

"సదేవసౌమ్యేదమగ్రఆసీత్"

మొట్టమొదట సత్స్వరూపుండగు పరమాత్మయొక్కడే యుండెను. అటుతరువాత నతనియందు సృజింపనిచ్ఛజనించిన తోడనే కాలప్రేరితుండై యిచ్ఛామయుండగు పరమాత్మ తనశరీరమును రెండుభాగంబులుగా విభాగించెను. అతనియెడమ భాగము స్త్రీ రూపమును, కుడిభాగము పుంరూపమునయి

యుండెను. పరమాత్మవామభాగంబున బయలువెడలిన శక్తి స్వరూపిణి ప్రకృతిమాత. తరువాతఁ బరమాత్మయందు గామ భావముగల్గి యతండాప్రకృతినిగూర్చి మంచియందకత్తెగాను, కామవతిగాను జూచెను. ఈకామము విషయసంబంధమైనది గాదు. కాని జీవునికర్మలననుసరించి సృష్టించెడికోరికయైయు న్నది. ప్రపంచమందలి సౌందర్యమంతయు బ్రకృతిసౌందర్య ముఖండియే యుద్భవించినది. చందమామలోనియందము, సూర్యునిచక్కదనము, పూలసొబగు. స్త్రీ పురుషులసొగసు, మున్నగునవన్నియు బ్రకృతినుండికలిగినవే. కనుకనే పరమాత్మ ప్రకృతిమాతను జక్కనికమలమువలె నందముగానుండు సుందరి నిగాఁ జూచెను. ఇట్లుచూచి రాసేశ్వరుండును, రసికశేఖరుండు నగు భగవంతుఁడా ప్రకృతితో రాసలీల గావించెను.

ఇచట రాసలీల" యనెడి శబ్దముయొక్క తాత్పర్య మేమనగా! సృష్టించుటకొఱకుఁ బ్రకృతిపురుషుల సంబంధమని తెలియవలెను. ఈ లీల స్థూలలీలగాదు. ఈలీలలో పెక్కు రక ములగు శృంగారములైనవి. ఈ శృంగారములుగూడ లౌకిక శృంగారములుగావు. ఏ రసముచేత బ్రపంచములో సమస్త రసములు గలుగునో యా రసమే యిది. కారణమేమన, భగ వంతుఁడు రసరూపుఁడై యున్నాఁడు. అతని రసమువలననే ప్రపంచములో సర్వప్రకారములుగానుండు రసములు ప్రకట మగుచున్నవి. సతినిగురించిన పతియొక్క ప్రేమరసము,

బిడ్డనుగురించిన తల్లియొక్క స్నేహరసము, సంతతిం గురిం చిన పితరుల వాత్సల్యరసము, తలిదండ్రులనుగూర్చిన పుత్రుని శ్రద్ధారసము, మున్నగు సమస్తరసములు రసరూపుండగు భగవానుని శృంగారముయొక్క ఫలరూపములై యున్నవి. ఇందు వలననే శృంగారరసము వివిధ విధములుగా నున్నదని చెప్పఁబడినది. అటుపిమ్మట శ్రీకృష్ణభగవానుఁడు తన శక్తిస్వరూపిణియగు ప్రకృతియొక్క గర్భమునందు బీజప్రదానము గావించెను. ఈ బీజప్రదానము సృష్టికిముందు జడప్రకృతిలో చేతనాసత్తయొక్క సన్నివేశమని గ్రహింపనగును ఎందులకనఁగా, ప్రకృతి జడస్వరూపమైనందున దానికి స్వయముఁగా సృష్టించుకొను శక్తిలేదు. దీనివలన భగవంతునిద్వారా యొసంగబడిన బీజము (చేతనసత్త) ను బొందియే ప్రకృతి సృజించుటకు సన్నద్ధమగును. చాలకాలము వఱకీ బీజము ప్రకృతి గర్భమందుండెను. తరువాత దానినుండి యొకయండము వెడలెను అది బంగారు రంగుగలిగి సర్వప్రపంచమున కాధార రూపమయ్యెను ఈ యండము సామాన్యాండముకాదు సర్వప్రపంచమును దృష్టిగోచరమొనర్చు బ్రహ్మాండము ఈ ప్రకృతి పురుష సంబంధమువలని యీప్రపంచోత్పత్తి దేవీభాగవతమునందు వర్ణింపబడనది. ఇదియే రాసలీలయొక్క యాధిదైవిక భావము.

## -◆◆◆ ( ఆధ్యాత్మిక రాసలీల ) ◆◆◆-

ఈ రాసలీలయొక్క యాధ్యాత్మికభావము యోగి జనుల చిత్తములం దెల్లప్పుడు నుండును. ఇందు తలయందుండు సహస్రదళపద్మమే బృందావనము. ఈ విషయము యోగశాస్త్రమువలన సిద్ధమగుచున్నది. ఈ సహస్రదళ కమలము యొక్క యెల్లదళములు అధోముఖములై యుండును. ఎట్లన

"బృందావనస్థాస్తరవః, సర్వేచాఽధోముఖాస్స్మృతాః"

బృందావనములోని వృక్షములన్నియు నధోముఖములు గలవి. సమష్టి, వ్యష్టి, సిద్ధాంతములనుబట్టి బ్రహ్మాండ, పిండాండములు ఒకే రూపముగలవి. ఇది లయయోగ సిద్ధాంతము. అనగా బ్రహ్మాండమునందు ప్రకృతి, పురుషుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు. నక్షత్రములు, నదులు మొదలైన వస్తువులన్నియు నుండును. ఇట్లే యన్నిటికిఁ గేంద్రస్థానమైన జీవుని ప్రతి శరీరమందుగూడ విరాజిల్లుచున్నవి. దీనింబట్టి పరమాత్మకుఁ గేంద్రస్థానము జీవుని దేహమందలి సహస్రదళ పద్మమని తలంపఁబడినది. మరియు ప్రకృతికి స్థానము మూలాధార చక్రమందున్నది. అందు సార్థత్రి వలయాకార (మూడున్నర చుట్లు గలిగియున్న యాకార) ము గల కుల కుండలినీశక్తి యుండును. అదే త్రిగుణాత్మికయగు ప్రకృతి, లేక మాయ, కుండలినీశక్తి ప్రకృతి యైనందున శరీరమునందలి శక్తులన్నిటికి అది మూల

రూపము దానినుండియే శక్తి బయలుదేరి మనస్సునందును, నింద్రియములందును, శరీరమందలి యెల్ల నరములందును వ్యాపించి పనులజేయుచుండును. ఎంతవరకు కుండలినీ శక్తి యధోముఖమై యుండునో యంతవఱకు దానినుండి బయలు వెడలిన శక్తులు విషయవాహినులై జీవునిని సంసారమునందు మోహముగలవానిగా జేయును. కాని యేసమయమందు యోగి, యోగముద్వారా కులకుండలినీశక్తిని మేల్కొల్పి దాని యధోముఖమును, మార్చివేసి యూర్ధ్వముఖిగా జేయునో యా సమయమునం దేయేశక్తు లధోముఖములగల కులకుండలినీ శక్తినుండి వెడలి జీవుని విషయములందు ముగ్ధునిగా నొనర్చునో, యా శక్తులన్నియు, నూర్ధ్వవాహినులై కులకుండలినీ శక్తితో గూడ సహస్రారమందున్న పరమాత్మవైపు పరుగిడ మొద లిడును. దీనివలన జీవుని చిత్తమునందు విషయభావము పోయి వైరాగ్యము పుట్టును. ఇది విజ్ఞానసిద్ధము. ఎట్లనగా! ఒక మహా శక్తి తమోగుణము నాశ్రయించుకొని జీవుని విషయములందు మత్తునిగా జేయును. ఆ శక్తియే ముఖము త్రిప్పి సత్వగుణ గామినియై భగవంతునికడకు జేర్చును. ఏ శక్తి సాత్వికభావ ముచే జీవునకు గరుణగలిగించునో యదే తామసికభావము చేత నిష్ఠురత గల్గించును. ఏ శక్తి సాత్వికభావముచే ప్రేమను బుట్టించునో యదే తామసిక భావముతో గామమును బుట్టిం చును. ఏ శక్తి సాత్వికభావముచే ధర్మ ముద్ధరించునో యదే

తామసముతో పాపమును బ్రబలింపజేయును. శక్తి ఒక్క వస్తువే. కేవలము విపరీతగుణముల నాశ్రయించుటచేత విప రీత ఫలములు ఫలింపఁజేయుచుండును. ఎందాక కులకుండలినీ శక్తి అధోముఖమై యుండునో అందాక మనుష్యుల సమస్తేం ద్రియములశక్తి, వైషయిక (కామమునకు సంబంధించిన) భావ మును జనింపజేయును. ఎందులకన కులకుండలినీశక్తి యెప్పుడు సమస్తశక్తులకు మూలరూపమైయున్నదో యప్పుడది యధో ముఖియై యున్నందున సమస్త శక్తులును దమోగుణ కార్య ములనే కావించుచుండును. కనుకనే యోగులు యోగము యొక్క నానాప్రకారములగు క్రియలగావించి యధోముఖ ముగా నున్న కులకుండలినీశక్తి నూర్ధ్వముఖినిగా జేయుదురు. దీనివలన సమస్తశక్తుల కాధారభూతమైన కులకుండలిని, ఇంద్రి య, మన శ్శరీరములందు వ్యాపింపఁబడిన తన శక్తులతో మీదికి (పరమాత్మవైపునకు) బోఁగలదు. ఇట్టి తరుణము నందు జీవునకు వైరాగ్యము ప్రాప్తించును. ఆ జీవుని ప్రకృతి ఇంద్రియములు, చిత్తము, విషయములనుండి విరమించిసహస్ర దళ కమలముల నందుండెడి పరమాత్మను జేరబోవును. కుల కుండలిని షట్చక్రములను బేధించుకొని సహస్రదళ పద్మమం దున్న పరమాత్మను జేరును. కులకుండలినీ శక్తితోబాటు దాని సహచరీ శక్తులుగూడ బరమాత్మను గలియును. ఇదే లయ

యోగమందు పురుషునిలో ప్రకృతి లయమగుట. అందువలననే లయయోగమని దీనికి పేరు.

యోగియందిట్లు ప్రకృతిపురుషునియందు లయమయ్యెడి దానికే యాధ్యాత్మిక రాసలీలయని చెప్పఁబడినది. ఈ రాసలీలలో రాధ కులకుండలినీశక్తి. దయ, క్షమ, లజ్జ శ్రీ, ధైర్యము, శాన్తి, స్మృతి, అసూయలేకుండుట మున్నగు అంతఃకరణమునకు సంబంధించిన శక్తులన్నియు రాధాసహచారిణులగు బృంద, విశాఖ, లలిత, లోనగుగోపికలు బృందావనము సహస్రదళకమలము. కృష్ణుఁడు పరమాత్మ. ఇతని స్థానము సహస్రదళకమలమందున్నది. మురళీధ్వని ఓంకార నాదము. దీనిని యోగులు శ్రవణపర్వముగా విందురు. ఈ నాదమునేవిని రాధయుఁ నితరగోపికలును, సంసారమునువిడిచి శ్రీకృష్ణునింజేరుటకుఁబోయిరి. కులకుండలిని మేల్కొలిపిన పిమ్మట దానిని షట్చక్రములనుండి తీసికొనిపోవుటకు వివిధవిధములైన యోగక్రియలు చేయవలసియుండును. చక్రములన్నియు సుషుమ్నానాడియందు ముడివేయబడి యున్నవి. అందువలన నివి కులకుండలిని మీఁదిభాగమును జేరుటకు బాధారూపములు. రాధకు, గోపికలకు, శ్రీకృష్ణపరమాత్మ దర్శనమగుట కెన్నివిధముల గష్టములువచ్చినవో షట్చక్రము భేదించుటయం దట్టికష్టములే కలుగును. నాభియందుండు చక్రమును భేదించెడి సమయమునందు యోగి కేవేవో కొన్నిసిద్ధులు

సిద్ధించుచుండును. వీనివలన యోగికభిమానము పుట్టగలదు. గోపికలకు గృష్ణుని కృపారూపమైన సిద్ధులుగలిగినందువలనఁ బుట్టిన యభిమాన మీనాభిచక్రమును భేదించుసమయమందు గల్గిన యభిమానమువంటిదే. హృదయమందుండు అనాహత చక్రములోనికి వచ్చుటచేత యోగికి తన్మయభావముగల్గును! గోపికలకుఁగూడ తన్మయభావ మిట్టియవస్థలోనిదే. కనుబొమ నడుమనుండు ఆజ్ఞాచక్రములోనికి వచ్చుటచేత కూటస్థ చైతన్య జ్ఞానము గల్గును. గోపికలిట్టి పరమాత్మజ్ఞానము కల్గినపిమ్మట శ్రీకృష్ణునింగూర్చి

"నఖలుగోపికా నందనోభవా నఖిలదేహినామంతరాత్మదృక్"

నీవు గోపికాకుమారుడవుగావు. సర్వప్రాణులయొక్క యంత రాత్మల దృష్టవు. తుదకు కులకుండలిని, యితరశక్తులతో గూడ సహస్రారమందున్న వ్యాపక చైతన్యములో నెప్పుడు చేరునో యప్పుడు యోగికి బ్రహ్మమయమగు జగత్తుయొక్క జ్ఞానము గల్గును. ఆ సమయములో యోగికి బరమానందము ప్రాప్తించును. ఇదే రాసలీలలోని యానందము. బృందావన ములోని రాసలీలలో తుదకుఁ బరబ్రహ్మరూపుండగు శ్రీకృష్ణ చంద్రుని నెల్లెడలంజూచి గోపికలిట్టి పరమానందమునే బొం దిరి. ఇదే యోగిహృదయమందెల్లప్పుడు నుండురాసలీల. యోగులు తమప్రకృతిని బరమాత్మయందు లయింపజేసి యిట్టి నిత్యానందమును బొందుచుందురు. ఇదే రాసలీలయొక్క

యాధ్యాత్మికభావము. "గుప్" అనుధాతువునకు "రక్షించుట" యని యర్థము. ఈ ధాతువునుండి గోప గోపీ శబ్దములుబయలు దేరినవి. ఈ గోప గోపీ శబ్దములవలన ధర్మరక్షణ శీలముగల వృత్తులవిషయము చెప్పబడినది. శ్రీకృష్ణపరమాత్మ, యోగ మాయ నాశ్రయించుకొని రాసలీల గావించెను దీనియర్థమే మనగా, భగవంతుడు నిర్లిప్తంబగు చైతన్యము. మాయయే సమస్తమును జేయుచుండును. శ్రీకృష్ణుని గోపవేషము తో వర్ణించిరి. కాంతి, శాంతి, దయ మొదలగు శక్తులను గోపిక లనుగా వర్ణించిరి. "గుప్" ధాతువునకు రక్షించుట యని యర్థ మగుటంబట్టి యాత్మయొక్క సత్తచేత జగత్తు రక్షింపబడుచు న్నప్పుడు పరమాత్మయగు శ్రీకృష్ణుడు గోపుడగుటయు, శాంతి, దాంతి, కాంతి, దయ మొదలగు శరీరరక్షకశక్తులు గోపికలగుటయు సముచితముగా నున్నది. శ్రీకృష్ణుడురాధను దీసికొని యితరగోపికలకు గనపడకుండునట్లు దాగుకొనెను. నిత్యయు, బరయు నగు ప్రకృతి యెల్లప్పుడు పరమాత్మతో గూడ నుండునది యని దీనియర్థము

కనుక నే యితర ప్రకృతులనుండి వేరుగా నున్నప్పటికి బరాప్రకృతిమాత్రము సరిగా భగవంతునితోడనే యుండును. చివరకు రాధికనుగూడ శ్రీకృష్ణుడు విడనాడి పూర్తిగా నదృశ్యుడయ్యెను. దీనిభావ మేమనగా, పరాప్రకృతినుండిసంబం ధమెప్పుడు తెగిపోవునో యప్పుడే బ్రహ్మ నిర్గుణుండును, నిరా

కారుండును గాగలఁడనియే. శ్రీకృష్ణుఁడు దనవీపుపై నెక్కుమని వక్కాణించి తటుక్కున నంతర్ధాన మయ్యెనను దాని కర్థ మేమనగా, మాయ, యీశ్వరున కధీన. కాని ఈశ్వరుఁడు మాయకు అధీనుఁడు కాడనియే శ్రీకృష్ణుఁడు వివిధ విధము లైన మురళీ నినాదములు లయయోగమందలి వివిధనాదములై యున్నవి. ఈ ప్రకారముగా బ్రతిలీలను గురించి విమర్శించి చూచినయెడల ఆధ్యాత్మిక రాసతత్వము గోచరింపగలదు. పూజ్యపాదులగు మహర్షులు పురాణములం దేవిషయముగాని యెంతమాత్రమును విడిచియుండలేదు. ఈ ఆధ్యాత్మిక రాస లీలల వర్ణనముగూడ దేవీ భాగవతమందు గన్పడుచున్నది. అచట నా ప్రకరణములో శివకేశవుల కలయికచేతఁ బరమా నందము గల్గినప్పుడు శివుని తాండవనృత్యమునుగాంచి విష్ణుభగ వానుఁడు ద్రవీభూతుఁడయ్యెను. అట్టిసమయమందు గోపికలు శ్రీకృష్ణుని వియోగముచేత నెట్టి భావమును బొందిరో యద్దాని సంక్షేపవర్ణనము దేవీభాగవతమం దున్నది. ఇది చదివినవారికి ఆధ్యాత్మిక తత్వముయొక్క పూర్ణతయు, అతి దివ్యతయు, నిత్యతయు యోగిజనుల హృదయమందు విహరిం చెడి ఆధ్యాత్మిక రాసలీలా సంక్షేపతత్వమును, బోధ పడ గలవు.

పురాణములలో వర్ణింపఁబడిన రాసలీలయందలి త్రిభా వముల పూర్ణత, యిదియే. దీనిని బాగుగా సుస్థైరింగిన

యెడల పౌరాణికతత్వమును గ్రహించుటయందు బొరపాటు పడజాలరు.

-( దేవాసుర సంగ్రామము )-

ఇట్లే దేవీభాగవతము, మార్కండేయపురాణము, మున్నగువానియందున్న దేవాసుర సంగ్రామవర్ణనము బృహదారణ్యకోపనిషత్తులో గలదు.

"ద్వయాః ప్రాజాపత్యా దేవాశ్చా సురాశ్చతః కనీయసా
ఏవదేవాజ్యాయసా అసురా స్తఏషు లోకేష్వస్పర్ధంత"

అను నీ మంత్రముయొక్క వ్యాఖ్యానరూపమైయున్నది. దీని రహస్యము వేదమను పేరుగల అధ్యాయమునందు విశదముగా జెప్పబడియున్నది. దీనియందుగూడా బురాణములలోని త్రిభావముల పూర్ణతయొక్క విజ్ఞానము నిండియున్నది. దేవాసుర సంగ్రామము, ఆధిభౌతికము, ఆధిదైవికము, ఆధ్యాత్మికము- ఈ మూడువిధములుగాఁగూడ సమన్వయమగుచున్నది. స్థూలజగత్తునందు దైవీసంపత్తుగల మనుష్యులకును, ఆసురీ సంపత్తుగల మనుజులకును, బరస్పరము జరిగెడి కలహమునే శాస్త్రములందు ఆధిభౌతికమగు దేవాసుర సంగ్రామమని యనెదరు. భగవద్గీతలో నా రెండువిధములైన సంపత్తుల యొక్క లక్షణములిట్లు విశదీకరింపబడినవి.

"అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః
దానం, దమశ్చ, యజ్ఞశ్చ, స్వాధ్యాయ స్తప ఆర్జవం

అహింసా సత్యమక్రోధస్త్యాగ శ్శాన్తి రపైశునం
దయాభూతేష్వ లోలుపత్వం, మార్దవం హ్రీరచాపలం॥

తేజః క్షమా ధృతి శ్శౌచమద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత!॥

దంభో దర్పోఽభిమానశ్చ, క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానం చాభిజాతస్య, పార్థ! సంపదమాసురీం"॥

భయములేకుండుట, చిత్తశుద్ధి, జ్ఞానయోగస్థితి, దానము, దమము, యజ్ఞము, వేదపఠనము, తపస్సు, సారళ్యము, అహింస, సత్యము, కోపములేకుండుట, ఈవి, శాంతి, పిసినితనములేకుండుట, భూతదయ, నిందింపకుండుట, మృదుత్వము, లజ్జ, ధైర్యము తేజస్సు, క్షమ, స్థైర్యము, శౌచము, ద్రోహముచేయకుండుట, అమానిత్వము ఇవి దైవీసంపద్గుణములు.

దంభము, దర్పము, అభిమానము, కోపము, నిష్ఠురత్వము, అజ్ఞానము ఇవి యాసురీ సంపద్గుణములు.

ఈప్రకారముగా దైవీసంపద్గుణములు గలవారికిని ఆసురీ సంపద్గుణములు గలవారికిని సంభవించెడి విషాదము ఆధిభౌతిక దేవాసురసంగ్రామమని యందురు.

సూక్ష్మజగత్తునందు సత్వగుణమున కధిష్ఠానమైన చేతనాశక్తులు అనగా దేవతలకును, దమోగుణమున కధిష్ఠాతులైన చేతనాశక్తులు అనగా అసురులకును జరిగెడి సమరమునకే

దైవీజగత్తునందు దేవాసుర సంగ్రామమని వ్యవహరింతురు ఇది యాధిదైవిక దేవాసుర సంగ్రామము.

ఇక ఒక్కొక్క మనుష్యునిచిత్తములోనున్న అహింస, సత్యము, దయ, త్యాగము, శాంతి, ధృతి, క్షమ, మున్నగు దైవీసంపత్తులకును, దీనికి విరుద్ధముగానుండు హింస, కోపము, కామము, మోహము, ధైర్యములేకుండుట, లోనగు ఆసురీసంపత్తులకును నడుమ సర్వదా సంఘర్షణము జరుగుచునేయుండును. దీనినే ఆధ్యాత్మిక దేవాసుర సంగ్రామమని వచింతురు. సత్వ గుణము, తమోగుణముల ననుసరించి యీ రెండువృత్తులు మనుష్యుల నెల్లప్పుడును తమవైపునకు లాగుకొనుటకు బ్రయత్నించుచుండును. ఈ రెండువృత్తుల తగవులాటయే మనుష్యుల జీవనమును బ్రోత్సాహపరచెడి దానియొక్కయు, పురుషార్థము యొక్క రహస్యము. ఈ రెండువృత్తులలో దేనికి జయము కలుగునో యావృత్తియందు మనుష్యునకు వాంఛజనించును. తామసవృత్తికిఁ బరాజయము గలిగినచో మనుష్యుడు సాత్వికు డగును. సాత్వికవృత్తికిఁ బరాజయము సంభవించినచోఁ దామసికుండగును. ఒక్కొక్క యంతఃకరణమందు సాత్వికము, తామసికము అనఁగా దైవాసురీ వృత్తుల పరస్పరకలహమే ఆధ్యాత్మిక దేవాసుర సంగ్రామమనఁబడును. దేవాసురసంగ్రామ వర్ణనమునకుఁ బురాణములయందుఁ జెప్పఁబడినత్రివిధ భావపూర్ణత యిదియే.

## -*) గంగోత్పత్తి (*-

శ్రీ గంగాదేవి పుట్టుకనుగురించి హిమవత్పర్వతము నుండి జనించినదని యొకచోటను శివునిశిరమునుండి పుట్టినదని మరొకచోటను, విష్ణుపాదమునుండి యుద్భవించినదని యింకొక చోటను, బురాణములందు చెప్పబడినది. కాని యాగంగను ఆధిభౌతిక (స్థూలస్వరూప) ముగాను, ఆధిదైవిక (సూక్ష్మశక్తిమయ దైవీస్వరూప) ముగాను, ఆధ్యాత్మిక (జ్ఞానస్వరూప) ముగాను, క్రమముగా వర్ణించుటకొఱకై యట్లు చెప్పబడినదని గ్రహింపవలయును.

## -*) ఆధిభౌతిక గంగ (*-

స్థూలగంగ హిమాలయముయొక్క చరియలనుండి జనించినదనెడి సంగతి సత్యమే. ఎందులకనగా, ప్రత్యక్షముగా గన్పడుచున్నదిగదా. మహర్షులు గంగను హిమాలయమునుండి గంగోత్పత్తియగుచుండుట జూచినమీఁదగూడ నా శివుని మస్తకమునుండి గంగ పుట్టినదని వర్ణించిరి. దీనియందు గంగాదేవియొక్క ఆధిభౌతికము, ఆధిదైవికము, లనెడి రెండుమహిమలను జూపుటయే యా మహర్షుల యుద్దేశ్యమైయుండెను. ఎట్లు పరమాత్మ నిరాకారుడైనప్పటికి ననంతకోటి బ్రహ్మాండములుగల యీ ప్రపంచ మా మహాత్ముని స్థూల విరాట్స్వరూపముగానున్నదో (ఈ విశ్వరూపదర్శన మర్జునున కయినది)

అట్లే శివునకుగూడ విరాడ్రూపతత్త్వము భూమియని చెప్ప వలెను. శాస్త్రప్రమాణము లిట్లున్నవి.

"నభసోఽధిపతిర్విష్ణుః, అగ్నేశ్చైవ మహేశ్వరీ,
వాయోస్సూర్యః క్షితేరీశో, జీవనస్య గణాధిపః"॥

ఆకాశతత్వమునకు దేవత విష్ణువు అగ్నితత్వమునకు దేవత మహేశ్వరి, వాయుతత్వమునకు సూర్యుఁడు, పృథివీ తత్వమునకు ఈశ్వరుఁడు. జలతత్వమునకు దేవత గణాధిపతి యని యెఱుంగవలెను. కాఁబట్టి యీ తత్వవిచారణము వలన భారము ననుసరించి అధిదైవము శివుఁడు, అధిభూతము పృథివి. శివుని తెల్లనివర్ణము, పులితోలువలువలు, వల్లకాటి యునికి, పాములసొమ్ములుగలయాకారము, భావమయముగలమూర్తియై యున్నది అది యతని నిరాకార స్వరూపము ననుసరించి భావసంబంధముతో నిర్మింపబడినది. ఇట్టి భావమయమగు మూర్తిని భక్తులగువారు భావానుసారముగాజూతురు. కాని యే మూర్తితోచాటు గంగోత్పత్తి యొక్క సంబంధ ముంచబడి నదో యది శివుని భావమయమగు మూర్తి గాదు. కాని తత్వ ముల ననుసరించి విరాణ్మూర్తి యని తెలయవలెను. పృథివీ తత్వమునకు అధిదైవము శివుఁడు. అందువలన శివునియొక్క యాధిభౌతికస్వరూపము అనగా స్థూలశరీరము పృథివియై యున్నది. ఎప్పుడు పృథివి శివునకు విరాణ్మూర్తి యైనదో యప్పుడీ విచారణవలన హిమవత్పర్వతము శివుని శిరమగును.

ఎందులకనగా, శిరము సర్వావయవములకంటె నెత్తునుండు అంగము. హిమాలయముగూడ ప్రపంచములోని యన్నిటికంటె నున్నతమైనది. ఇందువలన హిమాలయమునుండి గంగ బయలు వెడలుటయు, శివుని జటాజూటమునుండి గంగ బయలు వెడలుటయు రెండును నొక్కమాటయే. ఇట్లు స్థూలగంగ హిమాలయమునుండి బయలుదేరిన తరువాతగూడ హిమాలయమును కేవలము హిమాలయమనిచెప్పక మహర్షులా శివుని విశాడ్భావముయొక్క సంబంధముతో గంగోత్పత్తిని వర్ణించియున్నారు. దీనిభావమేమన, మహర్షులీకాలపు పాశ్చాత్య విద్యాభిమానులగు మనుష్యులవలె దృష్టియున్నవారలైనయెడల ప్రతివస్తువును కేవలము స్థూలభావముతోడనే తీర్మానించి దానియందలి సూక్ష్మమును, ఆధ్యాత్మికభావమును నెగురగొట్టివేసెడివారే. గంగాదేవి నితరజలాశయముల మాదిరినో నీటిమడుగుగానో తలచియున్నచో కేవలము హిమవత్పర్వతమునుండి దానిపుట్టుక యైనట్లు చెప్పెడివారు. కాని యా మహర్షులాస్తికులు. సమస్తవస్తువులను త్రివిధభావములతో జూతురు. వారు త్రివిధభావపూర్ణత్వముగలిగియుండినవే సంపూర్ణములని తలంతురు. కనుకనే వారు గంగ నొక మడుగుక్రింద లెక్కపెట్టక దానిని దేవిగా భావించిరి. వారికి గంగయందు దైవీశక్తి కన్పడెను. ఈ దైవీశక్తిప్రకాశము మహాత్ముండగు ఆ శివుని యాశ్రయమునుండి వచ్చెను. శివుడు మహాశక్తికి

బతిమైనందున దైవీశక్తి కాధారభూతుడై యున్నాడు. అతని శిరమునుండి బయలుదేరిన గంగలో నంతులేని దైవీశక్తులు నిండి యున్నవి అందువలన ముల్లోకములను దరింపజేయు నదియు, బతితులను బవిత్రీకరించునదియు, నగు గంగయొక్క స్పర్శవల ననే శాపగ్రస్తమగు సగరచక్రవర్తి వంశ ముద్ధరింపబడెను. ఈ దైవీగంగ దేవదేవుండగు శివునిశిరమునుండి నిర్గమించినదనెడి దాని రహస్యమిదే. ఇట్లు శివుని విరాట్స్వరూపమువలన స్థూల గంగయు, శివుని దైవీసత్త నాశ్రయించుకొని శక్తిమయియగు దైవీగంగ ప్రకటమయ్యెను.

—*) ఆ ధి దై వి క గ ం గ (*—

ఇప్పుడు స్వర్గలోకమునందు మందాకినియనెడి పేరుతో బ్రకాశించుచుండిన గంగయొక్క దైవీశక్తినే భగీరథుడు సదా శివుని సాహాయ్యముతోఁ బ్రపంచమందలి మనుష్యులను నుద్ధరింప జేయుటకొరకై తన తపోబలము వలనఁ బ్రకటించియుండెను. గంగయొక్క దైవీశక్తియెట్టిదో యది వర్ణింపఁబడుచున్నది. ఈ విషయము విజ్ఞానసిద్ధము. ఎట్లనఁగా, జడపదార్థమునం దేశక్తి కన్పడుచున్నదో యదంతయు దైవీశక్తి, స్థూలమునాశ్రయించి యుండుటవలన భాసించుచున్నది. ప్రతి జడవస్తువులో నడిపెడి చేతనాశక్తి యున్నప్పుడే దానికిఁ గార్యములను గావించెడిశక్తి కల్గును. అనగా ప్రతిజడశక్తి, చేతనాశక్తి యొక్క యాశ్రయమువలననే సమస్త కార్యములను జేయు

చుండుననని యిదివరకే చెప్పబడినది. జడమగు గాలియం దేశక్తి యున్నదో యది వాయువును నడిపెడి చేతనాశక్తి. ఇదిలేని యెడల నేపనినిగూడ వాయువు చేయజాలదు. జడమగు అగ్నిలో నే శక్తి కలదో, యది యగ్నిని గలిగించెడి జేతనాశక్తి యెట్టిదిగూడ నందున లేనియెడల నేకార్యము నెప్పుడును జేయలేదు. ఈ చేతనాశక్తులన్నియు దేవతలనియో దేవుల నియో చెప్పబడును. ఇట్లే యే చేతనాశక్తి ప్రతాపముచేత గంగాజలము ప్రపంచమందనంత కార్యములను జేయుచున్నదో యా శక్తికి " గంగాదేవి " యని పేరు. ఈ గంగాదేవి యుండుట వలననే గంగాజలమునందనేక విధములుగా శరీరారోగ్యము గల్గించెడి స్థూలశక్తులును, మనస్సును, ఆత్మను, బవిత్రీకరించుటకు సూక్ష్మశక్తులును నున్నవి. గంగాజలమునందద్భుతమగు నే స్థూలశక్తి గలదో యేశక్తినిగూర్చి యిన్నాళ్ళకు తరువాత నేటికి పాశ్చాత్య విద్వాంసు లేవో కొన్నినిర్ణయములు గావించి యందఱకనులను దెఱచిరో యట్టి శక్తిని బ్రశంసించుట కొఱకే మహర్షులు గంగాస్తుతితో గ్రంథములకొలది నింపి వేసిరి.

కాని ఈ విషయమునే మన పూర్వమహర్షులు చెప్పినప్పుడు నమ్మకుండుటయు, పాశ్చాత్యపదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుల నోటనుండి వెడలిన నుడువులను నమ్మి గౌరవించుటయు, ననెడి దౌర్భాగ్యదశ పాశ్చాత్య విద్యాభిమానులగు అధునాతనులకు

బట్టినది. పదార్థ విజ్ఞాన (సైన్సు) వేత్తలు గంగాజలశక్తి విష యముగూర్చి యేదీ నిర్ణయింపనంతవరకు పాశ్చాత్య విద్యా భిమానులగు నధునాతనులు గంగలోని జలమును, బావియం దలి యుదకమును రెండు నొకరీతిగానే యుండుననియు, నీ రెండింటికి కెట్టిభేదము లేదనియు "హైడ్రోజన్ (Hydrogen) మరియు "ఆక్సిజన్ (Oseygen) లు రెండు గలిగినందువలన నేర్పడినదియుఁ దలఁచుచుండిరి. ఇప్పుడు వారికి గంగమీది గాలి, గంగమట్టి, గంగనీరు. మున్నగువాని నన్నింటియందు శరీరమునకు బుష్టికల్గించునదియు, ఆరోగ్యమును గూర్చునదియు నగు శక్తి గలదని జాడ తెలసినది. గంగమట్టి యొంటికి రుద్దు కొనుటవలన చర్మరోగములన్నియు నశించును. గంగనీటిలో స్నానమొనర్చినందువలన శిరోరోగములు రూపుమాయును. గంగమీదిగాలి సోకినందువలన శరీరమున కెట్టి రోగములు నుండవు. గంగోదకమును దాగినందువలన అజీర్ణరోగములు పోవుటయే కాక జీర్ణజ్వరము లోనగు కఠినవ్యాధులుగూడ మటుమాయమగును. ఇంతే కాదు ఇంకను పదార్థవిజ్ఞాన (సైన్సు) వేత్తలగు గొప్పగొప్ప వారు, గంగాజలమందు దుర్బలుండగు రోగియొక్క రోగము పోయినతరువాత బలమొసంగెడి యొక యపూర్వశక్తి గలదనియు, శరీరపుష్టి నభివృద్ధిపరచుకొన దల చినవారికి వేరుగా డాక్టరుల టానిక్కులఁ బుచ్చుకొన నవస రము లేదనియు, కేవలము గంగాజలముయొక్క స్నాన పాన

ములవలననే శరీరమునకు సంపూర్ణబలము గలుగుననియు, వచించిరి. చూచితిరా! బావి మున్నగువాని జలము రెండు, మూడు రోజులలోనే చెడిపోయి ద్రాగుటకుదగినదిగానుండదు. కాని గంగోదక మెంత దూరదేశమునకైనను దీసికొనిపోయి సంవత్సరములకొలది నిలువయుంచినప్పటికిని నెంతమాత్రము చెడిపోదుగదా. మొదటనుండినట్లే కమ్మగా ద్రాగుటకుయోగ్యముగానుండును. సాంక్రామికములగు విషూచి, మశూచి, మహామారి, లోనగు జాడ్యము లెన్నియున్నవో యీ పాడు రోగములన్నియు దరుచుగా బాడునీటను, పాడుచోటను, పుట్టుచున్నవి. "మలేరియా" "ప్లేగు" "కలరా"లోనగు రోగములిట్లే చెడుపురుగులవలన బయలుదేరుచున్నవి. కలరాపురుగులు నీటియందే యెక్కువగాఁ బుట్టుచున్నవి. కాని పరీక్షింపఁగా గంగాజలమునం దెప్పుడుగూడ నేరోగమునకు సంబంధించిన కీటము గూడ పుట్టదు ఇంకను రోగపు కీటము దీసికొనివచ్చి గంగాజలమునందు విడిచిపెట్టినప్పటికిని నది చచ్చిపోవును. గంగోదకమునం దిట్టి యపూర్వశక్తి యున్నది. ఈ విషయము గూర్చి విజ్ఞాన శాస్త్రవేత్తలగు పాశ్చాత్య విద్వచ్ఛిరోమణు లెట్లు చెప్పుచున్నారో చూడుడు.

' Mr. Hankins, the sceintist in the employ of the Government at Agra, Concluded to examine the water. He went to Benares and made his tests. He got water at mounths of sewers where they empty into the river at the bathing ghats. A cubic centimetre of it contained millions of

cholera germs. At the end of six hours, They were all dead. He caught a floating corpse, towed it to the shore and from beside it he dipped up water that was swarming with cholera germs. At the end of six hours they were all dead. He added swarms after swnrms of cholera germs to this Ganges water. Within six hours they always deid, to the last sample. Repeatedly, he took pure well water which was barren of animal life and put into it a few cholera germs. They always began to propagate atonce and always within six hours they swarmed and were numberable by millions upon millons.'

**Mark Twain.**

ఇట్టి వనేకములుగలవు. కనుక నే మహర్షులు గంగాస్తుతి నింతగా జేసిరి. ఎట్లన.

"శరీరే జర్జరీభూతే, వ్యాధిగ్రస్తే కళేబరే
ఔషధం జాహ్నవీతోయం, వైద్యో నారాయణోహరిః"॥

శరీరము, శిథిలము, రోగగ్రస్తము నయినమీఁద గంగోదకము ఔషధము శ్రీమన్నారాయణమూర్తియే వైద్యరాజు గంగాజలమే మంచియౌషధము. ఇదంతయు గంగోదకములోని జడశక్తి లక్షణము. ఈ జడశక్తికి మూలస్వరూపిణియగు చేతనాశక్తి ప్రపంచములో గంగాదేవిరూపముగా బ్రసిద్ధిని జెందియున్నది. ఈ శక్తిమహిమ సమస్త హిందూశాస్త్రములందును వర్ణింపబడియున్నది. ఎట్లన, గంగ స్పర్శవలననేకాదు, గంగను దలంచుటవలననుగూడ బాపములంతరించును. ఋగ్వేదమందిట్లు స్తుతింపఁబడినది-

" ఇమంమే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం స చ త "

ఓ గంగా! యమునా! సరస్వతీ! శుతుద్రీ! మీరు నా యజ్ఞము నందు పాల్గొనుడు! ఇందు గంగ మున్నగువాని యధిష్ఠాన దేవతల యాహ్వానము జేయబడినది. రామాయణములో సీతా దేవి యిట్లు నుడువుచున్నది -

" త్వంహి త్రిపథగే! దేవి! బ్రహ్మలోక సమక్షమే
సాత్వం దేవి! నమస్యామి ప్రశంసామిచ శోభనే॥

ఓ దేవీ! నీవు స్వర్గ, మర్త్య, పాతాళలోకములు మూడింటియందును మూడురూపములతోఁ బోవుచున్నావు. బ్రహ్మలోకము నుబొందించెడి యో దేవీ! నీకు నమస్కరించు చున్నాను. నిన్ను స్తుతించుచున్నాను.

ప్రపంచములో శక్తికే పూజజేయుచున్నారు. గాని రక్తమాంసములకు సల్పుటలేదు. శక్తియే యితరుల చిత్తముపై దన ప్రభావమును జూపగల్గుచున్నది. శక్తిమంతుండగు పురుషుఁడే తనవాక్కుద్వారా, కార్యములద్వారా యందఱచిత్తముల నాకర్షింప గలుగుచున్నాఁడు. ఎవనికి శక్తియుండదో వానికేదియు లొంగదు. నేఁడు గంగ నింతగా నిందించినను, దానిమహిమను నెగురగొట్టివేయుట కంతగా ప్రయత్నించినను గూడ లక్షలకొలఁదిఁ గోట్లకొలఁది మనుష్యులా గంగనామమును వినినంతమాత్రముననే భక్తిభావవశులై దాని పవిత్రజలము నందు స్నానముగావించి సమస్తపాపములు నశించినవనియు,

మోక్షము ప్రాప్తించుననియు, దలంచెడివారుగలరు సాధారణ పర్వము సంభవించనప్పుడుగూడ మిక్కిలి నష్టకష్టములకోర్చి హరిద్వారము, కాశీ, మున్నగు తీర్థములకుంబోయి స్నానము జేసి యాత్మను బవిత్రీకరించుకొందురు. గంగయందిట్టి మహత్తర దైవీశక్తియే లేనియెడల నీరీతిగా నెప్పుడు సంభవించి యుండెడిదిగాదు, ఇదంతయు గంగాదేవీశక్తి పరిచయమై యున్నది.

విగ్రహారాధనమందలి రహస్యము ముందుచెప్పబడును. ఈ విషయము గుర్తెరింగినమీాద హిందువులు పాషాణములు మున్నగువానితో నిర్మింపబడిన బొమ్మలను పూజింపరనియు, నా విగ్రహములద్వారా తమశ్రద్ధా, భక్తి, క్రియలు లోనగు వానిబలముతో సర్వవ్యాపకుండగు భగవంతుని శక్తిని బ్రకటించి దానినే యారాధింతురనియు, దెలియగలదు. భక్తలోకమం దేభక్తి, క్రియ, శ్రద్ధలయొక్క శక్తియున్నదో యా శక్తియే భగవంతునియందున్న దైవీశక్తిని విగ్రహ సాధనము ద్వారా ప్రకటింపజేయగలదు. విగ్రహము కేవలమొక సాధన మైయున్నది. దానియందు భగవచ్ఛక్తి, సాధకు (భక్తు) నకు శ్రద్ధ, క్రియ, భక్తి, మున్నగునవి గాఢముగా నున్నప్పుడే ప్రకటమగుట సంభవించును. ఈ విజ్ఞానము ననుసరించియే గంగాజలములో దైవీశక్తి యున్నది. అనంగా ఏ గంగయొక్క దైవీశక్తి మందాకినీరూపముతో దేవలోకమందు వ్యాపించి

యున్నదో దానినే భక్తుండగు భగీరథుఁడు తన తపోభక్తి బలముచేత మర్త్యలోకమునకు గంగాదేవీరూపముగాఁ బ్రక టించి యుండెను. ఈ విజ్ఞానము నీ క్రిందిరీతిగాఁగూడ బోధ జేసికొనవచ్చును. ఎట్లన, సూక్ష్మశక్తియొక్క ఘనీభావము నుండియే స్థూలవస్తువు నిర్మాణమగు ననెడి విషయము పదార్థ విజ్ఞాన (సైన్సు) శాస్త్రమువలనసిద్ధించియున్నది. సూక్ష్మశక్తి యందు స్పందన మతిశయమగుటచేత సూక్ష్మతనశించి స్థూల త్వము వచ్చును. ప్రలయసమయమునందు స్థూలవస్తువులన్నియు నశించి శక్తిమాత్రమే నిలిచియుండును. మరల సృష్టిసమయ మందాశక్తియే తిరుగుచు దట్టమై స్థూలప్రపంచరూపముగా మారిపోగలదు. హిందూశాస్త్రముయొక్క సిద్ధాంతములో గూడఁ బ్రలయగాలమందు దృశ్యమగు స్థూలప్రపంచము నష్టమై ప్రకృతిగర్భములో లయింపగలదనియే యున్నది ప్రకృతి, భగవంతునిశక్తి. అదిగూడఁ బరమాత్మయందు లయమగును. ఇట్లు హిందూశాస్త్రములలో సూక్ష్మశక్తిలోనుండి స్థూలజగత్తు వికాసము కాగలదని లిఖింపబడియున్నది. గంగయొక్క యేసూక్ష్మమగు చేతనశక్తి మందాకినీరూపముగా దేవలోకము నందు విరాజిల్లుచున్నదో యదే భక్తుఁడగు భగీరథుని తపో బలముచేత ద్రవించి స్థూలమగు గంగారూపముతో శివుని జటాజూటమునందు బ్రవహింపఁదొడంగెను. ఇదే గంగాదేవీ ప్రకటమయ్యెడి రహస్యము.

## -*) ఆధ్యాత్మిక గంగ (*-

మూడవది ఆధ్యాత్మికగంగ. దీనినే జ్ఞానగంగయని చెప్పెదరు. దీనినిగురించి శ్రీ. శంకరభగవత్పాదాచార్యుల వారు.

"జ్ఞానప్రవాహా విమలాదిగంగా"

జ్ఞానరూపమగు ప్రవాహముగల గంగ. విమలమైన యాదిగంగ అని యిట్లు స్తుతించిరి. ఆ గంగ యుత్పత్తి విష్ణుమూర్తినుండి యైనది. విష్ణుమూర్తి పరమాత్మయొక్క చిత్సత్తలేక జ్ఞానసత్తకు గేంద్రరూపమై యున్నాడు. కనుక నతనినుండియే జ్ఞానగంగ యుద్భవించినదనుట విజ్ఞానసిద్ధమైనది. దీనినే కొన్నికొన్ని పురాణములందు సదాశివుని నాట్యమును జూచి విష్ణుమూర్తి ద్రవించెననియు, ఈద్రవమునుండి గంగ బయలువెడలెననియు వర్ణించినవి. ఇదంతయు వైదానిభావమే. కనుకనే గంగకు బ్రహ్మద్రవ యని నామము. ఏ విష్ణుపదము నుండి గంగ బయలుదేరినదో దాని తాత్పర్యము విశేషముగా సుగమముగానే యున్నది. బ్రహ్మపద మనినందువలన నెట్లు బ్రహ్మభావరూపమగు తాత్పర్యము బోధపడుచున్నదో యట్లే విష్ణుపద మన్నందువలన సర్వవ్యాపకుండును, చిన్మయుండును, నగు విష్ణుభగవానుని విష్ణుభావము బోధపడగలదు. అనగా "పద" శబ్దమిచ్చట భావమును బోధించునది. ఇదే గంగాదేవియొక్క యాధ్యాత్మిక స్వరూపము.

ఈ రీతిగా గంగాస్వరూప విషయమునుగురించి పురాణములందు జెప్పబడిన త్రిభావముల పూర్ణత. పురాణములలోని గంభీరములను రహస్యములనుగూర్చి యెంతగా విచారించెదమో యంతగా సంతట ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములనెడి యీ మూడుభావములయొక్క పూర్ణత్వము దృష్టిగోచరము గాగలదు.

(3) పురాణముల మూడవపూర్ణత్వము:- త్రిగుణములననుసరించి త్రివిధమగు అధికారవర్ణనమందున్నది. ప్రపంచము త్రిగుణమయము. కాబట్టి ప్రపంచమునందు మూడువిధములుగా నుండు అధికారులుందురు. ఈ త్రివిధాధికారులకును శుభము గల్గించుటయే పురాణముల మహిమ.

పురాణములు సాత్త్వికులగు అధికారులకొరకై పరమహంస సంహితలుగా నున్నవి. వీనియందు ముముక్షువులగు జీవులకొరకపూర్వమైన వైజ్ఞానికతత్త్వము వర్ణింపబడినది. పరాత్పరుండగు పరబ్రహ్మ, సృష్టికంటె నతీతుడును, ప్రకృతికి బరుండునై యున్నాడు. మాయ యతనిని స్పృశింపనేరదు. దాని యపూర్వసత్త సమస్త జీవులయందు విరాజిల్లుచున్నది. కాని జీవుడవిద్యాగ్రస్తుడైన కారణమున దాని సత్తను గుర్తెరుంగజాలడు. జన్మ జన్మాంతరములందు చేసిన తపస్సు నిష్కామ కర్మలద్వారా చిత్తమందున్న మలినమంతయు నష్టమైనందువలన స్వయంప్రకాశుండగు భగవంతుని

పవిత్రిసత్త, యీ నిర్మలాంతఃకరణములో బ్రికటమై సాధకు నకు నిర్వాణపదము చేకూర్చగలదు. ఇదే సాత్వికాధికారుల కొరకు బురాణరూపములైన పరమహంస సంహితలయొక్క పరమాపూర్వమైన యుపదేశము.

ఇట్లే రాజసికులగు అధికారులకొరకు సకామ కర్మ లును సకామోపాసన నుపదేశించి పురాణములు వారికి స్వర్గాది దివ్యలోకములందుండు సుఖముల యుపభోగము కల్గించి క్రిమక్రమముగా సున్నతలోకమును జేకూర్పగలవు. పురాణములలో సకామ వ్రతములయు, ఇష్టాపూర్తాది సకామ కర్మములయు, వర్ణనమున్నది. ఇట్టి కర్మలను యథావిధిగా నను ష్ఠించినందువలన గలిగెడి ఫలరూపమువలన నీ జీవుడు దివ్య విమానమెక్కి స్వర్గలోకమునకు జేరి యందలి యపూర్వ భోగ ములను భోగించును. తరువాత నీ జీవుడు కర్మఫలావసానము నందు భూలోకమునకువచ్చి కర్మఫలముయొక్క నశ్వరత్వము నెరింగి, జ్ఞానముద్వారా మోక్షమును బొందును. ఈ రీతిగానే భగవంతుని సకామోపాసనద్వారాగాని, దేవ, దేవి, ప్రికృతి భగవచ్ఛక్తుల సకామోపాసనద్వారాగాని, యుపాసకుల నైహికా ముష్మికములందుండెడి వివిధ సుఖముల ననుభవించుట కధికారులనుగా జేసి యొకప్పుడు విష్ణులోకమందును మరియొక ప్పుడు విష్ణుమూర్తియొక్క యపూర్వ వనములో మనోహర ములగు పూలచాళ్ళలో దుమ్మెదగను, వేరొకప్పుడా వన

మందు సంచరించుచు బుష్ప పరిమళము నాఘ్రాణించు శ్రీ భగవంతుని పార్శ్వమం దుండువాఁడుగను, నింకొకప్పుడు కైలాసమునందు శివంకరుడగు శంకరుని శాంతిమయమగు సౌధమునందు భగవతియొక్క పాదసేవకుఁడుగను, తిరిగి యొకప్పుడు కుబేరుని ధనబాండారములో బహుళైశ్వర్యాధికారిగను జేసి పురాణమే తిన్నతిన్నగా నా జీవున కున్నతి గలిగింపఁగలదు.

ఎవరికి ధర్మము ధర్మరూపముగాను, ధర్మ మధర్మరూపముగాను గనుపడుచున్నదో యట్టి తామసికులగు నధికారులకు ఘోరనరకభయమును జూపించి నరకమందు పాపిష్ఠుల నెట్టెట్టి కఠిన హింసల బెట్టెడి సంగతియొక్క యపూర్వ యథార్థ విషయములను వర్ణించి పురాణములే యా తామసికాధికారులను ధర్మమార్గమునందు బ్రవర్తించునట్లు ప్రేరేపించును. ఇదే పురాణములలోని యపూర్వమహిమయు, విశ్వకల్యాణ కారిత్వము నైయున్నది.

(4) పురాణముల నాల్గవపూర్ణత్వము:- సకలవిధముల నున్న జీవులకు నాధ్యాత్మికోన్నతి సాధించుటయందు గలదు. నిత్యానంద ప్రవాసులగు జీవులు కొందఱు ఆనందముకొఱకై ప్రాతఃకాలమునుండి సాయంకాలము వఱకును, సాయంకాలము నుండి ప్రాతఃకాలమువఱకును, గఠినముగా గష్టించి యానందము

నకు మారుగా విషయరూపమగు విషజనిత హింసను బొందుచున్నారు. జ్ఞాన పిపాసువులగు జీవులు కొందరు జ్ఞానము నెఱుంగుటకు రేబవలును బరిశ్రమించినప్పటికిఁగూడ మాయ ద్వారా మూఢులై యజ్ఞానరూపమగు మరీచిక (ఎండమావుల) లో నాఁక యెండి హాహాకారము చేయుచున్నారు. ఇట్టి జ్ఞానభ్రాంతులు ప్రేమభ్రాంతులు నైన ద్వివిధజీవుల కొఱకుఁ బురాణములు మార్గదర్శకములుగా నున్నవి. పురాణమే సంసారసముద్రమునందు మున్గి తేలుచున్నదియును, విపత్తులనెడి పెక్కు తరంగములచే నిండినదియు జీవరూపియగు నావకు ధ్రువతార. ఈ పురాణములనే యాశ్రయించుకొని యజ్ఞానులగు జీవులెందరు ప్రకృతిరాజ్యము నతిక్రమించి బ్రహ్మపదమును బొందినవారిసంఖ్య యింతయని యెవరు చెప్పఁగలరు? పురాణములే లేనియెడలఁ గఠినములగు ముండ్లతో నిండిన వేదముల కఠినమార్గమం దెవఁడడుగిడ గలఁడు? వేదమందలి కఠినభాషలను, మరియు గఠినభావములను పురాణములు తమ సరళభాషలద్వారా, సరళభావముల ద్వారా స్పష్టముగాఁ దెలియఁజేయనియెడల సమస్తజీవులు పవిత్రమగు వేదజ్యోతిని జూడఁజాలక యంధకారమయమగు సంసారకూపమందు బడియుండెడివారు. దర్శనశాస్త్రములు పరమతత్త్వమును సాక్షాత్కరింపఁజేయుటకై దివ్యములగు నేత్రములరూపముగా నున్నవి. కాని యిట్టి దివ్యనేత్రముల

నెంతమంది జనులు బొందఁజాలుదురు? దర్శనాధికారులు కొలదిగా నుందురు. కేవల పురాణములమహిమచేతనే కఠినమైన దార్శనిక సిద్ధాంతము సులభ భాషలోఁ బ్రకటమగుచు మిక్కిలి సామాన్యాధికారులకుగూడ నాధ్యాత్మికోన్నతి కా పురాణములు కారణమగుచున్నవి.

(5) పురాణముల యైదవ పూర్ణత్వము:- కర్మోపాసనను, జ్ఞానతత్వనిర్ణయమును జేయుచు గర్మయోగముయొక్క యాత్మత్యాగమును, జ్ఞానగంభీరిమను భక్తి మధురిమను వర్ణించుటయందుఁ గలదు. ప్రపంచమం దధికారులు మూడు తెరంగులనుందురు. (1) రాజసిక, తామసిక ప్రకృతిగల జీవులు కర్మాధికారులు, (2) రాజసిక సాత్విక ప్రకృతిగల జీవులుపాసనాధికారులు, (3) సాత్విక ప్రకృతిగలవారు జ్ఞానాధికారులుగ నుందురు. పురాణములకు జీవులపైఁగల యపూర్వ కరుణయేమనఁగా ఈ త్రివిధాధికారుల కల్యాణముకొఱకై అవి తమ విరాట్శరీరమును మూడు భాగములుగ విభాగించి కర్మిష్ఠులకొఱకు గర్మప్రధానభాగమును, నుపాసకులకు నుపాసనాప్రధానభాగమును, జ్ఞానులకు జ్ఞానప్రధానభాగమును, నర్పించినవి. ప్రతి పురాణమందును సర్వవిధాధికారులకు శుభముఁగూర్చు విషయము లున్నప్పటికిని బురాణముల నన్నింటిని ముఖ్యముగా మూడు కక్ష్యలలో (తరగతులలో) విభజింపవచ్చును. ఎట్లనగా (1)కర్మప్రధానముగాఁగలవి మహాభారతము

మున్నగునవి. (2) ఉపాసన ప్రధానముగాఁగల పురాణములు శ్రీమద్భాగవతము లోనగునవి. (3) జ్ఞానము ప్రధానముగా గలవి యోగవాసిష్ఠాది పురాణములు. యోగవాసిష్ఠమును మహా రామాయణమనికాని, రామాయణమని కానీ యచ్చటచ్చట వ్యవహరించుచుందురు. ఇందువలనజ్ఞానప్రధానములని రామా యణాదులనుగూడఁ జెప్పవచ్చును.

మర్యాదా (శాస్త్రవిహితానుష్ఠాన గరిష్ఠుఁడు) పురుషోత్తముండగు శ్రీరామచంద్రుని లీలను వర్ణించెడి వాల్మీకీయ రామాయణముగూడ ధర్మజ్ఞానములను లభింప జేయుటలో నుపకారకమైనందున జ్ఞానప్రధానమేమైయున్నది.

మహాభారతమం దొక్క కర్మక్షేత్ర మెంత విశాల ముగ నున్నదో యే విశాలకర్మయజ్ఞమునకు దేవత యజ్ఞేశ్వ రుండగు శ్రీమన్నారాయణుఁడై యున్నాఁడో యే కర్మయజ్ఞ మందు హోతలుగ సమస్త దేవర్షి పితృగణములున్నవో, యెద్దానియం దాహుతులుగ అష్టాదశాక్షౌహిణీసేన (వీర పురుషగణము) యున్నదో, యే కర్మయజ్ఞమునకు ఫలముగ సంసారమందలి గొప్ప భారమును హరించుటయు, నధర్మ మును, మూలసహితముగా నిర్మూలించుటయు, ధర్మరాజ్య మును స్థాపించుటయు గలదో, యేకర్మయజ్ఞములో వీరత్వము యొక్క పూర్ణత్వము, ఔదార్య పూర్ణత్వము, క్రూరత్వపూర్ణ

త్వము, ధర్మభావపూర్ణత్వము, స్వార్థత్యాగపూర్ణత్వము,విరోధ పూర్ణత్వము, లోకశిక్షాపూర్ణత్వము, జ్ఞాన, విజ్ఞాన, పూర్ణత్వము, నీ ప్రకారముగా బూర్ణత్వముయొక్క పరాకాష్ఠయై యున్నదో యేకర్మయజ్ఞమందు వ్రతిమై గ్రుడ్డివానికి దివ్య నేత్రలాభము గల్గినదో, కుంటివాఁడు హిమవత్పర్వతము నెక్కిపోయెనో, మరియు సాక్షాద్భగవంతునకుగూఁడ దన ప్రతిజ్ఞను భంగము చేసికొనెడి దశపట్టినదో, యిట్టి కర్మప్రధానమైన మహాభారతముద్వారా పురాణములు ప్రపంచకల్యాణమొతగా జేసినవో దానిని వర్ణించుట కలవి కాజాలదు.

ఇట్లే యుపాసనాప్రధానములగు భాగవతాదుల యందు భక్తియొక్క యపూర్వలీల పుణ్యచరితుండగు పరమేశ్వరుని యపూర్వ గుణకథ చతుర్దశరసముల యపూర్వమధురిమ, యా గ్రంథముల ప్రతిపత్రమును బవిత్రీకరించుచున్నవి. భగవంతుఁడు నిర్గుణుఁడు, నిరాకారుఁడు నైనప్పటికిని యే భాగవతాది పురాణములందు మహిమ ప్రకటించుటకొరకు నానా ప్రకారములుగా మనోహరమును, నయనపర్వమును చిత్తచాతకినుల కమృత ధారామయమును నగు సగుణ రూపమును ధరించి ప్రపంచములో భక్తినదిని బ్రవహింపజేసెనో, దేనిని భక్తులు సర్వదా సేవించి భావసముద్రమందు స్నానమొనర్చుచున్నారో, యేభాగవతమున కిట్టి ప్రశంసయున్నదో

"నిగమకల్పతరోర్గలితం ఫలం
శుకముఖా దమృతద్రవసంయుతం
పిబతభాగవతం రసమాలయం
ముహురహో రసికా భువిభావుకా."

భాగవతము వేదమనెడి కల్పవృక్షమునుండి వచ్చిన రసాల ఫలము. శుకముఖమునుండి స్రవించు అమృతరసముతో గూడుకొన్నది. ఇందువలన సుజనులైన రసికులారా! యిట్టి భాగవతరూప ఫలరసమును ముక్తిదొరకుకువరకు మాటిమాటికి బ్రసన్నతాపూర్వకముగా బానముసెప్పుడు. ఆ యుపాసనా ప్రధానములగు భాగవతాది పురాణములయొక్క జగత్కల్యాణ కారిత్వవిషయమును గురించి యెంత చెప్పినను దక్కువయే సుమీ.

జ్ఞాన ప్రధానములగు యోగ వాసిష్ఠాది గ్రంథముల ద్వారా కఠినమును, నతిగహనము నగు జ్ఞానవిషయములను మిక్కలి మధురముగా కథలద్వారా చిత్తములో నాటునట్లు జొనిపి, దాని నిర్మల జ్యోతిస్సుచేత నజ్ఞానాంధకారమును దూరీకరించి జ్ఞానుల నెట్లు ప్రకాశవంతులనుగా జేసెనో యది వర్ణింప నలవికానిది. ఏ యోగవాసిష్ఠగ్రంథమునకు వక్త జ్ఞానధనియగు వసిష్ఠమహర్షియో, యెద్దానికి శ్రోత పూర్ణబ్రహ్మంబును నారాయణుండును నగు శ్రీరామచంద్రమూర్తియో, ఎద్దానివినుటచేతను, మననము చేయుటచేతను, నిది ధ్యాసము

చేయుటచేతను, గలిగిన ఫలరూపమైన యమృత ఫలము నాస్వాదించుటద్వారా శ్రీరామచంద్రుని శాంతములేని స్వాంతమునకు శాంతిగల్గినదో, యట్టి యోగవాసిష్ఠము మున్నగు జ్ఞానపరిధానములగు పురాణముల విషయమై యేమి చెప్ప గలము? పురాణములద్వారా యీ విశ్వమున కిట్టి కల్యాణము గల్గుచున్నది.

(6) పురాణముల యాజవపూర్ణత్వము:-ఇది పరమాస్తిక్య మునందున్నది. పాఠకులారా! మీరొకచోటనే సకలవిధము లగు పూజా పద్ధతులు తెలిసికొనవలయునని కోరికయున్న యెడల నప్పుడు పురాణములను జూడుడు. మీ తపించెడి హృదయమును ఆస్తికతా రూపమగు అమృతధారతో నింప దలచుకున్న యెడల బురాణముల నాశ్రయింపుడు. పురాణము సంసారరూపియగు మరుభూమికి మహోద్యానము వంటిది. మహోద్యానమనగా యెడారియందుండు తోట. పురాణ ములు దుఃఖదావానలముచే దగ్ధమైన హృదయములు గలవార లకు గంగాదేవి శీతల జలధారలవంటివి. పురాణములలో నిర్గుణోపాసనముయొక్క యుత్తమాధికారమును, సగుణో పాసనముయొక్క మధ్యమాధికారమును, అవతారోపాసన యొక్క యపూర్వమగు మహత్తును, నున్నది. పురాణములలో మూర్తిపూజ, రూపవిజ్ఞానముయొక్క అపూర్వ భాండారము నిండియున్నది. పురాణములందు ఋషి, దేవ, పితృరూపము

లగు నిత్యశక్తుల యపూర్వ మహిమ యున్నది. ఇంక నేమి చెప్పగలను? భూతప్రేతాదులయొక్క నికృష్టోపాసనగూడఁ బురాణములందున్నది. పురాణములలో ఆస్తికత పూర్ణముగా నున్నది. ఈ పూర్ణతకొరకొక్కొక్క దేవత పేరుతోడను నొక్కొక్క యవతారముయొక్క నామముతోడను నామకరణము చేసికొని పురాణములు ధన్యములయ్యెను.

నేటికాలమున విష్ణుపురాణములు లేకపోయినట్లయిన యెడలవిష్ణు భగవంతుని యపూర్వమహిమ జగత్తునందలి జీవులకు హృదయగోచర మెట్లుగాగలదు.

నేడు దేవీ భాగవతము లేనియెడల దేవియొక్క రాక్షస మర్దనము, దేవాసుర సంగ్రామములోని దైవీశక్తి యొక్క మాహాత్మ్య ప్రకటనము లలజ్జిహ్వాయు, వికటదంతయు, రణరంగిణి యగు శ్యామాదేవియొక్క భయంకర గర్జనము అట్టహాసము, (పెద్దనవ్వు) ల ద్వారా రాక్షసుల హృదయములను జీల్చి వేయుట, ఆసురీశక్తిని మూలసహితముగా నిర్మూలించుట, మనుష్యుల కెట్లు దెలియగలదు?

నేఁడా మత్స్య పురాణము, కూర్మపురాణము, వారాహ పురాణము, లోనగు పురాణములు లేకపోయినచో నవతారముల యపూర్వలీలా విభూతుల యపూర్వమహిమ ప్రపంచమున కేవిధముగా గోచరింపగలదు?

సమస్త జగత్పరిపాలనార్థమై దేవమహర్షి పితృశక్తుల ద్వారా యేప్రకారముగా జగత్తు రక్షింపబడుచున్నదో, యే పరమశక్తి యున్నందువలన జగచ్చక్రపుగతి నిర్మింపబడినదో యీ సమస్తశక్తుల విలాసమును వర్ణించి యాస్తికతయొక్క పరమభావముతో హృదయమును బూర్ణముజేయునది పురాణమే

(7) పురాణముల యేడవపూర్ణత్వము ఇది సమస్తభావములను సమన్వయించుటయందు గలదు. పురాణములందు సర్వవిధములనుండు చిత్తవృత్తుల కానందము గల్గించెడి విషయ సమూహముల సమావేశ మున్నది.

జ్ఞానగంభీరులగు పాఠకులారా! మీరు జ్ఞాన గాంభీర్యముచే బూర్ణుండైనవాని ముఖకాంతిని జూడవలెనని యిచ్ఛయున్నచో బురాణములందు గనుడు.

భక్తితత్పరులారా! మీరు భావ గాంభీర్య సముద్రమందుస్నానముచేయ సంకల్పమున్నచో బురాణములను గాంచుడు! మీ యెదుట బురాణములలోని క్షీరసముద్రము. దధిసముద్రము, అమృతసముద్రము మున్నగుసప్తసముద్రముల తరంగములమీద దరంగములుద్భవింపజేసి యొకప్పుడు పిచ్చివానివలె నాట్యమొనర్చుచుండును. ఇంకొకప్పుడు తన సుడిగుండములవలన వారిరబ్ధలీలలను బ్రకటించుచుండును. మరి

యొకప్పుడు ప్రచండంబగు గాలితోఁగూడ ఘోర యుద్ధమొనర్చి ప్రళయముయొక్క పూర్వరూపమునుజూపించును. ఇంకొకప్పుడు పుష్పముల భారమును నెదురురొమ్ముపై బెట్టుకొని యే విరాట్పురుషునికో మహాపూజగావించుటకై తరంగములమీద దరంగములు లేచి నటించుచుండును.

సువాసనాప్రియులగు జీవులారా! మీరు పూల సువాసన నాఘ్రాణింపదలచితిరేని చూడుడు! మీకొరకుబురాణములు పారిజాతము, హరిచందనము మున్నగు, పుష్పముల భారముతో వంగి నందనవన శోభను మీ కంటెదుట విరాజిల్లజేయుచున్నవి. అటుజూడుము. సుగంధగంధవహుండగు ననిలుండా దివ్యపుష్పముల సుగంధమును వహించి యాడుచు నాడుచు వచ్చి మీ ఘ్రాణేంద్రియమున కపూర్వప్రీతి సంపాదించుచున్నది.

ఓసుకవీ! మీరు కవిత్వమనెడి యందమగు కాననమందు విహరించెడి కురంగిణీ (లేడి) విహారమును జేయింపదలచితివో కనుము. మీ యెదుటబురాణములలో నపూర్వమగు కవితాకానన మున్నది. ఈ కవిత్వకాననమును నిర్మించినవారు త్రికాలదర్శులగు మహర్షులు. ఈకాననమందు సలిలరూపులగుమహర్షుల భక్తిరూపమగు అమృత ధార యున్నది. దానిలో విలాసము జేయవలయునని యిచ్ఛయున్నచో మీ సేవకొరకు బురాణములున్నవి. ఈప్రకారముగా బురాణములు సర్వవిధాధికారులకు

సర్వవిధములను నందమును బ్రకటించుచు సర్వజనులకు బ్రీతి పాత్రము లగుచున్నవి.

(8)పురాణములయెనిమిదవ పూర్ణత్వము:-ఇదిధర్మసంకటముల చర్చయందుకలదు. మహాభారతాదులను జదివినవారు పౌరాణికములగు చరిత్రిలలో నెన్ని ధర్మసంకట విషయములు వచ్చుచున్నవో యవ్వాని కన్నిటికిని బురాణములలో నిచ్చిన సమాధానము లేఁయున్నవో, వానినన్నింటెని లక్షించి చూచినయెడల బురాణములలోనియపూర్వమహిమ గుర్తెరుంగ జాలుదురు. మరియు పురాణము లుపదేశ భాండారములును సంసారరూపమగు ఘోరారణ్యములో దారితప్పిన జీవులకు రాజమార్గమును జూపించి హాయిని గూర్చునవియు నని తెలియ గలదు. కర్ణుఁడింకను జావలేదు. ఇతనిని చంపనందులకు యుధిష్టరుఁడర్జునుని గాండీవమును నిందించెను. ఆ సమయమందా పార్థుడది వినినతోడనే తన సత్యప్రతిజ్ఞను సంరక్షించు కొనుటకై తన దివ్యధనస్సును నిందించెడి తన జ్యేష్ఠభ్రాతయగు ధర్మరాజును వధించుటకు సంసిద్ధుఁడయ్యెను. ఎందులకనగా, అతని ప్రతిజ్ఞ గాండీవమును నిందించెడివాఁడు పరమ గురుఁడైనను వాని శిరచ్ఛేద మొనర్చెద" ననెడిదైనందువలన నానింద చెవిని బడినతోడనే సత్యరతుండగు నర్జునుండు యుధిష్టిరుని శిరమును నరుకుటకు సిద్ధుఁడయ్యెను. కాని జ్ఞానస్వరూపుండగు పరమాత్మను, యెవనికిఁ జెలికాఁడై యుండునో యట్టి

చెలికాడుండినప్పుడు ధర్మసంకటమందును నవిచారము జరుగదు. శ్రీకృష్ణుఁడా సమయమందే యీ ధర్మసంకటమును గూర్చి చర్చించి యర్జునుని ప్రతిజ్ఞారక్షణమగునట్లును, జ్యేష్ఠభ్రాతృ హత్యారూపమగు మహాపాపమునుండి దూరుఁడగునట్లును నిట్లు పరిష్కరించెను. గురువులను (త్వంకారము నీవు అను) నీచసంబోధనములతో నిందించి యవమానించుట వారల శిరము నరకుటకంటె నధికము. చూడుఁడు.

యదా మానం లభతే మాననార్హ-
స్తదాసవై జీవతిజీవలోకే
యదావమానం లభతేమహాంతం
తదా జీవన్మృత ఇత్యుచ్యతేసహః

మాననవనీయులగువారు సన్మానింపఁబడినపుడు వీరు ప్రపంచమునందు జీవించియున్నవారుగఁ బరిగణింపబఁడుదురు. వారవమానింపబడినప్పుడు వారు బ్రతికియున్నను జచ్చినవారలుగఁ నెంచఁబడుదురు." అందువలన.

త్వమిత్యత్ర భవంతంహి, బ్రూహిపార్థ యుధిష్ఠిరం
త్వమిత్యుక్తోహినిహతో గురుర్భవతి భారత
గురూణా మవమానోహి, వధ ఇత్యభిధీయతే.॥

"ఓ పార్థా! పూజ్యుండగు యుధిష్ఠిరుని "నీవు" అని సంబోధించి యతనిచే నవాకుచవాకుమాటల మాటలాడుము. అనఁగాఁ బూజ్యపురుషుఁను "నీవు" అన్నంతమాత్రమున నే

వారికి మరణమగును ఎందులకనఁగా పూజ్యపురుషుల యవమానమే వారిహత్య. ఈ రెండువిధములుగా గూడ నీవు రక్షింపబడగలవు." ఇట్టి వేలకొలది ధర్మసంకటముల గురించి పరిష్కారములు పురాణములలో జేయబడియున్నవి. ఇవి గుర్తెరింగినందువలన సర్వజీవులకుఁ బరమ కల్యాణసాధనము ప్రాప్తింపగలదు మరియు ధర్మసంకటావస్థలందు విరుద్ధములగు ధర్మముల సమన్వయమందలి గూఢరహస్యము మహాభారతములోని యాపద్ధర్మ పర్వమందువలె మరి యే శాస్త్రమందుఁగూడ గనుపడనేరదు.

(9) పురాణముల తొమ్మిదవ పూర్ణత్వము:- పురాతనములగు, సామాజిక, రాజనైతిక, ధార్మిక చారములను వర్ణించుటయందున్నది, పురాణములు శ్రుతులకును, స్మృతులకును దర్శనములకును, ననుకూలములై వానికి వ్యాఖ్యానరూపములుగానున్నవి కాఁబట్టి పురాణములలో వర్ణింపబడిన సామాజిక రాజనైతిక, ధార్మికాచారములకు సంబంధించిన రీతి నీతులన్నియు శ్రుతులకు, స్మృతులకు, దర్శనములకు ననుకూలములై యున్నవి. వేదమందున్న గూఢరహస్యము దర్శనమునందలి సృష్టి, స్థితి, లయములు స్మృతులయనుశాసనములివియన్నియు బురాణములయందు సరళముగాను, విశదముగాను వర్ణింపబడినవి. నిర్గుణ బ్రహ్మోపాసనము, సగుణమూర్త్యుపాసనము, వ్రతదాన, తీర్థ ధర్మములు మున్నగువానిమాహాత్మ్యము మనోహర

భావములతో పురాణములలో వర్ణితములైనవి. భూదానము జలదానము, అన్నదానము, లోనగు విషయములలో మన్వాది స్మృతులలోని యాదేశములుగూడ పురాణములందు జక్కగా వక్కాణింపబడినవి. పురాణములలోని చరిత్రములను జూచిన ధర్మసదాచారానుష్ఠానములందు మనుష్యుల చిత్త మెల్లప్పుడు లగ్నమై యుండినట్లును, ధర్మ మాచరించినవారికి జయమయ్యె ననియు నధర్మమొనరించినవారికి బతనము సంభవించెననియు బాగుగా విదితమగును. అధార్మికుండును, అత్యాచారియు నగు వేనుడనురాజు రాజ్యభ్రష్టుడును, నరకగామియు నయ్యెను, ఆతనిసుతుడు పృథువు ధర్మముగా రాజ్యపాలనము చేసినందు వలన ప్రపంచమునకంతకు నాథుడై తండ్రిని నుద్ధరించి స్వర్గ లోకమునకేగున ట్లొనరింపగలిగెను. హిరణ్యకశిపుడు రావ ణుడు, దుర్యోధనుడు మొదలగువారి యధోగతి వలనను ప్రహ్లాదుడు, రామచంద్రుడు ధర్మరాజు లోనగువారి జయ లక్ష్మీ లాభములవలనను. ధర్మాధర్మములు లేక ఫలాఫలములు స్పష్టముగా బ్రకటమైనవి వ్రతకథ. దాన ధర్మవర్ణనము లోనగువారిద్వారా మనుష్యులచిత్త మితరుల మేలుకొఱకు ఉత్సాహముకలదానిగాం జేయబడినది. తీర్థమహిమాకీర్తనము దేవతాదర్శనము, పుణ్యకార్యానుష్ఠానములద్వారా జనుల హృదయములందు ధర్మభావములు రేకెత్తునట్లుగా జేయబడి నది. స్మృతులలో నే ధర్మములు సంగ్రహముగా జెప్పబడి

నవో యవియే పురాణములందు విస్తృతరూపముగా పలుక బడినవి. బ్రాహ్మణులు మొదలగు నాల్గు వర్ణముల కర్మవిభాగము, రాజధర్మవర్ణనము, వివాహము, లోకాచారపద్ధతి, శ్రాద్ధము, ప్రాయశ్చిత్తవిధి, యీ మొదలగునవన్నియు బురాణముల ప్రతిస్థలమందును విస్తారముగా గ్రథితములై యున్నవి. ప్రతి స్థలమందును శ్రుతులయు, స్మృతులయు వచనములు "తు చ" తప్పకుండ సరిగా ననువదింపబడినవి ఒకచోట మనుస్మృతినుండియు, మరొకచోట యాజ్ఞవల్క్యస్మృతినుండియు నింకొకచోట పరాశరస్మృతినుండియు, జంతురాశ్రమములయొక్క విధి నిషేధములుద్ధరింపబడినవి. స్మృతులలో దానధర్మముల యొక్క యుత్తమత్వము గణింపఁబడినది. పురాణములలో నిట్లు వ్రాయఁబడినది.

"దానమేవ పరోధర్మః దానాత్సర్వ మవాప్నుతే
దానాన్ముక్తిశ్చ రాజ్యంచ దద్యాద్దానం తతో వరః ॥

దానమే శ్రేష్ఠమగు ధర్మము. దానమువలననే సమస్త వాంఛలు, ముక్తి, రాజ్యమును, లభించును. కనుక దానమొనర్ప వలెను. వర్ణములయొక్కయు, ఆశ్రమములయొక్కయు ధర్మము జన్మకర్మలవలని వర్ణవ్యవస్థ ప్రకృతిననుసరించి నాలుగువర్ణముల, నాలుగుఆశ్రమముల, వర్ణనము, అహింస, కామ. క్రోధ లోభ, మోహత్యాగము, దయ, సత్యానిష్ఠ, మున్నగు సమస్తవర్ణములయొక్క సాధారణధర్మములు. స్త్రీ, పురుష,

బ్రాహ్మణ, శూద్రాదుల విశేషధర్మము లీ పురాణగ్రంథముల యొక్క ప్రతిపత్రమునందును జూపఁబడినవి యాజ్ఞవల్క్య సంహితలోఁ గన్యావివాహవిషయమునుగూర్చి యేది చెప్ప బడినదో యది గరుడపురాణములో సరిగా నట్లే చెప్పఁబడి నది. అసవర్ణవివాహము దోషభూయిష్ఠమని స్మృతులును, బురాణములు నెట్టిభేదము లేకుండ నొకేరీతిగా వర్ణించినవి. దానమొనర్పబడిన కన్యనుఁ దిరిగి దానమిచ్చుట మున్నగు విష యములను వెక్కిలి నిందించినవి. గర్భాదానము, పుంసవనము. సీమాంతోన్నయన, జాతకర్మ, నామకరణాన్న ప్రాశనాది సంస్కారముల విధియు ప్రశంసయు నీ సంస్కారములన్నియు పూర్వకాలమందు నియమముతో జరుగుచుండెడివనెడి ఈ విషయములన్నింటియొక్కవర్ణనము పురాణములందు విపుల ముగా వ్రాయబడియున్నది. సామాజికధర్మములతో దుల్య ముగా రాజధర్మములుగూడఁ బ్రతిపాదింపబడినవి. మనుస్మృ తిలో నిట్టి నియమబద్ధమైన యనుశాసనప్రణాళిక, కరగ్రహ ణము (పన్ను వసూలుచేయుట) లోనగువాని యేర్పాటు, చోరదండనవిధు లెట్లు చెప్పబడినవో యట్లే యగ్నిపురాణ మందును, గరుడపురాణమందును, గన్పడును. రాజ్యరక్షణ, ప్రజాపాలనాదివిషయములలోఁగూడ నెక్కువగానుపదేశములు గావింపబడినవి. ధనుర్విద్య, యాగ్నేయాస్త్రాదిప్రయోగము, నానావిధ యుద్ధవిద్యావిధానములు, లోనగువానివర్ణన మగ్ని

పురాణమందును దేవీపురాణమందును, బొడగట్టగలదు. గరుడ పురాణములో జ్యోతిషవిద్య, సాముద్రికవిద్య, ఆయుర్విద్య చికిత్సా ప్రకరణము, వివరముగా వర్ణింపఁబడినది. ప్రాచీన భారత దేశముయొక్క చిత్రవిద్య, శిల్పకళ, వివిధపురాణములలోఁ బూర్తిగా విశదీకరింపఁబడినవి. సంఘ మున్నతిబొందుట కెట్టి యాదర్శముండవలయు? ప్రాచీనకాలములో సంఘపు కట్టుబా ట్లెట్లుండెడివి? రాజనీతి యేరీతిగా నుండెడిది? గృహధర్మ మెట్లు నడిచెడిది? ఏప్రకారముగా యుద్ధములయ్యెడివి? చికిత్స యేపద్ధతిగాఁ జేయఁబడెడిది? శిల్ప, కావ్య, సాహిత్యాలంకార వ్యాకరణాదిశాస్త్రములలో నెంతవఱ కార్య్యు లున్నతి జెంది యుండినది? ఈ సమస్తవిషయముల చిత్రము సంపూర్ణముగాఁ బురాణములందు మనోహరముగా జిత్రింపఁబడినవి. ఇదే పురాణపూర్ణత్వము.

(10) పురాణముల పదవపూర్ణత్వము:- ఇది విచిత్రములగుచరిత్రముల వర్ణనమందున్నది. మనుష్యప్రకృతిపై కేవలము శుష్కధర్మోపదేశములు విశేషప్రభావము గలిగింపనేరవు. పాపదగ్ధమగుహృదయ మరుభూములలో శుష్కవిజ్ఞానముయొక్క శుష్కోపదేశము కాలిన యిసుకతోఁగూడిన వడగాలివలె వ్యాపించి దాని నింకను బనికిమాలినదిగాఁ జేయును. కాని మెవనిహృదయమునందుఁ బురాణములలోని చరిత్రముల ద్వారా నొకప్పుడు పవిత్ర ప్రేమధారయు, నింకొకప్పుడు

నిర్మల దయాప్రవాహము, మరియొకప్పుడు అలౌకిక స్వార్థ త్యాగధారయు, వేఱొకప్పుడు సత్యపాలన పుణ్యాధారయు, నింకొక తరుణమునందు ధర్మజీవన దివ్యధారయు, శతముఖి యగు గంగాదేవియొక్క శతధారలవలెఁ బ్రవహింపఁబడినదై యా హృదయసముద్రము నుప్పొంగునట్లొనర్చుచున్నదో యట్టి హృదయముగలవాడే ధార్మికప్రపంచమందును, మానుష ప్రపంచమందును, బురాణములలో సార్వజనీన కల్యాణకారిత్వ మెంత గొప్పగానున్నది గ్రహింపఁగలడు. పురాణములలో జాతుర్వర్ణ్యముయొక్కయు, జతురాశ్రమముల యొక్కయు, నాదర్శకపురుషుల చరిత్రములున్నవి. మరియు నాదర్శకులగు పురుషులు. జ్ఞానులు బ్రహ్మచారులు, సతీమతల్లికలు, మహర్షులు, కర్మిష్ఠులు, వీరులు, భక్తులు, మున్నగువారి చరితములును గలవు. ఈచరిత్రములను మనన మొనర్చినందువలనవిచారశీలురగు మనుష్యులు కేవల మీ పురాణచరిత్రములద్వారా ప్రపంచ మందలి జనులకుఁ గల్యాణ మెంతవరకు గల్గినదో యంతటి కల్యాణము జీవనమనెడి నదియొక్క ప్రవాహమును నియమించి జ్ఞానము, మనుష్యత్వములనెడి యంతులేని సముద్రములో లయించుటకు జ్ఞానధారయను వేదములును, నేత్రరూపములుగా నుండు దర్శనశాస్త్రములుగూడ చేయలేదని తెలిసికొనగలడు. నేఁడీ పురాణములే లేనిచో ఆదర్శరూపమగు ఏ బ్రహ్మతేజము ముందర నవక్రపరాక్రమముచే నాక్రమింపఁబడిన యహం

కారముగల విశ్వామిత్రమహారాజుయొక్క పౌరు
గూడ నుగ్గునుగ్గయ్యెనో, యే యాదర్శబ్రహ్మతేజ మతనిని
రాజ్యత్యాగినిగావించి వనవాసిగను, దపస్విగాను జేసెనో ఇట్టి
బ్రహ్మతేజముయొక్క యాదర్శ మెందు దొరకగలదు?
దరిద్ర బ్రాహ్మణుడగు వశిష్ఠ మహర్షిని మహారాజగు విశ్వా
మిత్రుండు కామధేనువు నొసంగుఁడని ప్రార్థించెను. కాని యా
మహర్షి యా కామధేను వతనికొసంగుట కిష్టపడడయ్యెను.
అప్పుడు విశ్వామిత్రుడు తన సైన్యములను దోడ్కొనివచ్చి
బలాత్కారముగా నా ధేనువును దీసికొని పోవుటకు బ్రయ
త్నించెను. అప్పుడు బ్రహ్మతేజముతో నిండిన శరీరముగల
వశిష్ఠబ్రహ్మర్షి, బ్రహ్మదండమును మంత్రపూతముగావించి
యెదుట నిలువబెట్టెను. ఇటువైపు విశ్వామిత్రమహారాజు
యొక్క యస్త్రధారలు వర్షర్తువునందలి జలధారలవలె వశిష్ఠుని
నాలుగు ప్రక్కలను గురియుచుండెను. అస్త్రముల ఝణ
ఝణాత్కారములును, సైన్యముల కోలాహలములును దిగ్దిగం
తరములను నిండించెను. జ్యోతిష్మంతమగు దివ్యాస్త్ర సము
దాయము యొక్క తేజస్సు నాల్గువైపులఁ దళతళ మెఱుపులు
మెఱయుచున్నట్లుండెను. కాని బ్రహ్మతేజముయొక్క
యెదుట సూర్యుని ప్రకాశముయొక్క ముందర దీపముండిన
విధమున విశ్వామిత్రుని భయంకరములగు నస్త్ర సమూహము
లన్నియు వట్టిపోయినవి ఆ బ్రహ్మతేజముయొక్క మూర్తి

రూపమైన దండము సమస్త శస్త్రాస్త్రములను నిస్తేజములుగా జేసివైచెను. దీనివలన నత్యంతము దుఃఖించి క్షోభించుచు విశ్వామిత్రుండిట్లు పల్కెను.

ధిగ్బలం క్షత్రియబలం, బ్రహ్మతేజో బలంబలం
ఏకేన బ్రహ్మదండేన, సర్వాస్త్రాణి హతానిమే॥

క్షత్రియబలమునకు ధిక్కారము. బ్రహ్మతేజోబలమె బలము. ఒక్క బ్రహ్మదండమే నా సమస్తాస్త్ర శస్త్రములను నశింపజేసినది. ఇట్టిది మా పూర్వులయందు విరాజిల్లు బ్రహ్మ తేజముయొక్క యాదర్శము. దీనిని స్మరించినంతమాత్రము ననే నేడుగూడ నిర్వీర్యులగు బ్రాహ్మణుల హృదయములం దావేశము రేకెత్తుచున్నది. ఇట్టి బ్రహ్మతేజస్సుయొక్క యాదర్శము పురాణములే లేకుండపోయినయెడల భారతదేశమున కెక్కడ దొరుకగలదు?

మహర్షులు పుట్టినదాది నుంఛవృత్తి నవలంబించి జగత్తును జ్ఞానధనముతో ధనవంతముగ జేయుట కెల్లప్పుడును సంసిద్ధులగుచుండిరి. ఏ రొకప్పుడు కణభక్షణము నింకొకప్పుడు ఫలభక్షణమును, మరియొకప్పుడు వాయుభక్షణమును, గావించి మాకొఱకు రేబవలువిచారణముచేసిచేసి మాయొక్కయాధ్యాత్మికోన్నతికై జ్ఞానభాండారము, శక్తిభాండారము, విద్యాభాండారము, భాషాభాండారము, ఔషధీభాండారము లోనగు

నెల్ల భాండారములతోఁ బ్రపంచమును నింపియుండిరి. ఈ భాండారములను నజ్ఞానముచే రేయునక పవలనక యెల్లప్పుడు దుర్వ్యయము గావించినప్పటికిని వానిలోనుండి యణుమాత్రము గూడ దఱుఁగదు. కాని కల్పవృక్షముకైవడి సర్వధా యీ భాండారములు మా వాసనలను, (కోరికలను) బూర్తి చేయుటకు సిద్ధముగానుండును. బురాణములే లేకపోయినయెడల మాబోటివారలకు సర్వ మహర్షుల యాదర్శ మెచటనుండి లభింపఁగలదు?

దధీచియొక్క యట్టి యపూర్వ స్వార్థత్యాగము దివ్య దృష్టాంతముగా మానవ ప్రపంచేతిహాసములోఁ గల్పాంత పర్యంతము సువర్ణాక్షరములతో లిఖింపఁబడియుండును. దధీచి మహర్షియొక్క యట్టి యపూర్వ ప్రాణత్యాగమును, మరియు దేవతలకొరకు దన యస్థుల నొసంగుట సామాన్య త్యాగమునకు దృష్టాంతమగునా యేమి? ప్రపంచములో బ్రాణమందరకు గూడఁ బ్రియమైనది. ప్రాణరక్షణముకొరకె పుత్రస్నేహపరాయణయగు తల్లియు, వాత్సల్యపరాయణుండగు తండ్రియు, గూడ దుష్కాలములో క్షుధార్తులై యట్టి కుమారునినే చేతులార జంపుటకుగూడ వెనుదీయరు. అట్టి యత్యంతప్రియమగు ప్రాణమును బరోపకారముకొఱకై విడిచిపెట్టుటకు దృష్టాంతము పురాణములే లేకపోయినచో నెందు దొరుకఁగలదు?

ఆ యాదర్శక్షత్రియగణమో, తమ వీరత్వముయొక్క బలముతో భూదేవిని రాక్షసుల గురుభారమునుండి రక్షించినది. ఈ క్షత్రియుల యపూర్వబలముచే మోహితుడై యింద్రుడు గూడఁ దమ రాజ్యమును రక్షించుకొనుటకా క్షత్రియుల కాహ్వానములంపి వారెక్కుటకు స్వయముగ వృషభ వాహన రూపమును (కకుస్థుఁడు) ధరించి యా భారతీయ క్షత్రియ వీరులను దన మూపురముపై నెక్కించుకొని యుండెను.

అట్టి భారతీయ క్షత్రియవీరుఁడైన యర్జునుని యా క్షత్రియ సులభ జితేంద్రియత్వము ప్రశంసింపదగినది. ఈ జితేంద్రియ బలమువలన స్వర్గమునందలి సుందరీమణియగు నూర్వశిగూడ నా యర్జునునికడ దన వృత్తిని సాగింపజాలక పోయెను. ఆ క్షత్రియ వీరవరేణ్యుండగు ధర్మరాజు కేవలము యుద్ధమునందే నిశ్చలుఁడై యుండుటేకాక ధర్మమునందు కూడ నెల్లప్పుడు సుస్థిరుడై యుండెను. ఈ ధర్మరాజు కేవలము ధర్మరక్షణముకొరకు దన యావత్తు ధనమును యావత్తు రాజ్యమును మరియు భార్యనుగూడ నోడిపోయి వనవాసియై ఫలమూలకందములను దినుచు నారచీరల ధరించి యరణ్యములలో దిరుగాడియుండెను. ఇట్టి యిట్టి, ధార్మికవీరుల చరిత్రములు పురాణములే లేకపోయినయెడల నెట్లు తెలియగలవు? ఈ ప్రకారముగానే భక్తులలో ప్రహ్లాదుండును ధ్రువుండును నుండిరి.

వేదవ్యాసునివంటి జ్ఞానియు శుకదేవునివంటి జ్ఞానియు గలరా? వీరు సమస్త జగత్తును జ్ఞానసూర్యునితోఁ బ్రకాశవంతముగాఁ జేసియుండిరి. శుకమహర్షి బ్రాహ్మణశాపముచే దగ్ధశరీరుఁడగు పరీక్షిన్మహారాజునకు జ్ఞాన ప్రతాపముచే నమృతత్వము ప్రాప్తింపఁజేసియుండెను. ఇతఁడు గృహస్థుఁడగు జనకుని యింటనుండియు వైరాగ్య బ్రహ్మచర్యములయొక్క యపూర్వ దృష్టాంతమును స్థాపించెను. గృహస్థుండగు జనకుడు గృహమందుండియు మహర్షులుగూడ శిష్యులై తనవలన జ్ఞానమును సంపాదింప జాలినంత గొప్ప జ్ఞానమును బొంది యుండెను. ఇట్టి యిట్టి యాదర్శ చరిత్రములుగల మహాపురుషులయొక్క జ్ఞానము పురాణముల యనుగ్రహమువలననే ప్రాప్తింపఁగలదు. ఇంకను నొకచోటనే సర్వరస సమన్వయమున్నది. ఎచ్చట వీరరసమందలి వీరతయున్నదో యచ్చటఁ గరుణారసములోని కారుణ్యము. నెందు సఖ్యతయొక్క పరమ భావమున్నదో యందే భక్తిరసముయొక్క యపూర్వ విలాసము నున్నది. ఒక స్థలమునందే యిన్నిరసముల సమన్వయమును, దాని ద్వారా జగత్తులో నాదర్శ బ్రహ్మచర్యము యొక్కయు, నాదర్శ భక్తియొక్కయు, గౌరవమునునిల్పుటకు దగిన యాదర్శము పురాణములే లేక పోయిన చో . మన కెందున జిక్కును? పరమ జ్ఞానియు, బరమ తపస్వియు, బరమ సంయమియు, బరమ బ్రహ్మచారియుఁ, బరమ వీరుఁడునైన

భీష్మాచార్యులు తన ముసలితండ్రియొక్క వైహిక విషయ సుఖముకొఱకై కావించిన త్యాగముయొక్క యాదర్శము ప్రపంచములో స్థిరమొనర్చెను. అతని విచిత్రచరిత్రమును జది వినయెడల నొకప్పుడు హృదయము వీరరస భరితమగును. మఱొక్కప్పుడు త్యాగముయొక్క నిర్మల శాంతిచే నంతఃకరణము నిండును. వేరొక్కప్పుడు భక్తిరసముచే జిత్తము ద్రవించి పొంగి కన్నీరు మున్నీరుగా బ్రవహించును.

యుద్ధరంగమం దస్త్రముల ధరింపనని పార్థసారథియగు శ్రీకృష్ణపరమాత్మ ప్రతిజ్ఞనై యుండెను. కాని భగవంతుని హృదయము భగవంతునిది గాదు! అది యెల్లప్పుడు భక్తులకు విక్రయింపబడి యున్నది. ఈ విషయమునే ప్రపంచములో జాటుటకొఱకే భక్తశిరోమణియగు భీష్మాచార్యులుగూడ "నేను యథార్థ భక్తుడనై యుండినచో నేను భగవంతుని ప్రతిజ్ఞను భంగముజేయగల" నని ప్రతిజ్ఞచేసి కురుక్షేత్రమందు యుద్ధరంగములో శ్రీకృష్ణుని చెలికాడగు నర్జునునకు విరుద్ధముగా నిల్చియుండి ధనువెక్కుపెట్టి తీండ్రంబులగు బాణంబులను నర్జునునిపై వేయనారంభించెను. పుట్టినదాది బ్రహ్మచర్య వ్రతంబు గలవాడును, బ్రబలమగు పరాక్రమము గలవాడును మహావీరుండును నగు భీష్మాచార్యులవారి బ్రహ్మచర్యశక్తితో నిండిన శక్తిగలిగిన యాగ్నేయాస్త్రము మున్నగు నస్త్రసమూహములు స్వకీయోజ్జ్వల జ్వాలా మాలలతో దిగ్దిగంతములను

మెఱయఁజేయుచుఁ బార్థుని సర్వాంగములను గాయపడఁజేసి మండింపఁదొడంగెను. అర్జునుడా బాణములచేత బాధింపఁబడి యా రథముమీఁదఁ బడిపోయెను. తన సఖుని రక్షించుకొనుటకై శ్రీకృష్ణుఁడు సారథిరూపముగా నర్జునుని వెనుకనుంచుకొని తాను ముందునకు వచ్చి కూర్చుండెను. అట్టి సఖుడగు నర్జునుడు మూర్ఛిల్లుటంగాంచి శ్రీకృష్ణభగవానుని భావసముద్రము మగ్గలమై లేచెను. అప్పుడా భయంకర ప్రవాహముతోఁ బ్రవహించెడి భావసముద్రముయొక్క ప్రబలధారయెదుట శపథపు సామాన్య బంధము, వాలుక (ఇసుక) యొక్క బలములేని కట్టవలె నెందనుక నిలిచియుండగలదు? శ్రీకృష్ణభగవానుడు తన ప్రతిజ్ఞను విడిచి రథచక్రమును జేతదీసికొని భీష్మాచార్యులమీదికి దుమికెను. భక్తచూడామణియగు భీష్ముని మనోరథ మా సమయమున సంపూర్ణమయ్యెను. మరియు నతఁడు తన ధనుర్బాణముల నప్పుడే విసర్జించి భగవంతుని చరణారవిందములకు నివేదింప దొడంగెను.

ఏహి ఏహీ ఫుల్లాంబుజపత్రనేత్ర! జగన్నివాస
నమోస్తుతే శార్ఙ్గగదాసిపాణే!
ప్రసహ్యమాం పాతయులోకనాథ!
రథోత్తమా ద్భూతశరణ్య సంఖ్యే॥

హే దీనబంధో! భక్తవత్సలా! భగవన్! నేనింకను యుద్ధమొనర్చినందువలన ప్రయోజనములేదు. ఎందులకనగా

సమస్త ప్రపంచమునకు తుట్టతుదిఫలము శ్రీవారి చరణకమలములైయున్నవి. అతఁడే నేఁడు నా మనోరథమును నెరవేర్చుటకొరకే తన ప్రతిజ్ఞనుకూడ భంగముచేసికొనెను. కనుక నీవు రథచక్రముతో నన్ను జంపుము. దీనిచేత నా సంసార చక్రము విచ్ఛిన్నముగాగలదు. అని నివేదించుకొనెను. ఇట్టి వీర రసముయొక్కయు, మధుర రసముయొక్కయు నపూర్వ సమ్మేళనము మరియు, భక్తుని యపూర్వ మహిమయొక్క వికాసమునకు దృష్టాంతము పురాణములే లేకపోయినచో నెక్కడ లభించును?

భరతఖండ మాదర్శసతుల చరిత్రముల పుణ్యబలముచే నేడును బ్రపంచమునకు శీర్షస్థానమై యున్నది. పురాణములే లేకపోయినచో నట్టి రమణీలలామలగు సతుల దృష్టాంతమును దాని మూలముగా నపూర్వమగు పాతివ్రత్యశిక్షయును, ప్రపంచమున కెట్లులభించును?

## -*) హిందూసతీ చరిత్రములు (*-

ఈ పురాణములం దాదర్శన సతీమణియగు సీతాదేవిచరిత్రము విరాజిల్లుచున్నది. వాల్మీకిమహర్షి వేలకొలది సంవత్సరము లుగ్రతపస్సుచేసి వీణావాదనము నేర్చియుండెను. ఇతడా వీణెమీద నారు రాగములతోడను ముప్పదియారు రాగిణుల (రాగముల స్త్రీలు) తోడను రేఁబవలు గాన

మొనర్చినప్పటికిని సీతాదేవి మాధుర్య చారిత్రగీతులు సమా ప్తములు గాకుండెను. పిమ్మట దన తపోవనములోని కోకిలల కలధ్వనులచేతఁగాని, భ్రమరముల మధుర ఝుంకార నాదములచేతగాని ప్రకృతిమాత 'వివిధమంజుల విలాసగీతులవలన గూడ నీ మధుర గుణకధ సమాప్తి గాకుండెను. ఇందువలన వాల్మీకిమహర్షి యా సీతా సతీమతల్లిక చనుఁబాలుత్రాగిన క్షత్రియ వీరబాలకు లిరువురి మధురకంఠముద్వారా యా మధురకథను నలుగడలు ప్రతిధ్వనించునట్లు గాన మొనర్పఁజేసియుండెను. అయోధ్యలోని ఆశ్రీరామచంద్రమూర్తి ఇప్పుడు లేడు. వాల్మీకమహర్షియు నిప్పుఁడులేడు. ఆ యిరువురు బాలకుల దివ్యకంఠధ్వని నేఁడు వినబడుటలేదు. అట్లయినప్పటికిని నా మధుర కంఠధ్వనిని బ్రతి తరంగమందును బ్రతిధ్వనింపజేసి ద్రవించిన ప్రేమయనెడి సరయూతరంగిణి, యే మధుర గుణకధాజాలమును నేఁడుగూడ మృదుమంద నాదములతో బాడుచు నానందమువలన నాడుచున్నదో, మరియు నొకప్పుడు హృదయమం దుంచబడిన యపూర్వానంద ప్రవాహమును, హృదయమందు బంధించి యుంచుకొనుటకు సమర్థము గానందువలన నుప్పొంగి యా యానందప్రవాహమునే స్వకీయ తీర్థ నివాసశీలురగు (నిరంతరము రామాయణ కథాశ్రవణ శీలురు) సమస్తజీవుల హృదయక్షేత్రములందు నింపివేయుచున్నదో అట్టి సతీమతల్లికయగు సీతామహాదేవియొక్క దివ్య

చరిత్రము పురాణములే లేకపోయినట్లయిన నిప్పుడు మన కెక్కడజిక్కగలదు? ఏకాకినియు, శోకాకులయు, నశోక కాననమం దహర్నిశలు రోదించుననియు, రాఘవుని గోరు నదియు నగు సీతాసతి, కూర్రరాక్షసుండగు రావణునివలన వేయితెరంగుల భయపడుచు నాశపెట్టుబడుచుగూడఁ దన పవిత్ర చరిత్రను నెట్లు కళంకితము గావించుకొనక సంరక్షిం చుకొనుటకు సమర్థురాలైనదో, తిరిగి రామచంద్రుని ప్రతాప బలముచేత లంక సమగ్రముగా దగులబడి సీతాదేవి రావణుని చెఱనుండి విడుదలయైనప్పుడుగూడ మర్యాదాపురుషోత్తముం డగు రామచంద్రుఁడు మర్యాదఁ బాలించుటకొరకై సీతను భయంకరమైన యగ్నిపరీక్షయందుఁ బడవేసిన తరుణమందు సీతాసతీత్వ తేజస్సుతోడనే భగభగమని మండుచు నగ్ని దేవుఁడుగూడఁ జందన పంకశీతలత్వమును బొంది సర్వవిధము లనుగాపాడి సతీత్వమందలి యపూర్వ గౌరవమును సంర క్షించియుండెను. ఇట్టి పవిత్రచరిత్రము, పురాణములు లేక పోయిన నెక్కడలభించును? అయోధ్యాపురమునకు సంపూర్ణ లక్ష్మీస్వరూపిణియైన యట్టి యాదర్శసతీమణిని ధర్మమూర్తి యగు రామచంద్రుఁడు కేవలము ప్రజలను రజింపజేయుటకై గర్భవతిగా నున్నప్పటికిగూడ నొక చాకివాని మాటవిని యామెను వనమునకుఁ బంపించినప్పుడును, రాజకుమారికయు, భగవన్మనోవిలాసినియు, నయ్యు గూడ జీవనకాలమందొక

ముహూర్తమాత్రముగూడ సుఖమున నెట్టిదో యెంతమాత్రము గూడ నెఱుంగకయుండినప్పుడును, జన్మదుఃఖినియగు సీతను సోదరప్రేమియు, ననుజుండునగు లక్ష్మణుఁడు కఠినహృదయుఁడై ఘోరారణ్యమందు విడిచిపెట్టి యామెకు శ్రీరాముడరణ్యములో విడిచిపెట్టునట్లాజ్ఞాపించినాడనెడి దుఃఖమయమైన వార్తను వినిపించెను. అప్పుడు సమస్తప్రకృతి సీతయొక్క దుఃఖభరముతో నిండి యేడ్చుచున్నట్లుండెను. భయంకర ఘనాఘనంబులు తండోపతండములుగా నాకాశమండలమును గప్పివేసెను. ప్రకృతియొక్క కన్నీరెడతెగకుండ గాలువలుగా బాఱ వర్షించుచుండెను. వజ్రాయుధ ఘోరగర్జనము ప్రకృతిమాత భోరున నేడ్చుచున్నట్టుల భయంకరముగా ధ్వనించెను. ఆ యెడదెగని నీటిధారలో నా వజ్రనిర్ఘోష సమయములో కలుకురాతిగుండె గలవాడై లక్ష్మణుఁడు గర్భిణియగు సీతను, మిక్కిలి హింసాకరములగు జంతువులతో నిండియున్న యరణ్యములో విడిచి పోయినప్పు డొంటరిదియు, శూన్యహృదయయు నగు సీత, దుఃఖితయై యేడ్చి యేడ్చి భగవంతునింగూర్చి "ఓ మధుసూదనా! నారాయణా! నేను దౌర్భాగ్యురాల నైనందున నాకీ జన్మమునందు ఘనశ్యామసుందరుండగు శ్రీరామచంద్రుని సేవించెడి సౌభాగ్యము ప్రాప్తించి యుండలేదు. కానిమ్ము! ఓ భక్తమనోరథ కల్పద్రుమా! శ్రీహరీ! జన్మజన్మాంతరములందు నాకిట్టి శ్రీరామచంద్రుని

వంటిభర్త లభించునట్లనుగ్రహింపుము. ఇదే తమ మ్రొలజేయు నీ యనాథినీ ప్రార్థనము మరియు నా మరదియగు లక్ష్మణుం డీ ఘూరాటవిని భేదించుకొని యొంటరిగా నయోధ్యకుఁ జను చున్నాడు. ఉఱుములుఱుముచున్నవి. మెఱపులు మెఱయుచు న్నవి. పిడుగులు పడుచున్నవి వానలు గురియుచున్నవి. ఓ పరమేశ్వరా! ఓ దీనబంధూ! లక్ష్మణునకెట్టి యాపదలు లేకుండఁజేసి యయోధ్యాపురికిఁ జేర్పుము" అని యిట్లు ప్రార్థించెను. పాతివ్రత్యముయొక్క యిట్టి యపూర్వాదర్శము స్త్రీజాతికంతకు గౌరవము గలిగించు నీ యపూర్వ ప్రశంస్య దృష్టాంతము, పురాణములు లేనియెడల మన కెక్కడనుండి వచ్చును?

మరియు నట్టి వీరనారీమణియు, నభిమన్యుని మనోవిలా సినియు నగు ఉత్తర చరిత్రముగూడ నున్నది. అభిమన్యుని వీరత్వవిషయములో నేమిచెప్పవలె! సప్తరథీగణము కలిసి భేదించుటకు శక్యముగాని వ్యూహమును రచించినప్పు డద్దానిని భేదించి చెండి చెకపికలాడుటకు మహావీరుఁడగు నభిమన్యునకే, సామర్థ్యముండెను. ఆ యభిమన్యుడు రణసముద్ర మందాత్మ సమర్పణము జేయుటకు సిద్ధపడియుండెను. ఉత్తర యతని సర్వాంగములను వీరశయ్యాతో నలంకరించుచుఁ దన హృదయమందున్న వీరత్వము మధురత్వముగల పలుకులతో నభిమన్యుని వీరహృదయమును వీరతరముగా రేకెత్తించెను.

పవిత్రమైన ప్రేమధార, క్షత్రియులకు జీవనరూపమగు యజ్ఞముయొక్క పవిత్రాగ్నిలో నాహుతిగాఁ జేయఁబడు నాజ్యధారవలె నయి యా యజ్ఞాగ్నిలో భస్మమై పోయినది. ఉత్తరయొక్క కోమలహృదయము, వీరులకు స్వభావసిద్ధమగు పాషాణహృదయముగా మారిపోయెను ఇట్టి క్షత్రియవీరనారీమణుల చరిత్రములు పురాణములులేనియెడల నిక నెక్కడ బ్రాప్తింపగలవు?

ఈరీతిగా నెన్నియని చెప్పఁగలము? వర్ణించి వర్ణించి లేఖిని (కలము) నిలిచిపోవుచున్నది. గానము జేసిచేసి కంఠము డగ్గుత్తికవడిపోవుచున్నది. హృదయము భావభారముచేత నాగిపోవుచున్నది. వేయేల! యీ చరిత్రసమూహముల వర్ణించు విషయమునందు వ్యాసులవారి దివ్యలేఖిని సైత మసమర్థమైపోయినది అట్టి సమస్తదివ్యచరిత్రల యపూర్వ వర్ణనము పురాణముల మహిమయే.

ఇట్లు పూర్ణుండగు భగవంతుని నిశ్వాసరూపములగు పురాణములు, ప్రపంచమున కపారశ్రేయము గూర్చినవి. ఎట్లు పావన జలములుగల గంగానది దేవతాత్ముండగు హిమాలయమునుండి యేకధారలో బయలుదేరి యనంతధారలతో భరతవర్షమునకుఁ గల్యాణము గూర్చుచున్నదో యట్లే పుణ్యమయములును, బూర్ణములునునగు పురాణములుగూడ భగ

వన్నిశ్వాసరూపముగా నొకటిగానిర్గమించి యనంతధారలతో ననంత పూర్ణతతో సమస్త ప్రపంచమును బ్రహ్మానంద సముద్రపు వైపునకుఁ దీసికొని పోవుచున్నవి. ఇట్టి యభ్యుదయ నిశ్శ్రేయస సాధనములగు పురాణములను దృణీకరింపక పఠించి కృతార్థులగుదురుగాక.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిచే రచింపబడిన "పురాణములు" అను గ్రంథము సంపూర్ణము.

"ధర్మఏవ హతోహంతి
ధర్మో రక్షతి రక్షితః"



శ్రీనివాసా ప్రింటింగ్ వర్క్సు, ఇమాంబావి వీధి, శికింద్రాబాద్

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 3 | మహాాతో | మహాతో |
| ,, | 13 | జీవుఁడు | జీవుని |
| ,, | 14 | యంత్రిమగుచున్నాఁడు | యంత్రములున్నవి |
| ,, | 16 | వాక్యోవాక్యా | వాక్యోపవాక్యా |
| 6 | 7 | వేదః | వేద |
| 7 | 18 | దాయములకంటెను | దాయముల యితర విధముల కంటెను |
| 9 | 18 | శ్లోక్త | శ్లోక్తం |
| 11 | 14 | స్పష్టి | పుష్టి |
| 13 | 1 | లైదందువలన బూటకములు | నైనందువలనఁ బూటకములని |
| ,, | 2 | పండితుల కాగ్రహము కల్గించుచున్నవి | పండితులు చెప్పిరి |
| 14 | 13 | వాదము సత్యముగావలసి | వాదమువలె హాస్యాస్పదము |
| ,, | 14 | వచ్చును అట్లుగాలేదు కాబట్టి హాస్యాస్పదము | |
| 15 | 1 | జరుగ | జరుగు |
| 16 | 1 | మొదటినుండియే | ముందే |
| 17 | 13 | సంయయా | సంయమా |
| 31 | 15 | పరిణామము | పరిమాణము |
| 32 | 3 | ,, | ,, |
| ,, | 4 | ,, | ,, |
| 33 | 9 | చంద్రగ్రహణముపై | చంద్రునిపై |
| 45 | 1 | స్పశింప | స్పృశింప |
| ,, | 14 | వాగా | వారా |
| 51 | 16 | యగ్నితో | యగ్నితో |

| | | | |
|---|---|---|---|
| 52 | 20 | యజ్ఞాన | యజ్ఞాన |
| 53 | 7 | ప్మ్రథానంబుగా | ప్రిథానంబుగా |
| ,, | 18 | గురుని | గురు |
| ,, | 3 | ధీర్మ | ధర్మ |
| 59 | 1 | బ్రిహ్మయొక్క | బ్రహ్మయొక్క యే |
| ,, | 20 | మొదలిడి | మొదలిడు |
| 80 | 21 | బూర్వ | బూర్ణ |
| 97 | 13 | స్వాగతవంవో | స్వాగతంవో |
| 102 | 10 | నోములు | నోమయి |
| 106 | 16 | పుత్రాత్పేప్రియో | పుతాత్ప్రేప్రియో |
| 111 | 12 | స్వరోన్నత్న | స్వరోన్నత్స |
| 112 | 5 | పావబ | పావస్థ |
| 113 | 3 | మాఖైప్ట | మాఖైప్ట |
| ,, | 5 | పడా | పదా |
| ,, | 17 | వాసి | వాసిను |
| 115 | 21 | భారి నాః | భావనాః |
| 116 | 8 | కారి స్వాయి | కా స్వాయి |
| ,, | 9 | శరయదా | శరదుదా |
| 128 | 19 | కై యింద్రిజాలమువలన గావి | |
| 132 | 21 | నప్రిగుద్ధ | వ్యవరుధ |
| 137 | 3 | యుండునప్లే | యుండినప్లె |
| ,, | 20 | వరస్త్రీ | పరస్త్రీల |
| 170 | 4 | నిర్వహించును | నిర్వహించెను |
| 174 | 20 | భావములు | భావముల |
| 183 | 18 | నుండినవి | నుండుగాక |
| ,, | ,, | శ్చతః | శ్చతతః |
| 224 | 12 | బొందిన | బొందిరో |
| 223 | 21 | పరమాత్మవు | పరమాత్మ |

న స ప వ ర అ ౦ ః మొదలగు వర్ణముల వ్యత్యాసములును బడి యుండును, సవరించుకొనఁ బ్రార్థితులు,

